# శ్రీ అమృత రామాయణము



శ్రీమతి కోటా ధనలక్ష్మమ్మ భాగవతారిణి

శ్రీ అద్భుత రామాయణము
శ్రీమతి కోటా ధనలక్ష్మమ్మ భాగవతారిణి

ప్రథమ ముద్రణ ; డిసెంబరు 1992

ప్రతులు : 1,000

మూల్యము ; రూ. 20/-

ముఖపత్ర రచన ; కె ద్వారకనాథ్

ఈ గ్రంథము తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆర్థిక సహాయంతో ప్రచురింపబడినది.

ప్రతులకు :
శ్రీమతి కె. విజయలక్ష్మి,
18-1-229, భవానీ నగర్,
తిరుపతి - 517 501. చిత్తూరు జిల్లా.

ముద్రణ :
శ్రీ వేంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్,
14-1-91, నెహ్రూ వీధి, తిరుపతి.

# అంకితం



ఎల్లవేళల నాకు కొండంత అండ నిల్చిన కులదైవం

శ్రీ రామచంద్రస్వామి కి

అంకితం.

# మనవి

హరికథ వృత్తిలో నిరంతరం దైవ చింతనతో గడిపే జీవనం. జీవితం నాది. స్వామి ఆజ్ఞతో భద్రాచలంలో శ్రీ కోదండరామాలయం, తిరుపతిలో శ్రీ శివరామకృష్ణ దేవాలయం నిర్మించాను. అదే రామాజ్ఞతో హరికథ ప్రక్రియలో మిడిమిడి జ్ఞానంతో "శ్రీ అమృత రామాయణము" మరియు ఇతర రచనలు రచించడం, పండిత లోకాన నాది సాహస కృత్యమే అయినా స్వామి ఆజ్ఞ శిరసా వహించాను. విజ్ఞులు నా సాహసాన్ని సహృదయంతో ఆదరించగలరని మనసారా కోరుకుంటున్నాను.

# కృతజ్ఞతలు

సాహిత్యరూపంలో భక్తి, ధర్మప్రచారానికి కొండంత దేవుని అండతో గొప్ప వారి రచనలతో పాటు నా వంటి చిన్న రచయిత్రిని సైతం ప్రోత్సహించి, గతంలో "శ్రీ రుక్మిణీకల్యాణం" పుస్తకమునకు, నేడు "శ్రీ అమృత రామాయణము" పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయమందించిన శ్రీయుతులు తి.తి. దేవస్థానం కార్య నిర్వహణాధికారికి, సప్తగిరి ఎడిటర్ గార్కి, ఎంపిక కమిటీ సభ్యులకు, సిబ్బందికి హృదయపూర్వక కృతజ్ఞతలు.

# ధన్యవాదాలు

నా వెన్నంటి ప్రోత్సహించిన గురుతుల్యులు శ్రీ కోటా సుబ్రహ్మణ్యం శాస్త్రి గారికి, పద్మశ్రీ అక్కినేని నాగేశ్వర రావు గారికి, నా పెద్ద కుమారుడు కె. సత్యనారాయణ శర్మ గార్కి, చక్కటి పుస్తక రూపాన్నిచ్చిన శ్రీ వేంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్ యాజమాని శ్రీ వేంకట రెడ్డి గార్కి మరియు ఓర్పుతో వ్రాతకు (Re-writing) సహకరించిన నా పెద్ద కోడలు శ్రీమతి కె. విజయలక్ష్మి. చిన్న కోడలు శ్రీమతి కె. సంధ్యారాణిగార్లకు, పుస్తక నిర్మాణంలో సంపూర్ణ బాధ్యతలు స్వీకరించి, చిట్టచివరి వరకు శ్రమించిన నా చిన్న కుమారుడు కె. ఆదిశేషు. వారి మిత్రులు శ్రీ కె. ద్వారకనాథ్ గార్కి నా ప్రత్యేక ధన్యవాదాలు.

ఇట్లు, రచయిత్రి,

**శ్రీమతి కోటా ధనలక్ష్మమ్మ భాగవతారిణి**

ఓం

శ్రీ రా మ జ య ం

శ్లో॥ మధురం మధురం శ్రీరామాక్షరం
అతి మనోహరం భూసుతా చరితం
జన్మ పాప వినాశం శ్రీ రామాయణామృతం
నిఖిలదేవ మునిజన వందితం శ్రీరామం భజే శ్యామలమ్

కం॥ రామాయణమను దివ్యచరితము భారతమను దివ్యచరితము
కథాసారము గీతార్థమను భాగవతము సంతోషకరమగు నాల్గువేదములు ఇలలో

మోహనరాగం – రూపకం

కరుణాకర విఘ్నరాజ – కావర మము బ్రోవర ॥క॥

మిశ్రమం: వేల్పురేడ యల్లకాలము యేమరక మమ్మేలుకొనుము ॥క॥

కల్యాణి – రూపకం

సారసాక్షి సరసిజ గర్భుసతి
కావుమమ్మ వేడుకొందు నిను
కలికీ శార్వాణి ॥సా॥

చరణం : కలికిరత్నమ మమ్మున్
కాపాడగ సమయమిదె
సత్యలోక నివాసినీ
వేదసార రూపిణి ॥సా॥

వచనం :- కైలాస పర్వతములో శివుని పాదములు పూజించుచున్నది పార్వతీ దేవి. ఆ సతీదేవి ఎన్ని విధముల ప్రార్థించినా, చూచి మాటాడలేదన్న కోపమున

కం॥ కనులగన శృంగారవతిని
యంత వేడిన గాని కరుగదు కఠిన మనసు
యెవని గూర్చి తపమాచరింతువీవు
నీకు మించిన దేవుడిక ఎందు గలడు

వచనం :- అని కోపమున స్వామీ యని అరచినంత, పరమశివుడు కనులు తెరచి. దాక్షాయణీ నీకేమి ఆపద కలిగినది అన్నాడు శివుడు. అంత సతి నాథా! సతీసుతుల విడచి నిరంతర తపమాచరించుటకు కారణంబేమి? మీరే ఈశ్వరుడు కదా! మీకన్న దైవము ఎవరున్నారు? అన్నది సతీదేవి. ఇదా నీ సందేహం సతీ చెప్పెద వినుము.

కం॥ కాకుత్స్థ వంశజుండు కరుణా సముద్రుండు
కలడు రెండక్షరముల తారకనాము డొక్కండు

వచనం :- తా ర క నా ము డా! అవును పరమేశ్వరా! ఆతడెవరో తెలుపుడు మీకన్న ఘనుడా 'ఆ'రాముడు. అవును పరమేశ్వరీ! శ్రీ అమృత రామాయణము అను శ్రీ సీతారాముల దివ్య చరిత్ర సావధానచిత్తవై వినుము.

ముప్పది ముక్కోటి దేవతలు, ప్రమధగణములు, నందీశ్వర, భృంగీశ్వర, పర్వత, నారదాదులు అందరూ వినుచున్న సమయమున పరమశివుడు శ్రీ అమృత రామాయణం చెప్పదొడగె........





శ్రీ రామ జయం

# శ్రీ అమృత రామాయణము

## కథా ప్రారంభము

## ప్రథమాధ్యాయము

## శ్రీరాము జననం

గీ॥ తెలిపెద విను రామాయణ కథ
నాకనుకూలమగు పరమ భక్తుల గూడి
వనవాసము దీర్చి వసుధ నసురుల గూల్చి
సుర, కిన్నెర, గరుడోరగులు కొలువ రామ పట్టాభిరామ రామా!

వచనం : ఉత్తర కోసల దేశమున అయోధ్యా పట్టణము కలదు.

మంజరి॥ సత్య శౌచ ఆచారపరుడు
సద్ధర్మ నిరతుండు
ఉత్తమ క్షత్రియ వంశజుండు
వురు శౌర్య ధైర్యధనుడు

వచనం :- ఆ దశరథ మహారాజుకు ముప్పురు భార్యలు, కౌసల్య, సుమిత్ర, కైకేయి. ముప్పురు భార్యలలో ఒక్కరికీ సంతానము కలుగలేదు. అరవైనాలుగు వేల సంవత్సరములు రాజ్యమేలిన ముసలి దశరథునకు రథ, గజ. తురగ పదాతులతో, సత్య ధర్మములకు నిలయమైన సూర్యవంశ సంజాతుడు. అజకుమారుడు, దశరథ చక్రవర్తి

మంత్రి సుమంతునితో సభ తీరియున్న సమయములో, పౌరులు వచ్చి, ఇలా మొరపెట్టుకున్నారు.

బాబోయ్. దండాల్, దండాల్ సామే. సిమ్మాలు, పెద్దపులులు, ఏనుగులు, అడవి పందులు, చిరతగండ్లు. ఎలుగుబంట్లు, అడవి దున్నలు, కొండ మేకలు, ఈ జంతువులన్ని వచ్చి. మా సేలన్ని పాడుసేసి పసిపిల్లల్ని ఎత్తుకుపోతుండాయ్,

మీరు వేటకు రాకపోతె పిల్ల జల్ల అంత సచ్చిపోతాం సామే, మారాజా మీ్రాకుంటే బతకలేం ప్రభూ అన్నారు.

మంత్రీ సుమంతా తెల్లవారుఝామున బల్లాలు, సూలాలు. కత్తులు అన్నీ తీసుకొని వేటకు రమ్మని చెప్పు అనగానే మంత్రి సుమంతుడు చెప్పాడు.

సిత్తం సామీ దండాల్.... దండాల్....

ంంం ంంం ంంం

దశరథ మహారాజు మంత్రితో వేటకు వెళ్ళి పౌరులతో కలసి మృగాలన్ని టిని సంహరించి కుప్పతిప్పలుగ వేశారు. మంత్రీ సుమంతా, ఈ మృగాలన్నింటినీ బండ్ల మీద వేసుకొని, అయోధ్యకు వెళ్ళండి. అలసిపోయాను. ఈ వనసీమలో విశ్రమించి వస్తాను. అని మంత్రితో దశరథ మహారాజు చెప్పాడు.

అంత దశరథ చక్రవర్తి స్వాదు ఫలహారం చేసి, సెలయేటి నీళ్ళ తాగి, పుప్పొడి రాలుచున్న చల్లని పిల్లగాలికి కొంచెంసేపు అలా పడుకొని ,ఆ వనసీమ నంతా చూచి ఆనందపడుతున్నాడు. ఆ సమయములో;

రెండు మదించిన ఏనుగులు సెలయేటి నీరు త్రాగుతుంటే దశరథుడు చూచాడు. దివ్య బాణం ఎక్కుపెట్టి కొట్టేశాడు. ఆ మదించిన ఏనుగులలో ఆడ ఏనుగు చనిపోయింది మగ ఏనుగు తప్పించుకొని పారిపోయినది. అడవి అంతా తిరిగి తిరిగి, దారి గానక నీటికని వస్తుందని, దాని సంహరింపదలచి పొదచాటున మాటుపెట్టుకొని వున్నాడు.

ంంం ంంం ంంం

కం॥ ముసలి తలిదండ్రులను కావడిలోన వుంచి
యాత్రలు సేవించి మధువనంబు జేరె అర్ధరాత్రి

వచనం :- మామిడి వృక్షము నీడ కావడి దించి, అమ్మా, నాన్నా, మీకు ఫలహారమా, మంచినీళ్ళా, ఏమి కావాలో చెప్పండి. అని యజ్ఞదత్తుడు తల్లిదండ్రులను అడిగాడు.

నాయనా దాహ బాధగా వున్నదని చెప్పగా, సొరబుఱ్ఱ తీసుకొని, ఇప్పుడే తెచ్చేదనని యజ్ఞదత్తుడు వెళ్ళాడు వనమంతా తెల్లవార్లు తిరిగినా నీటిజాడ లేదు.

తెల్లవారుఝామున దశరథుడు మాటు పెట్టుకొని వున్న సెలయేటిలో నీరు ముంచుతున్నాడు, సొరబుఱ్ఱ మూతి చిన్నది గావున బుడ బుడమని శబ్దము విన బడినది. ఏనుగు తొండముతో నీళ్ళు తాగినా బుడబుడమని శబ్దము వస్తుంది గనుక ఏనుగే వచ్చి నీళ్ళు తాగిందని శబ్దవిభేది బాణం విడిచాడు.

యజ్ఞదత్తుడను బ్రాహ్మణ కుమారుని వక్షస్థలములో గ్రుచ్చుకున్నది. ఓహో తల్లిదండ్రులారా! చచ్చిపోయాను అని అరచి పడిపోయాడు.

మంజరి : అరచి నేలబడి అల్లాడెడి నబ్బాలు గాంచి
దశరథుడు గుండెవ్రీలి బాణములు పారవైచి

గీ॥ సంతానము లేక చింతల పాలయిన నాకు
శిశుహత్య బ్రహ్మహత్య గల్గెనేడు
అని వగచి బాలుని శిరము అంకమున జేర్చి రాజు
వగచి దశరథుడంత నే పాపిననుచు

కమాచి — ఆదితాళం

పల్లవి ; ఏల వచ్చితివి ఈ విపినమునకు
ఈ నిశీధి సమయమున నాయనా ॥ఏల॥

అనుపల్లవి; పాపినై నిను చంపితిని నా పుట్టుక మాసిపోను ॥ఏల॥

చరణం; విధి నిన్ను ఈడ్చుకొని వచ్చినదా!
కలనైనా తలపనయితినే
ఈ రీతిని నా తలకు వ్రాసెనని
నా నోములు ఇట్లు పండెనా ॥ఏల॥

కం॥ సారరహితమైన సంసారమందు
భక్తియను సారము గ్రహించువాడు ముక్తుడగును

వచనం :– అని చెప్పి నబ్బాలుడు రాజా విధివిధానము తప్పదు. ఏనాటికయినా చావు తప్పదు. నీవు విచారింపక సొరబుఱ్ఱ నీళ్ళు గొనిపోయి, చెట్టు నీడన వున్న

నా తల్లి, తండ్రి దాహము తీర్పుము. ఆ తరువాత నా మరణ వార్త చెప్పుము, నాయనా! నిశీధి సమయమున మృగమనుకొని కొట్టితిని. ఏనుగు వచ్చినదని పొర బడితిని. అన్నాడు రాజు.

రాజా! నన్ను బాధించు ఈ బాణము లాగివేయుము అన్నాడు బాలుడు. దశరథుడు గడగడ వణకుచు బాణం లాగేసేవరకు యజ్ఞదత్తుడు శివోహం, శివోహం అని పరమేశ్వరునిలో లీనమయ్యాడు.

ంంం ంంం ంంం

ఘోరముగా ఏడ్చుచు సొరబుఱ్ఱ గొనిపోయి 'ఓ తల్లిదండ్రులారా! ఇదిగో జలము. దాహము తీర్చుకొనుడు' అని దశరథుడు అనగానే మాట గుర్తించి

ఎవరు నీవు? మా కుమారుడేడి?

కన్నడ — ఏకతాళం

పల్లవి ; ఎవడవురా నీవెవడవురా

అనుపల్లవి: మతిమాలితిమని తలచితివా ॥ఎవ॥

చరణం : కన్న సుతుని గానలేక - కలవరపడు మముఃబోంట్లకు
పెన్నిధివలె మమ్ము ఆదరింప వచ్చిన దేవుడవ ॥ఎవ॥

వచనం :– కన్నీటిధారలతో వారి పాదములు బట్టి, ఇక దాచిన ప్రయోజనము లేదని, ఏనుగనుకొని రాత్రివేళ అగుపడక, మీ కుమారుని బాణముతో కొట్టితిని. మహాత్ములారా! నా తప్పులు మన్నింపుడు.

అది విన్న యజ్ఞదత్తుని తల్లిదండ్రులు కన్నీటి కాలువలుగా ఏడ్చుచుండిరి. మా కుమారుడు లేక మేము బ్రతుకగలమా?

సీ॥ తీర్థయాత్రలు చేయించి
పుణ్య జలముల స్నానమాడించువాడు
ఫలములు గొని వచ్చి తేనెలతో
తినిపించి ఆకలి తీర్చువాడు
ఎండలకు వానలకు కందనీయక
ఆకాశ గొడుగువలె ఆదరించువాడు

వేదములు శాస్త్రములు చదివి
మాకు మధురముగ వినుపించువాడు

గీ॥ వనములో కావడి యందు మమ్ముంచి
భుజములు కాయలు గాచునటుల మోయువాడు
కనులు కానరావు చెవులు వినబడవు
లేవలేము బ్రతికియుండలేము

వచనం :- నాయనా యజ్ఞదత్తా అని, పాపాత్ముడా! మేమెలా పుత్రా, పుత్రా అని ప్రాణాలు విడుచుచున్నామో. నీవు కూడా పుత్రా, పుత్రా అని ప్రాణాలు విడుతువు గాక! అని శపించి యోగమహిమతో ముని దంపతులు ప్రాణాలు విడిచారు.

దశరథుడు హా! దైవమా యని మూర్ఛబడిపోయాడు. కొన్ని ఘడియలకు మేల్కాంచి

మంజరి కలుగు తనకు మరణంబని
ఘోరముగా విలపించి
సంతానము కలుగునన్న
ఆశతో సంతసించి

వచనం :- వారి శాపమునకు వగచి ముప్వురు కళేబరములను ఒకచోట చేర్చి, గంధపు చెక్కలతో దహనం చేసి, రాజ్యం చేరుకున్నాడు దశరథ చక్రవర్తి.

వశిష్ఠ మహాఋషికి నమస్కరించి చింతించుచుండ, చింతించు దశరథునితో వశిష్ఠ మహాఋషి ఇట్లనియె.

దశరథా! పుత్రకామేష్ఠి యాగం చేసితివేని సంతానం తప్పక కలుగును.

మంజరి: పుత్రహీనుడగు దశరథునితో
బలికె సద్మౌని ఇట్లు
చింతింపనేల పుత్రకామేష్ఠి
సేయ నీకు ఫలమబ్బు

వచనం :- గురుదేవా! అరవై నాలుగువేలవత్సరముల వృద్ధునకు సంతానమెట్లు కలుగును? అన్నాడు దశరథుడు. తప్పక కలుగుతుందని చెప్పారు వశిష్ఠులవారు.

గీ॥ పుత్రకామేష్ఠి సలుపగ పూనుకొనియె
సత్యవ్రత నిష్ఠాదురంధరుండు నయిన
అజకుమారుడు దశరథ నృపవరేణ్యు
పుత్రకామేష్ఠి సలుపగ పలికెనిట్లు

వచనం :- గొడ్డు వారికి బిడ్డలు కలుగరు. ఎద్దు ఈనునా? ఋతువు దప్పిన పంటలు పండునా? అనిన, దశరథుని చూచి ఓ రాజా! చెప్పెద వినుము.

ఉ॥ సనకస నందనాది మునిపుంగవులయిన మహాత్ములు
ఒక్కప్పుడు అబ్జదళ నేత్రుని గనుగొను ఆశతోడ
దరిసనము గోరి వైకుంఠ మందిరమునకు బోవ
రమాపతిని గూడి హరి చరించెడి వేళయన నెట్టగబోవ నా మునీశ్వరులును

వచనం :- బలవంతముగ తలుపులు సనకస నందనాదులు నెట్టబోవ, జయ విజయులు కోపమున వారిని నెట్టిరి. సనకసనందనాదులు మహా కోపమున

గీ॥ విశ్వరూపుడగు హరిని దర్శింప వచ్చిన మమ్ము
నెట్టిన మీరు రాక్షసులై జన్మింతురు గాక
అని శాపమొసంగి చనగబోవ
సనకసనందనాదులు, హరి తలుపులు తెరచి వచ్చి

వచనం :- సనకసనందనాదులు హరిని దర్శించి, మా ద్వారపాలకులను శపించి నందులకు క్షమింపుడనిన, జయవిజయులు మునుల పాదముల బడిరి.

భైరవి రాగం — రూపక తాళం

పల్లవి : అపచారము - సయిపుడయ్యా

అనుపల్లవి: ఘనమునివర్య - నేరక మీ మహిమలు
నొనరించితిమి అపచారము ॥అప॥

చరణం ; తాపసులకు దీర్ఘ కోపము
తగదు గాన దయ వహించి
శాపము వుపసంహరించి
సరగ కావుడు దీనుల మము ॥అప॥

వచనం :- అని వేడిన మహా ఋషులు మీ దరిశనము వలన మేము ధన్యుల మైతిమి అన్నారు. ఋ షు లా రా! జయ విజయులకు శాప విమోచనము చెప్పి ధన్యులుగా చేయుడు.

జయ విజయులారా! ఏడు జన్మలలో విష్ణువుకు మిత్రులై వైకుంఠము చేరుదురా? మూడు జన్మలలో హరికి విరోధులై వైకుంఠము చేరుదురా? మూడు జన్మలే ప్రసాదింపుడని వేడుకొనిరి. మూడవ ద్వారపాలకుడు కుముద్వతుడు నేను నెట్టలేదే నిరపరాధిని నన్నూ రాక్షసుడై పొమ్మని శపించారు. ఎందుకు నాకు శాపం ఇచ్చారు? అవును నీవు నిరపరాధివే. కాని మా శాపం అనుభవింపకతప్పదు మొదటి జన్మలో హిరణ్యాక్ష. హిరణ్యకశిపులుగ పుట్టిన వారికి నీవు ప్రహ్లాదుడవై మృత్యువు చేకూర్చుము. రెండవ జన్మలో రావణ, కుంభకర్ణాదులుగ పుట్టినవారికి విభీషణుడవై మృత్యువు చేకూర్చుము మూడవ జన్మలో కంస, శిశుపాలురుగా జన్మించిన వారికి నీవు అక్రూరుడవై మృత్యువు చేకూర్చుము అని చెప్పి, మహా ఋషులు వెళ్ళిపోయారు.

జయ విజయులు హిరణ్యాక్ష. హిరణ్యకశ్యపులుగ పుట్టారు. హిరణ్యాక్షుని భార్య హరుషాంబ గర్భవతి. మట్టి తినాలని కోరుకున్నది.

కం॥ వేదశాస్త్ర ప్రవీణులనుచు మిట్టిపడి తన సతి హరుషాంబ కోరుకొనుము
గర్భవతివి ఏమి కావలయునో యనిన మన్ను తిన మనసు గలిగే

వచనం - విని హిరణ్యాక్షుడు వెళ్ళిపోతున్నాడు, భూమిని చాపగా చుట్టుకొస్తానని ఇంతలో నారాయణా, నారాయణా యని నారదుడు అడ్డు వచ్చాడు.

ఓ హిరణ్యాక్షా ఎక్కడికి నీ ప్రయాణం? నేను నా సతి హరుషాంబ కమ్మని మన్ను తెమ్మనియె. నేను భూమిని చాపగా చుట్టుకొస్తానని పోవుచుంటిని. మళ్ళీ వస్తావా? అన్నాడు నారదుడు. మళ్ళీ వచ్చేది ఎక్కడిది? నీకదే త్రోవ పో.

## మాల్కోస్ — ఆదితాళం

పల్లవి : ఏమి స్వామి మీ లీల బ్రహ్మాదులకే తెలియదు కదా ॥ఏమి॥

చరణం : మశ్చ కూర్మ వరాహాది నారసిహ్మ వామన
రామో రామ రామశ్చ బౌద్ధ కలిక వచః ॥ఏమి॥

వచనం :- ఈ విధమున హిరణ్యాక్షుడు సముద్రమున దూకి భూమిని చాపగా చుట్టుచున్నాడు. అప్పుడు భూదేవి, నారాయణా! కాపాడవే అని మొరలిడగా, అప్పుడు శ్రీహరి బ్రహ్మ నాసికాగ్రము నుండి అంగుష్ఠమాత్రమున వరాహావతారుడై జన్మించి, తన కోరలతో నెత్తి భూదేవిని గాచి, హిరణ్యాక్షుని సంహరించె.

ఆ వరాహమూర్తిని దేవతలు ప్రార్థింప, తిరుమలమహాక్షేత్రమున భూదేవితో ఈశాన్య భాగమున నివసించి, భక్తులను గాచుచుండె. తన భక్తుడగు ప్రహ్లాదుని హిరణ్యకశ్యపుడు బాధించుచున్న స్తంభంబున వెలసి నరసింహావతారుడై హిరణ్యకశ్యపుని సంహరించె. సకల దేవతలు ప్రార్థింప యాదగిరిని నివసించి, సకల భక్తులను కాపాడుచుండె.

దశరథా! పుత్రకామేష్టి సేయుమన, దశరథుడు ఏల హరి జన్మించును అన మూడు జన్మలలో హరి నీకు కుమారుడగునట్లు వరము కోరితివి. మొదటి జన్మమున అదితి, కశ్యపులుగ పుట్టిన మీకు వామనావతారుడై జన్మించెను. రెండవ జన్మమున సత్కీర్తి మహారాజుగా పుట్టితివి. ఈ కౌసల్య, సుమిత్రలు నీకు అప్పుడు భార్యలే. సంతానము లేక లక్ష్మీ నారాయణుల దేవాలయం కట్టించితివి. ప్రతి నిత్యము దర్శించి తీర్థప్రసాదములు తీసుకొని, సంతానఫలమిమ్మని వేడుకొంటివి. నీవే మాకు కొడుకుగా పుట్టుమని వేడుకొంటివి.

మీ రాజ్యములో ఒక సద్బ్రాహ్మణుని భార్య గయ్యాళిగంప. జపమాలలు, కృష్ణాజినము, దర్భాసనము అగ్నిలోవేసి కాల్చివేసేది అన్నం పెట్టక రోజు తన్ని తొడపాశముపెట్టి బాధలుపెట్టేది. ఆ బాధ భరించలేక ఆ బ్రాహ్మణుడు వేరొకకన్య వుత్తమరాలను పెండ్లాడి అమె ఎదుట కాపురము పెట్టెను. సవతి మత్సరముతో పెద్దభార్య, ఆ గయ్యాళి, భర్తను ఏమనలేక కోపముతో విషము తాగి చనిపోయెను. యమకింకరులు ఆమెను నరకానికి తీసుకొని పోయిరి. నానా హింసలు పెట్టిన తరువాత, మొదటిజన్మలో కుక్కగా జనించె. రెండవజన్మలో రాక్షసిగా జన్మించి నీ రాజ్యములోని అడవిలో చేరి అనేకమందిని బాధపెడుతున్నది, సత్కీర్తి మహారాజు దాన్ని చంపాలని ఎన్నో ప్రయత్నాలు చేశాడు కాని సాధ్యపడలేదు.

ఒకనాడు వూరి వెలుపల లక్ష్మీ నారాయాణుల గుడి ద్వారములో వచ్చి నిలబడి, మీరు పూజకు పోవుటకు మార్గమీయక బెదరించుచుండె అప్పుడు భయపడక ఓం నమో నారాయణాయ యని తులసీ జలములు దానిపై ప్రోక్షించగానే, ఆ రాకసి రూపము అలానే వున్నది గాని, పూర్వజన్మ జ్ఞాపకం వచ్చింది.

దారి ఇచ్చింది. తాను చేసిన పాపం గుర్తుకు తెచ్చుకుంది. మహారాజు పాదాలబడి నాకు శాపవిమోచనం చేయుమని కోరింది. హే నారాయణా! నీ లీలలు అద్భుతాలు ఇంక ఎప్పుడు మాకు సంతానం కలిగిస్తారు స్వామీ అని ఆ పుణ్య దంపతులు వేడుకున్నారు. అప్పుడు లక్ష్మీనారాయణులు ప్రత్యక్షమై

సత్కీర్తి మహారాజా! ఇదే భార్యలతో దశరథ చక్రవర్తివై జన్మించినపుడు మూడవ జన్మలో మీకు కుమారుడుగా పుడతానని చెప్పాడు.

ఈమెకు శాపవిమోచనం చేయుమనికోరగా, వచ్చే జన్మలో నీకు మూడవ భార్యగా అనుసరిస్తుంది. నీ తపోశక్తి సగం ఆమెకు ధారపోస్తే ఆమెకు మానవ రూపం వస్తుంది. అలానే చేశాడు. ఆమెకు మానవ రూపం వచ్చేసింది. భార్యకు భర్తలో సగం వుంటుంది గనుక, నీ పుణ్యం సగం ధారపోశావు గనుక వచ్చే జన్మలో ఆమె నీకు కైక పేరుతో భార్యగా వుంటుంది అని చెప్పి అదృశ్య మయ్యారు.

ఆ జన్మ మారి ఇప్పుడు దశరథుడు, కౌసల్య, సుమిత్ర, కైకగా వున్న మీకు నారాయణమూర్తి కొడుకుగా పుట్టబోతున్నాడు. ఆ దేవరహస్యం చెబుతాను విను.

ఒకానొక సమయంలో దేవతలంతా రావణ, కుంభకర్ణాదుల బాధలు భరించ లేక వైకుంఠానికి ముప్పదిమూడు కోట్ల దేవతలు నారదుడు, భూదేవతలతో వెళ్ళి నారాయణమూర్తిని ప్రార్థించారు.

సీ॥ క్షీరాబ్ధి శయన కాపాడ రావె
నీకన్న మాకు దిక్కు లేదు
శేషాద్రి శయన లక్ష్మీసహితుడవై
కాపాడు మా కష్టములు తీర్చి
శంఖ, చక్ర, గదా ఖడ్గధారి
పాలించవా దుష్ట జనుల గూల్చి
మణిమయ రత్నకిరీట కుండల
కర కంకణ తార హార కాపాడు మమ్ము

గీ॥ ఆశ్రితావన మమ్ము ఆదరించ రమ్ము
సాధుజనావనా వనమాలి అదరించు
సకల సద్గుణ పుంజమా కనికరించు
రావణాద్రి రాక్షసుల గూల్చి అనుగ్రహింపు మమ్ము

వచనం :- అని వేడిన దేవదేవుడు వెయ్యి సంవత్సరములకు ఒకపరి యోగనిద్ర నుండి లేచి మీకు గల బాధలు తీర్చి కాచెద. మీరు నిశ్చలాత్ములై యుండుడు.

అనిన దేవదేవా! రావణ, కుంభకర్ణులు, అనేక రాక్షసులు పతివ్రతలను, గోవులను, దేవతలను, సాధువులను, మునిపుంగవులను యజ్ఞముల వైచిరి. తల క్రిందులుగ వ్రేలాడగట్టి, మంటలు వేసిరి. లక్ష్మీపతీ! రక్షింపుడు అని వేడిన, శ్రీహరి నేను కౌసల్య, దశరథులకు నరుడనై రాముడనే పేర జన్మించి. ఆ రాక్షసులను వధించెద,

గీ॥ మొదటి జన్మమున వేదవతిగ జన్మించి
రెండవ జన్మమున రావణు నాసికమున పుట్టి
మూడవ జన్మమున భూమిసుతవై జనించి
జనకరాజ సుత సీత యనగ చేరి పెండ్లాడువాడు

వచనం :- నర వానరులు దక్క ఎవరి వలన మరణము లేక వరము పొందిన కారణమున మీమీ అంశలతో వానరులను పుట్టింపుడు నా శేషుడే లక్ష్మణుడు శంఖ, చక్రములే భరత, శత్రుఘ్నులుగా జన్మింతురు. మీరు నిశ్చింతగ మీమీ స్థానములకు చేరుకొనుడు అని చెప్పిన శ్రీహరి మాటలు విని యెల్లరు హరిని పాడుచు పోయిరి.

దశరథా! నా మాట విని యాగము చేయుము అన్నారు వశిష్ఠులవారు, నారాయణుడు మాయలో ఎందుకు పడాలి? దానికి గల కారణము తెలుపుడు.

## చక్రవాకము – ఖండగీతి

పల్లవి : సంచారియై తిరుగు - నారదుడు ఒకనాడు

అనుపల్లవి: రోసి మనసు ఒక్కచోట కూర్చొని సంచారియై
ఘోరాటవి చేరి, తపస్సమాధిలో చేరి
యెన్నియో వత్సరములు తపమాచరించెను

చరణం : అది గని సహింపక తనకు వేటేమో యని
రంభా, మనన్మథుల బంపె తపోవనములకు ॥సం॥

కం॥ ఆడిరి ఆరు మాసములు పాడిరి గొంతుపోవ
వేసెను మన్మథ బాణములు వేసిరి అరువదినాల్గు
భాషలలోని భావములతో పదములు అరిగిపోయె
ప్రాణాంతకమాయె భరించలేక మౌనికి మ్రొక్కి

వచనం :- నారదుడు ఎన్ని విధములు చేసిన చలించక కామవిజయం పొందా నని సంతోషముగా వున్నాడు. రంభా మన్మథులు నారదుడు శపింతురేమో యని నమస్కరించి తమ లోకమును చేరుకొనిరి. బ్రహ్మలోకానికి వెళుతున్నాడు నారదుడు

కాఫి — ఆదితాళం

పల్లవి : రా రా రా రా భారతీపతీ రా

అనుపల్లవి: విద్యల తల్లిని సతిగా గొన్న

చరణం ; విష్ణు నాభిలో అవతరించితివె
రూపనామములు లేని బ్రహ్మవై
వెలిగించేవూ లోకాలన్ని
ఏలుకొన రా భారతీపతీ రా ॥రా రా॥

వచనం :- నాన్నా! నమస్కారం. ఎక్కడ నుండి రావడం? నాన్నగారు కామ విజయం పొందాను రంభామన్మథులను ఓడించాను. కుమారా! ఎంత ఘటికుడ వోయి. నాకన్న గొప్పవాడివివోయి నీవు. నేనొకప్పుడు పార్వతిని ప్రేమించి పరాభవపడితిని. నారదుడు బ్రహ్మ వాక్కులకు వుబ్బితబ్బిబ్బయి నారాయణా, నారాయణా అంటూ బయలుదేరాడు.

నాదనామక్రియ – ఖండగతి

పల్లవి : కరుణించరా మమ్ము కైలాసవాసా

అనుపల్లవి: నీ దయ కల్గిన లోటేమి మాకు

చరణం : అల మార్కండేయుని ఆదరించితివి
ఇల శిరియాళుని కరుణించితివి
బాణాసురుని ఇంట బంటువై నిలచితివి
రావణు కరుణించి ఆత్మలింగ మొసంగితివి ॥కరు॥

వచనం :- కైలాసవాసా! పాహి, పాహి. పాహి దయామయుండవు అన్నాడు నారదుడు. నారదా! నీ జాడే లేదే అన్నాడు పరమేశ్వరుడు నేను కామవిజయం పొందాను. రంభామన్మథులను ఓడించాను అన్నాడు. ఓహొహొ! ఎంతటివాడవు నాకన్న ఘనుడవు నేను మోహిని రూపంలో వున్న విష్ణువుని మోహించాను. నీవు నా కన్న గొప్పవాడవు అనిన పొంగి, వైకుంఠము చేరబోయె. లక్ష్మీపతీ! ఓం నారాయణాయ నమః,, ఓం నమో నారాయణాయ నమః అని నమస్కరించె. ఏం నారదా! నీ జాడయే లేదే? శ్రీహరీ! నే తపమాచరింప, ఓడింప వచ్చిన రంభ, మన్మథుల ఓడించితిని. కామవిజయం పొందితిని. అహా హహ ఎంత జితేంద్రియుడవు. నారదా, కామవిజయమ్మే పొందితివా!

మంజరి ; అనఘా! నిన్ను మించిన మహాత్ముల నెందు గనము
కామవిజయమూ పొందిన ఏమని వచింతు నిన్ను

వచనం :- అని పొగడిన ఆనందించి, మహాగర్వమున పోయివచ్చెదనని, తాత, అవ్వ గారికి నమస్కరించి, వెనుకకు మరలిపోవుచుండె.

నారాయణుడు వీని జితేంద్రియము పరీక్షింపదలచి పోయెడి మార్గమున

కం॥ కనబడె సౌధరాజమును కనియె కోటతోటలున్
కమనీయ్యముగా రాజు ఎవ్వడు? రాజ్యమెవరిదీ?

మంజరి ; ఏమి వింత సౌధరాజమును ఎందుండి వచ్చెనిపుడు
కానీ వచ్చితినికద ఇంతలోపల ప్రత్యక్షమయ్యెనంత

వచనం :- సింహద్వారం చేరెనంత. ఆ మహారాజు తన కూతును గొని వచ్చి పాదముల బడవైచి. నారద మహాఋషీ! ఈమె పతి ఎవ్వడగునో, మీరు త్రికాలవేదులు కదా! సెలవిండు స్వామి అని అన్నాడు. ఆ మాటలు నారదుని చెవున పడె వరకు ఆ అమ్మాయిని చూచి ఇలా వర్ణిస్తున్నాడు ఏమి చక్కదనము.

చక్రవాకం — రూపకం

పల్లవి : ఈమె వయసు చక్కదనము
నలవియె వర్ణింప నిల

అనుపల్లవి: సతులలోన ఈ సతికి
సాటియైన వారు కలరె ॥ఈమె॥

చరణం : సొగస, వర్ణింపగ ఇల మనసా
యెను, ఈమె గొన పలుకరించిన యంత
రూపము గనె మగ్నుడనై పోతిని
పలికిన ముత్యము లొలుకును ॥ఈమె॥

శా॥ వాక్కులతోడ జెప్పనేరడు ఇదేమి యని వచింపడు వాక్కులతోడ జెప్పనేరడు
నాదు కన్య వుద్వాహమునాడి సుఖించెడి భాగ్యము తోపలేదు
వచింపగ సందియము సందియమేలనో కదా! పావనమూర్తి
కులసంభవ మము కరుణింప్పవేడెదన్

వచనం – అప్పుడు తెలివితెచ్చుకొని, ఈమె పతి ఎవరాయని యోచింపచుంటి మహారాజా. ఆ నారాయణుడే నీకు అల్లుడగును. పోయివచ్చెద. స్వయంవరమునకు వచ్చెద. దయ వహింపుడు నని మరల వైకుంఠము చేరి శ్రీహరికి నమస్కరించె.

నిలచియున్న నారదుని చూచి శ్రీహరి ఇట్లనియె.

ఉ॥ మెచ్చితి నీదు భక్తియుక్తులకు నారదా!
నిశ్చలచిత్తుడవు సుజనావళి కన్న మేలయినవాడవు
శ్రీహరి కృపా వీక్షణాక్షుల నాకన్న గొప్పవాడవు
మహేశుకన్న, బ్రహ్మకన్న, ఇంద్రుడికన్న మిన్నవే కదా!

వచనం – నారాయణా! నీ రూపము ఒక్కపరి, ఒక్క దినము ఇచ్చిన చాలును. వివరములు అడుగకుము. ఇచ్చితిని నా రూపము. పోయిరమ్ము. నారదుడు తన అందము చూచుకొను వ్యవధిలేక విష్ణురూపములో వున్నానని నారదుడు సరాసరి స్వయంవరానికి చేరినంత.

రెండు సింహాసనములు మిగిలినవి. ఒకటి విడచి కూర్చొని ఫష్టుసీటు నాదే అనుకున్నాను కదా! అప్పుడే సభ నిండిపోయినది. సరేనని రాజులను, రాచకన్యను నిక్కినిక్కి చూచుచు, బోరవిరచుచు, ఈలపాట పాడుచు, తుమ్ముచు, దగ్గుచు, వీణ మీటుచు వింతచేష్టలు చేయుచుండె. నారదుని ప్రక్కన నారాయణుడు నారదుని ప్రక్కన కూర్చొనియె.

సీ॥ అద్దంబు, మరపించు చెక్కుటద్దంబులు
పెన్నొసటి ముంగురులు కదలియాడ
పగడంపు తీరగు పెదవులు మల్లెమొగ్గల పన్నులమరె
నల్లత్రాచును బోలు వాలుజడ ఒడ్డు పొడవు

గీ॥ పోతపోసిన బంగారు బొమ్మగాని కొమ్మగాదు
రంభ ఊర్వసి తలదన్ను ఇంతి సొగసు
కలువరేకులు మించు నాకన్నుదోయి
అ హ హా ఏమని పొగడగలను నేను

వచనం :– పూలమాల గొని నా బాల రాజులను జూపుమన, చెలికత్తె రాజుల చూపదొడగె.

సీ॥ ఈతడు వంగదేశపు రాజుఅనిన
యువరాణి; చేతులు నలమనేల

వచనం :– వంకాయలు తిని గజ్జి వచ్చినది.

సీ॥ ఇతడు బెండదేశపు రాజు అనిన
యువరాణి; సాగుచున్నాడదేల?

వచనం :– అతడు బెండకాయలు తిన్నాడు గనుక సాగుతున్నాడు.

సీ॥ ఇతడు కళింగదేశపు రాజు.
యువరాణి; కన్నులు విలికించుచున్నవాడు.

వచనం :– కళింగదేశపు వారు కనులు విలికించుచునే వుందురు.

సీ॥ ఇతడు శల్యదేశపు రాజు
వారికి శల్యములే వుండు.

వచనం :– ఇతడు నాకు తగడు. చనుము.

సీ॥ ఇతడు గాలిదేశపు రాజు అనిన
యువరాణి; గాలిలో తేలిపోయె

వచనం ;– తగడు నాకు అని చనియె.

సీ॥ ఇతడు బంగాళా దేశపు రాజు అనిన
యువరాణి; పక్షవాతము అనియె.

వచనం ;– బంగాళా దుంపలు తిని పక్షవాతం వచ్చింది.

గీ॥ కాశ్మీర రాజు ఇతడు వరింతువేని
ఇతడు బర్బర దేశపు రాజు ఇతడు
కేకయ దేశపు రాజు ఇతడు కోసల
దేశపు రాజు. ఇతడు నేపాళ రాజు
వెఱ్ఱివాడు, కోరుమన నారదుని దరిజేరినంత

వచనం :- నారద మహా ఋషి నా వంకకె వచ్చెనని, నెత్తిన పెట్టుకొందు· పాదములు కందనివ్వనని అనుకొను సమయమున

మంజరి: తలవంచి మాల వేయుమనిన నా జవ్వని కదలిపోవ
రాజరూపమున నున్న నారాయణునకు పూదండ వేసె
కోపమున జూడ నారదుడు
పొలతి చెక్కిళ్ళలో కోతి మొగము జూచె

వచనం ;- పట్టరాని కోపమున నున్న నారదుడు పట పట మని పండ్లు కొరికి తనకు విష్ణు రూపమిమ్మంటే కోతి మొగమిచ్చెనని చురచుర చూచుచుండ, లక్ష్మీ నారాయణులు దక్క ఎవ్వరూ లేరు. అది సముద్రము. ఒడ్డున జేరి లక్ష్మీనారాయణులు పక పక మని నవ్వుతున్నారు. రాజ్యము లేదు. రాజులు లేరు. విష్ణు మాయ అది.

బిలహరి — ఆది

పల్లవి : మాయలమారీ మహాత్ముడగుదువె
అనుపల్లవి: మాయ నాటక మాడించెదవ ॥మా॥

చరణం : నీ నటనలు - నీ చేతలు నేరరంచు నెంచితివా
వజ్రమను అగ్నికణమును చేతగొన్న అభాగ్యుడను నేను ॥మా॥

చరణం : కోతి మొగమొసంగి మోసము చేసితివి గాన
ఈ రాజరూపమున నీవీ సతిని యెడబాసెదవు గాక ॥మా॥

వచనం ;- నారదా! కామ విజయం పొందితినని గర్వపడి నందుకు నీ కామ విజయం పరీక్షించితిని. ఆఁ ఆ; కేశవా ఎంతపని చేసితివి. అమ్మా జగజ్జననీ! నీవు కూడా అవమానం చేసితివి గాన, రెండుజన్మలలో నీ పతికి దూరమై మూడవ జన్మలో కొంతవరకు పతివియోగమనుభవించి, ఈ కోతుల సహాయమున నీపతిని చేరుదువు గాక అని శపించాడు నారదుడు. నారదా! నా శాపము వుపసంహరించుము అని నారాయణమూర్తి అడిగాడు. ఈ కోతుల సహాయమున నీ సతిని చేరుకుంటావని శాపం వుపసంహరించాడు.

తపసిని గని అజ్ఞానము తొలగించితివి. నన్ను దూషింతువా! జ్ఞాననేత్రము గనుము. శ్రీహరీ! అని పాదముల వ్రాలి, తిట్టితినా, నా తెలివి తెల్లవారినది. నా తప్పులు మన్నింపుడన, నారదా! నేను రామావతారం ధరించుటకు నీ శాపము

సరియైనది. విచారపడకుము. నారాయణా! నాలో ఎన్ని తప్పులున్న మన్నించి నాకు శలవొసంగుము. నారదుడు చనియె.

ఆ కారణమున నీకు కుమారుడుగా జనించునన, దశరథుడు స్వామీ! నాకు సంతోషముగా వున్నది. సుముహూర్తము నిర్ణయించి నన్నాశీర్వదింపుడు అన్నాడు దశరథుడు.

దశమి, శుక్రవారం, శ్రావణమాసం దశమి. శుక్రవారం, మూడు దినములు వున్నది. దశరథుడు మంత్రి సామంతులకు అయోధ్య అలంకరింపుడని, శుభలేఖలు బంగారు పత్రముల శుభలేఖలు వేయించిరి. దేవా! ఈ పుత్రకామేష్ఠి యాగం చేయించి పుణ్యము కట్టుకొనుడు అన్నాడు దశరథుడు. దశరథా! పుత్రకామేష్ఠి యాగం చేయగల మహాఋషి ఋష్యశృంగుడు, అంగదేశాధీశుని అల్లుడు. అతనిని బిలుచుకరమ్మన్నాడు వశిష్ఠుడు. అంత దశరథుడు స్వామీ మీకన్న గొప్పవారు వున్నారా? అన్నాడు. అంత వశిష్ఠులవారు ఆ మహాత్ముని మహత్యం చెప్పెదను వినుము.

అంగదేశంలో ఒకానొకప్పుడు కరువు పుట్టింది.

మోహన — రూపకం

పల్లవి : కరువు పుట్టె అంగదేశమున

అనుపల్లవి: ద్రావుటకు నీరు లేకపోయె
బంగరు నగలు యెన్ని యున్న
చేరెడు గింజలు లేకపోయె ॥క॥
గంజి కూడా కరువే ఆయె
ఆకలి మంటకు చచ్చిరి ప్రజలు ॥క॥

వచనం :- గోవులను పోషించలేక పోషించుకొనుడని వాటి మొఖమున చీటీలు అంటించి ఇతర దేశములకు వెళ్ళగొట్టేశారు.

గొఱ్ఱెలు, మేకలు; ఈ విధముగ ప్రజలు ఇతర దేశములకు పోయిరి. రోమపాద మహారాజు మూడు వత్సరములు కరువు ననుభవించి కులగురువు నడిగిన నైమిశారణ్యంలో ఆ మహాత్ముడు ఉన్నాడు, అడుగు పెట్టిన వర్షము కురిసి, పంటలు పండును.

వెలజాణలైన వేశ్యలను పంపి అతని తపస్సమాధి నుండి దోడ్కొని వచ్చి రేని మీకు శుభము కలుగును. నలుగురు వేశ్యలను పిలిపించి, మంగళ భేరీమృదంగ వీణా వాయిద్యములతో షడ్రసాన్నములతో జని, నృత్య, సంగీత, నాట్యములు ఆరు మాసములు చేసిరి. పుట్టలు పెరిగి యున్న ఋష్యశృంగుడు కనులు తెరచి చూచేవరకు, పుట్టలు మాయమైనవి.

కల్యాణి — ఆది

పల్లవి : రారా, నా స్వామీ

అనుపల్లవి: మము వుద్ధరింపగ దయతో ॥రారా॥
సకల వేద సంపూర్ణుడీవనీ
పలికిరి మహానుభావులు ॥రారా॥

చరణం : లోకము లెరుగని దేవదేవుడవు
వేగమె రమ్ము - మాతో వేవేగ ॥రారా॥

వచనం – అనిన ఋష్యశృంగుడు వారిని గని

జితేంద్రియులు - దినకరతేజులు
నిరత సద్ధర్మ నిరతులు మీరు
గురువర్యులు సరస సంభాషణ చేయు చతురులము మేము
సరగున మము జేర సమయమిదేర

చరణం : మరుని గెల్వనేరక - నీ మరుగు జొచ్చితిమి
శరనంటిమిరా - శరశత్రుభారికి త్రోయకురా
సరగున మమ్ము కౌగిలి చేర్చుకొనరా
రారా వెన్నెల వన్నెకాడ ॥రా॥
సస. నిప. రిసనిప గరీసనిప.

వచనం – ఆ వేశ్యలను జూచి ఋష్యశృంగుడు చిరునవ్వు నవ్వి

కల్యాణి — రూపకం

పల్లవి : తపసులార – మీ దరిశనమున

అనుపల్లవి: ధన్యమయ్యె – నా జన్మము తరియించె ॥తప॥

సీ॥ పఠియింప మా వేద పఠన సారము
ఇపుడు మీ వేదమ్ములవలె మధురము గనము
మా భూతినది ఏమి మీ భూతి వలె
కమ్మని త్రావి గానలేము
మట్టి యూడల రీతి మా జడలల్లును
మీ జడ నొక్క కుచ్చు యల్లె నిట్లు
మాకు గడ్డములు, మీసములు విరివిగా వున్నవి
మీకు యురమున కొమ్ములెట్లు గలిగె

గీ॥ అతి మనోహర రూప లావణ్యమెల్ల
కలిగి ఒర్త్తిల్లు మీ దేశములకు ఒత్తుననిన
మహాత్ముని గని నెవ్వెరపాటు చెంది
సఫలమయ్యె నటంచు పలికెనిట్లు

మంజరి ; సకల జనుల రక్షింప దలచిన
శంకర అవతార
పురుషా యెఱుగవు పురుషులు
స్త్రీలెట్టి వారో
యెఱుకపరుతుము - మా వెంట రమ్ము ధన్యులము॥

వచనం ;- జడలు చిక్కుతీసి

ఉ॥ జడల చిక్కుతీసి క్రొమ్ముడి గట్టి తిలకము దిద్ది వస్త్ర అభరణముల నమర్చి
మధుర పక్వాన్నముల మెక్కజేసి గొంతు వరకు
కుదురుగ పల్లకిలో కూర్చుండజేసి అద్దము జూపించి
అతడు నవ్వ, మంగళవాయిద్య మధురసంగీతములతో తెచ్చిరి తమదేశ మనకు

వచనం :- ఋష్యశృంగ మహాఋషి అడుగు పెట్టగానే వర్షము కురిసె, ఏర్లు, చెరువులు నిండె. యెల్ల ప్రాణులకు బ్రతుకుపై ఆశ కలిగె,

రోమపాద మహారాజు దేశమంతా సంతోషంగా వున్నారని, తన కూతురు శాంతనిచ్చి ఋష్యశృంగునకు వివాహము చేసె.

కాన దశరథా! నీవు దంపత సమూతమేగా ఆ ఋష్యశృంగుని

పిలుచుకొని రమ్ము. దశరథుడు వెళ్ళి రోమపాద మహారాజుతో సహా ఋష్యశృంగ మహాఋషిని పిలుచుకొని వచ్చాడు.

ooo ooo ooo

మంజరి ; పట్టణంబున కవ్వల కొలత యోజనము గల
యజ్ఞశాల వేసి, పదిలక్షల బ్రాహ్మణుల రావించి
నవ బృథ స్నానంబు చేసి కౌసల్య దశరథుల
బ్రహ్మ వశిష్ఠ హెూతలు యజ్ఞావల్కులు
సదస్యులు రుగ్విజులుగాగ
రుషులు, రుష్యశృంగుడు ఏడు దినములు పుత్రకామేష్ఠి నడిపె
సకల ద్రవ్యములు అనేక సమిధలు సంపూర్ణాహూలుకాగ
దేవతలు పూలవాన గురిసె, మేష వాహనుడు
అగ్ని హెూత్రుడు, రెండు శిరములు మూడు జగనములు
ఏడు జిహ్వాలు గల అగ్ని కనకపు పాత్రతో వచ్చి
పాయసపాత్ర ఋష్యశృంగునకు అందజేసె

మంజరి : సకల ద్రవ్య సారపాక పాయసాన్నమంతా
వశిష్ఠుడు దశరథున కొసగ కౌసల్యకు
సుమిత్ర. కైకకు ఇడెనంత

ఉ॥ పాయసము రెండు భాగములుగ జేసి సగము కౌసల్య కిడియె
అ భాగంబున రెండు భాగములొనర్చి ఇచ్చె సుమిత్ర కొకటి
ఒక భాగమున రెండు భాగములొనరించి ఇచ్చె
సుమిత్ర కొకటి కైక కొకటి నిచ్చె

వచనం :– కౌసల్య, సుమిత్ర. కైకేయి చూలాండ్రై విలసిల్లు భార్యలను గని, పట్టపగ్గములులేక మహదానందముతో మీసము దువ్వుతూ, వశిష్ఠ, ఋష్యశృంగులకు నమస్కారం చేస్తూ, మీకేమి కోరికలు వున్నవో చెప్పండి అని అడుగుచూ, అమృతము కూడా వెగటుగా వున్నది ఆ ముప్వురు సతులకు ఆ సమయములో.

రాగం-సరస్వతి — ఆది తాళం

పల్లవి : పుల్లటి చల్ల త్రావగనయ్యె
అనుపల్లవి రేగి మామిడి తినగనయ్యె ॥పు॥

చరణం : సన్నసన్నగ వేవిళ్ళొదవె
నిద్ర హెచ్చె నడకలు తగ్గె కమ్మని మన్ను తినగనయ్యె ॥పు॥

వచనం :— నవ మాసములు గడచె. చైత్ర శుద్ధ నవమి, పునర్వసు నక్షత్ర, కర్కాటక లగ్నంబున బుధవారం మధ్యాహ్నమున శ్రీరామచంద్రుడు కౌసల్యకు జనియించె. దశమి గురువారం లక్ష్మణుడు సుమిత్రకు జనియించె. ఏకాదశి శుక్ర వారం మధ్యాహ్నం కైకకు భరతుడు జనియించె అదే రోజున సుమిత్రకు శత్రు ఘ్నుడు జననమయ్యె. ఈ విధముగ నలుగురు కొడుకులు జన్మించారు. దశరథు నకు ఈ వార్త చెప్పినవారికందరికి రత్నాభరణాలు పంచిపెడుతున్నాడు.

ముప్వురు సతులు కౌసల్య, సుమిత్ర, కైకల ఆనందం చెప్పనలవి కాదు. యువరాజులు పుట్టారని వారి వేడుకలు చెప్పనలవి కాదు దేవతలు పూల వాన కురిపించి దేవదుందుభులు మ్రోగించారు.

గీ॥ కమలములు వికసించె మునుల
హృదయములు పరవశించె
గ్రహములు స్వస్థానమున నుండె
మోడులు చిగురించె - సకల
సాగరములు పొంగె - పక్షుల కలకలధ్వనుల భానుడుదయించె

వచనం :— ముప్పదిముక్కోటిదేవతలు. పక్షులు. వాలాఖిల్యులు, మహాఋషులు నారద, తుంబురాదులు, రంభాదుల నాట్య మంగళ భేరీ వీణా మృదంగవాయిద్య ములతో. పతీవ్రతలు, సత్యనిరతులు, సప్తఋషులు, వాల్మీక. భారద్వాజ. గౌతమ కపిలాది. భృగు ఋష్యశృంగ. వశిష్ఠ. వామదేవ. సనకసనందన సనత్కుమారాదు లతో పదునాలుగు భువనములు సంతసించె. పదునాలుగు లోకములు ఆనంద కందళిత హృదయారవిందమున నుండిరి.

భీంప్లాస్ — ఆదితాళం

పల్లవి : ఆవిర్భవించెన్ - శ్రీరాముడు - ఆవిర్భవించెన్
కలువరేకుల వలె - కదలు కన్నుగవ ॥ఆ॥

చరణం : అఖిలలోక - శృంగారుడు రాముడు
అఖిల సాధుజన విహారుడు - రాముడు

విలిపి వేష్టలతో విందులు త్రొక్కుచు
తప్పటడుగులతో తారాడుచు చిరునవ్వులతో ॥అ॥

కం॥ ఇంద్రనీలమణి కాంతుల వెలుగుచు
శ్యామలాంగు శ్రీరామచంద్రుని
చిరునవ్వుల వెన్నెల మోమున చిందులాడ
పద్మరేకుల బోలు కనులు అలర

వచనం :— ఈ విధమున దేవతలు, మానవులు చెప్పుకొనుచున్నారు. పదినాళ్ళ పురుడు తీరె.. పుత్రోత్సవములు బ్రహ్మాండముగ జరుపుకొనుచున్నారు. వశిష్ఠుల వారు శ్రీరామచంద్రునికి ఓం నమః శివాయ మంత్రములో 'మ', ఓం నమో నారాయణాయ మంత్రములో 'ర', చల్లనివాడు గనుక చంద్రుని కలిపి, శ్రీరామచంద్రుడని నామకరణం చేశారు. అ కార. ఉ కార, మ కారములలో 'మ' జీవాక్షరము. అందుకె ముందు 'మ' తరువాత 'రా' కలిపారు. శ్రీని జేర్చి, చల్లనివాడు గనుక చంద్రుణ్ణి కలిపి నామకరణం చేశారు. శుభ లక్షణములు కలవాడు గనుక లక్ష్మణుడు అని నామకరణం చేశారు. భరతఖండాన్ని పాలించేవాడు కనుక భరతుడు అని నామకరణం చేశారు. శత్రువిరోధి కనుక శత్రుఘ్నులని నామకరణం చేశారు. రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుడని నామకరణంచేసి, బంగరు తూగుటుయ్యేలలో నలువురు కొడుకులను పరుండజేసి, ముత్తైదువులు, మహారాణులు ఇలా జోలపాట పాడుతున్నారు,

నారాయణి రాగం — ఆదితాళం

| | |
|---|---|
| పల్లవి : | లాలి శ్రీరామ - లాలి శ్రీరామా |
| అనుపల్లవి: | లాలి దశరథరామ - లాలి శ్రీరామా ॥లా॥ |
| చరణం : | రత్నాల తొట్లలో - నూగేను జగమూ<br>మా చిన్ని పాపలూగేరు-మా తొట్లలోను లాలీ ॥లా॥ |

వచనం :- లక్షలాది ముత్తైదువులకు పసుపు, కుంకుమ, పూలు, చందనము, రత్నాభరణాలు, పట్టు వస్త్రములు, దంపత పూజలు, ప్రతి బ్రాహ్మణ ఇంటికి వీశెడు పంచదార, ఇంటింటికి పంచిపెట్టారు. వరహాలు సంభావన ఇచ్చిరి. చెప్పరాని గోదాన, భూదాన, హిరణ్యాదాన, అగ్రహారములు ఇచ్చిరి.

కం॥ నామకరణం చేసి రాజిల్లుచుండె
నామకరణం చేసిరి రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులనుచు

వచనం :- కిరీట కుండలములు, నాణాలు, కరవాలములు, బాణ తూణీరములు, వస్త్రాభరణములు, ముద్దుటుంగరములు, మొలగజ్జెలు, కాలియందెలు, కిరీటకేయూరములతో కట్నములు, కానుకలు ఎన్నో వచ్చినవి. నెయ్యి కాలువలు బారేలాగ షడ్రసాన్నములతో లక్షలాది ప్రజలు భుజించి, దక్షిణ తాంబూలములతో వేడుకలు చూచి, ఆశీర్వదించి వారి వారి ఇండ్లకు పోయిరి.

ంంం ంంం ంంం

పరమేశ్వరుడు పార్వతి, ముప్పదిమూడు కోట్ల దేవతలకు శ్రీరామ జననం కథావిధానం చెప్పినారు. అందరు అనుష్ఠానమునకు లేచిరి.

కాఫి రాగం — ఆది తాళం

పల్లవి : దశరథ సుతునకు- మంగళం నిత్యమంగళం
అనుపల్లవి: రామలక్ష్మణులకు - మంగళం నిత్యం మంగళం
భరత శత్రుఘ్నులకు - మంగళం నిత్య శుభమంగళం

శ్రీరామ జననం సంపూర్ణం

శుభం — శుభం — శుభం





శ్రీ రామ జయం

# శ్రీ అమృత రామాయణము

## ద్వితీయ అధ్యాయము

## శ్రీ సీతా కల్యాణము

కైలాసములో పరమశివుడు ఈ విధమున సీతాకల్యాణము చెప్పదొడగె.

### శివరంజని — ఆదితాళం

పల్లవి : కావరార గౌరీకుమారా

అనుపల్లవి: వేడుకొందురా ఎలుక వాహనా ॥కావ॥

చరణం : ఏవేళ ఏఏ దిశల నున్నగాని

ఏ విఘ్నములేక ఏలుకోరా ఎలుకవాహనా ॥కావ॥

### హంసధ్వని — అది తాళం

పల్లవి : అంబా - కాపాడరావంబా

చీకాకు లేక-ఏ చింతలు లేక అంబ జగదంబ ॥అంబా॥

చరణం : ఇంతీ, చామంతీ, పూబంతీ. దొంతి,

రత్నకాంతి, పగడవంతి, సుగుణదొంతి అంబ జగదంబ ॥అంబా॥

గీ॥ సారస సాధు రక్షణ మకరంద

సారస శ్రీయుత, శారికా విలసిత శీతల

మంద, వాత, పోత, నవనీత, సుగంధ,

మరంద, సెలయేళ్ళ, కపోల తపోవనంబునన్

## సరస్వతి రాగం — మిశ్రమం

సీతా కల్యాణమండీ - విన్నా ఫలితముసుమండీ॥
వీణా నినాద సమ్మేళనము వలె
దివ్య మృదంగ తాళ సమ్మేళనము వలె ॥సీతా॥

వచనం :- భద్రపీఠములో రామ లక్ష్మణులను అంకంబున కూర్చుండ పెట్టుకొని సభతీరి వున్న సమయమున

సీ॥ నూనూగు వయసుతో సకల విద్యలలోన
ఉత్తీర్ణులైన కొడుకులను
భద్రపీఠమున వసియించి
చేతికందిరి కొడుకులని సంతసించు
కొడుకు లందరి మీదకన్న జగదేక
సుందరుడగు రామునిమీద దొడ్డప్రేమ
వార్ధక్యమున సంతానమబ్బినదని పొంగి
దశరథుడు మీసములు దువ్వ

గీ॥ భాగ్యమన్నను నాదెహా భాగ్యమనగ
ఏ రాజ అంశమున రాముని వంటి
పుత్రుడు కలిగెను అనుచు మీసముల
దువ్వ వచ్చె గాధినందనుండు

వచనం :- ఈ విధమున శ్రీరాముని గూర్చి వుబ్బుచున్న దశరథుని కొలువునకు విశ్వామిత్ర మహాఋషి వచ్చుచుండె.

గీ॥ జడలు మడమలకు తగిలి యాడ
మీసములు, గడ్డములు కదలియాడ
ఫాలస్థలమున అర్ధచంద్ర తిలకమలర
భూతి పూసిన బంగారు శరీరమలర

గీ॥ పులితోలు మొలగటి పాదుకలు పాదములదొడిగి
వేదములు వినువీధికెగయ
బాడుచు యజ్ఞదామరలు రక్తాక్షులలర
బ్రహ్మకు ప్రతినిధి చూచువారికి భయభక్తులలర వచ్చె సభకు

వచనం :- వచ్చిన మౌనికి దశరథుడు ఫాలంబున చేతులు జోడించి నమస్క రించి ఇట్లనియె.

కన్నడ — రూపక తాళం

పల్లవి : భక్త పారిజాతమగుచు - భాసిల్లెడి మీ కృపచే
పరిపక్వమయ్యె నాదు - పాపి జన్మ మీనాటికి ॥భ॥

చరణం : దివ్య తపోధనులు మీకు - తెలియని ధర్మములు కలవె
సృష్టికి ప్రతిసృష్టి చేయు - పరమాత్మా సములు ఘనులు ॥భ॥

వచనం :- మహాత్మా! మీ దయాలభ్యము వలన పుత్రవతుడనైతిని.

మంజరి ; పరమపురుష నా ప్రాణమైన
అర్పింతు కాని నేడు
కోరుకొండు సాయమెద్దియేనియు
సల్పెద సత్యముగాను

వచనం ;- దశరథా! నేను చేయు యాగమునకు విఘ్నము లేక కాపాడవలయు, ఇదియే నీవు చేయుసహాయము. నీవు, నీరాజ్యము, నీప్రజలు క్షేమముగా వున్నారా? అన్నాడు విశ్వామిత్రుడు. మహాత్మా! మీ దయ వలన అందరూ క్షేమముగానే వున్నాము. ముసలివై మహారధికుల నలుగురు కొడుకుల కన్నావు, అదృష్టవంతు డవు ఏ రాజవంశములో కూడా ఈ అదృష్టము లేదు.

స్వామీ! మీకేమి సహాయము కావాలో చెప్పండి. దశరథా! నే సేయు యజ్ఞమునకు రాక్షసుల వలన విఘ్నము కలుగు చున్నది అన్నాడు విశ్వా మిత్రుడు. అటులైన సైన్యసమేతముగా వచ్చి, రాక్షసుల జంపి మీ యజ్ఞమును కాపాడుదును దశరథా! నీవు రానక్కరలేదు. రాముడు వున్నాడే జగదేక సుంద రుడు, ఆ రాముని పంపించిన చాలును.

మంజరి : అన విని భయపడి దశరథుండు
అసుర బాధ నే బాప
వచ్చెదనె గాని నా పెద్దకొడుకును
ఒక్క క్షణమైన విడువలేక

వచనం ;– రాముడు జగత్కర్త. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణార్ధం అవతరించిన దేవుడు. నిన్నొక్కని వుద్ధరించుటకు కాదు శ్రీరాముఁడు జనించుట. సమస్త జీవ రాసులను వుద్ధరింప అవతారమెత్తిన నారాయణుడు కానీ, నరుడు కాదు. స్వామీ!

గీ॥ అపురూపమున వార్ధక్యమున జనించిన
బుడుతల గని కాలంబు బుచ్చుచుఁడు
తల్లి తండ్రులతోడ పిల్లల నెడబాపనెంచుట
ధర్మమా మహాత్ములకునూ

వచనం :– నా వెంట మీ రాముని పంపెదవా, లేక నా శాపమునకు గురి అగుదువా? ప్రాణమైన ఇస్తానన్నావే.

కమాచి — ఆది తాళం

పల్లవి : అతి సుకుమారుని - నా రాముని

అనుపల్లవి: అనుపజాలనూ - స్వామీ
ఎన్నో నోములు నోచి వడసిన
అతి సుకుమారుడు - రామచంద్రుడు ॥అతి॥

చరణం : ఒక్క క్షణంబు గనకున్న రాముని
బ్రతుకజాలునే దశరథుడు ఇల
అసత్య దోషము వచ్చిన రానీ
అనుపజాలనే శ్రీ రఘురాముని ॥అతి॥

వచనం :– అనిన దశరథుడు కంటికి కడివెడుగ ఏడ్చి, అమాయకుడైన నా రాముడు రాక్షసులతో సమరము చేయునా? యజ్ఞ సంరక్షణ చేయగలుగునా? అన్నాడు దశరథుడు. అంత విశ్వామిత్రుడు మండిపడుచు తోక త్రొక్కిన త్రాచు వలె బుస్ మనుచు, దశరథా! అని సింహనాదము చేసి, సూర్యవంశమున బుట్టి అరువది నాలుగు వేల వత్సరములు రాజ్య పాలన చేసి, ఇప్పుడు అసత్యమునకు పాల్పడుదువా? పిడుగు వంటి శాపమున నీవు, నీ రాజ్యము అని కమండల జల ములు గొని విశ్వామిత్రుడు విసరబోవు సమయమున దశరథుడు స్వామీ! గురు దేవ వశిష్ఠుల వారి పాదముల బడియె అంత వశిష్ఠులవారు లేవనెత్తి, దశరథుని ఓదార్చి, నీ వెఱ్ఱిగాని దశరథా! శ్రీరాముని చరిత్ర కప్పడానికి గాని, విప్పడానికి

గాని విశ్వామిత్రుడు నేను సమర్థులము. నీకు వచ్చిన భయము ఏమీ లేదు. జగత్తు నంతా రాముడు మీసము దువ్వి జయిస్తాడు. శ్రీరాముని విశ్వామిత్రుని వెంట పంపినదానివలన కొన్ని శుభములు కలుగును. ఒంటరిగా వెళ్ళిన రాముడు జంటగా వస్తాడు. శ్రీరాముని విశ్వామిత్రుని వెంట పంపి, నీ సత్యవాక్కు నిలుపుకొనుము.

ద్విపద : అంత దశరథుడు అప్పగించెను
రామునికి లక్ష్మణుడు నే బోయెదననిన
సరి అని రామలక్ష్మణులను అప్పగించెను
చని చని సరయూనది చేరిన వారికి
అతిబల మహాబలులను విద్యల నుపదేసించి

వచనం :- విశ్వామిత్రుని వెంట రామలక్ష్మణులు సరయూనది అతిక్రమించి, గంగ దాటి ఘోరాటవి జనుచుండ. తాటక యను రాకాసి

మంజరి : అంత రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట జనుచుండ
పట్టుకొనబోవ ఘన విక్రముడగు తాటకను
వెయ్యామడల వెనుకకు దరిమె

వచనం :- రామా! అదే తాటక వచ్చుచుండె తొందరగా సంహరించు అన్నాడు విశ్వామిత్రుడు. అప్పుడు శ్రీరామ చంద్రుడు చేతులు జోడించి. వినయముతో స్వామీ! నేను అస్త్ర విద్య నేర్చుకున్న ప్రప్రథమున స్త్రీని వధించుట స్త్రీహత్యా పాతకం కాదా?

కం॥ కరములు జోడించి కాకుత్సు డనియె
ప్రథమమందున స్త్రీ హత్య నెరపదగునె
వేవేగ సెలవిండన గురువు ఆజ్ఞ వలన
దోసంబు గలుగదనిన

వచనం ;- వెయ్యి ఆమడలకు ఒక అడుగు వేస్తూ, వస్తూ వుంటే, బ్రహ్మాస్త్రం ప్రయోగించి తాటకను సంహరించాడు. దేవతలు పూలవాన గురిసిరి. దేవదుందుభులు మ్రోగె. ఫాలము పగిలి తాటక కాటుక కొండవలె కూలిపోతూ, మారీచా! సుబాహూ! అని పిలచి ప్రాణాలు విడిచింది. అంత కౌసికుడు ఆశీర్వదించి, శ్రీరామ చంద్రునకు అఖిల శస్త్రాస్త్రములు నుపదేశించె.

అంత రామలక్ష్మణులతో గాధిసూనుడు సిద్ధాశ్రమము చేరుకొనియె మహా ఋషులతో గూడి అనేక ఆహుతులతో యజ్ఞము చేయుచు, రామలక్ష్మణులారా! మారీచ సుబాహులను తాటక పుత్రులు తల్లిని జంపిన కోపమున రక్తభాండము, కల్లు భాండములు, మాంసపు ముక్కలు, పుర్రెలు, ఎముకలు, లక్షలాది రాక్షసులతో వచ్చి యజ్ఞము విఘ్నము చేయుచుండ, రామలక్ష్మణులు యజ్ఞమును కాపాడుచుండిరి, దివ్యాస్త్రములతో పందిరి కట్టిరి. సుబాహుని. లక్షలాది రాక్షసులను జంపిరి. రక్తము కుండతో పొయ్యపోతుంటే మళ్ళీ వెనక్కి వెళ్ళి ఆ కుండలో పడి ఇంకిపోయేది. ఈ విధంగా కల్లు భాండలతో లక్షలాది రాక్షసులను కొట్టారు.

మారీచుని ఒక్క బాణంతో కొట్టేవరకు దక్షిణ సముద్రములో బడి. శ్రీరామచంద్రుడు నారాయణమూర్తి అని రామ తారకం జపిస్తూ, రామా! నా అపరాధం మన్నించమని, గృహాంతరాళమున చేరి, రాముని గూర్చి తపమాచరించుచుండె.

ఈ విధమున యజ్ఞరక్షణ చేసినందులకు రామలక్ష్మణులకు విశ్వామిత్రులవారు

శా॥ యజ్ఞరక్షణ చేసినయట్టి శ్రీ రఘురామచంద్రుని
అఖిల శస్త్రాస్త్రములు ఉపదేశమిచ్చి జనకుని పట్టణములో
విల్లొకటి ఉన్నది నీవు ఎక్కుపెట్టగలవా? యని, పూర్ణాహుతి చేసి
తీర్థప్రసాదములు గొని అడవి గోవు పాలారగించి మిథిలకు పయనమైరి

మంజరి : కనులకు దూరము నందున నున్న
ఆశ్రమము కనబడె శ్రీరామునకు
అరాచకమైయున్న పర్ణశాల గని
యెవ్వరిదనిన విశ్వామిత్రుండు

వచనం :– ఋషులంతా కల్యాణమస్తు యని దీవించారు. గోదావరి ఒడ్డున మిథిలకు ప్రయాణమై వెళుతున్నారు. శ్రీరామా! ఆశ్రమమునకు పోవుదము రమ్ము. ఆశ్రమములో అడుగు పెట్టగానె

మ॥ శ్రీరామచంద్రు పాదము తాకిన కఠిన పాషాణము
పడతిగ మారి కాకుత్స వంశ వార్నిధి సోముని శ్రీరాము
పాదపద్మములబడి నా పాప శోకములను బాపితివా
రామభద్ర రఘుకుల తిలకా

వచనం :- అని వేడిన గౌతమ మహాఋషి, అహల్య శాప విమోచనమైనదని, తెలుసుకొని వచ్చి నమస్కరించి, రాముని పూజించి, పూజితులై, రామా! మీదయ వలన కఠినపాషాణమైయున్న నా సతి అహల్య శాపవిమోచనమై యున్నది. మేము ధన్యులమైతిమి. కల్యాణమగుగాక యని, అహల్య, గౌతమ మహాఋషి శ్రీరాముని స్తుతించిరి.

కమాచి – రూపకం

పల్లవి : నా తపము ఫలించి – నరనాథా రఘురామా!

అనుపల్లవి: చీకటి వెలుగు విధంబున-వెలగుచుందువీజగతీ ॥నా॥

చరణం : సగుణంబైన నేమి - నిర్గుణంబైన నేమి
సగుణ నిర్గుణులకు అతీతుండవు
సర్వము నీవైన సర్వేశ్వరుండవు

ఉ॥ కోమల శ్యామలమైన కలరూపము గల్గు మహాత్మా
నీ చరణాబ్జము సోకినంతనే నశించెను. నాదగు పాప
సంఘముల్ ముమ్మాటికి నీవు దక్క మిగిలిన సర్వము
మిధ్య సుశ్లోకులే కాని వేరొకరు చూడగలేరు దయానిధీ నినున్

వచనం ;- అని వేడుకొని, అహల్యా, గౌతములు కల్యాణమస్తు అని రాముని దీవించి, వారి ఆశ్రమమునకు చేరుకొనిరి. గాధినందనుడు మిథిలకు ప్రయాణము చేసిరి. గోదావరి కట్టన పోవుచు, గురుదేవునకు శ్రీరామచంద్రునకు నమస్కరించి స్వామీ విశ్వామిత్ర మహర్షి

దేవా! ఆమె పాషాణమై పడివున్న కారణమేమి? దేవుడని నన్ను వినుతి చేశారు ఆ పుణ్యదంపతులు .నేనూ మానవుణ్ణే కదా! స్వామీ, నన్ను దేవుడని ఎందుకు వినుతి చేశారు. అంత గాధినందనుడు శ్రీరాముడడిగిన ప్రశ్నకు సమాధానముగా రామచంద్రా! మనకు మార్గాయాసము లేక మంచి కథ గుర్తుకు తెచ్చితివి. చెప్పెద వినుడు.

అహల్య బ్రహ్మ పుత్రిక. ఒకప్పుడు బ్రహ్మ ఒక సుందరమైన విగ్రహము తయారు చేశాడు. అందములన్ని ఆ బొమ్మలో అమర్చాడు. స్త్రీ స్వరూపమైన ఆ బొమ్మకు ప్రాణం పోస్తే బాగుంటుందని శ్రీహరిని ప్రార్థించాడు. ప్రాణము

పోశాడు. కన్యగా తయారయ్యింది. అఖిల సౌందర్యనిధి యైన ఆ కన్యకు అహల్య అని నామకరణం చేశారు. బ్రహ్మ, సరస్వతి ముచ్చట పడ్డారు. తమ కూతుర్ని పెంచి, పెద్ద చేశారు. అమ్మాయి యుక్త వయస్సుకు వచ్చింది.

ఆమెను చూసిన దిక్పాలకులు బ్రహ్మదేవా! మీ అహల్యను మాకిచ్చి పెండ్లి చేయమని అందరూ అడుగుతున్నారు. నేనంటే నేనని ముందుకు వస్తున్నారు. అంత చతుర్ముఖుడు నేనెవ్వరికీ ఇవ్వనని దేవతలతో చెప్పి పంపుతున్నాడు.

అగ్ని, యమ, వరుణులు అడిగి విఫలులయ్యారు. కాని ఇంద్రుడు స్వర్గపతిని కదా! నాకియ్యమని గట్టి పట్టుబట్టాడు. అంత బ్రహ్మ ఒకరికిస్తే ఒకరికి కోపం వస్తుందని ఎవరికీ ఇచ్చి పెండ్లి చేయనన్నారు. దేవతలంతా వెళ్ళిపోయారు. ఈ సంగతి నారద మహాఋషికి తెలిసి నాన్నా! మీరేమి భయపడవద్దు. ఓ దేవతలారా! ఎవరు అహల్యను పెండ్లి చేసుకోవాలని అనుకున్నారో వారంతా భూప్రదక్షిణ చేసి వచ్చినవారికి నా చెల్లెలినిచ్చి పెండ్లిచేస్తానన్నాడు. మాపిల్లావద్దూ, పీమూ వద్దని సన్నసన్నగా అందరూ వెళ్ళిపోయారు. ఇంద్రుడు మాత్రం భూప్రదక్షిణానికి వెళ్ళాడు. ఇంద్రుడు వచ్చేలోగా గౌతమ, అహల్యలకు వివాహం జరిగిపోయింది. వారు ఆశ్రమములో కాపురం చేస్తున్నారు. ఈ కొంటె నారదుడు ఊరుకుంటాడా? భూప్రదక్షిణం చేసే ఇంద్రునకు ఎదురుగా వెళ్ళి, ఇంద్రా! ఎందుకు ప్రదక్షిణం చేస్తున్నావు? అహల్యను పెండ్లి చేసుకోవాలని భూప్రదక్షిణ చేస్తున్నానన్నాడు.

అహల్యాగౌతములకు పెండ్లి అయినది. అత్తవారింటికి కూడా వెళ్ళిపోయినది. గౌతమ మహాఋషి భూప్రదక్షిణం చేశాడా? అని ఇంద్రుడడిగాడు. అందరూ నీలాంటి వెఱ్ఱివాళ్ళుంటారా! గోవు ప్రసవించే సమయంలో మూడుసార్లు ఆ గోవుకు ప్రదక్షిణం చేస్తే, భూప్రదక్షిణం చేసిన పుణ్యం వస్తుంది. అని ఆ విధంగా భూప్రదక్షిణం చేసినా, గోప్రదక్షిణం చేసినా ఒకటే నని గోప్రదక్షిణం చేసి అహల్యను పెండ్లి చేసుకున్నాడు. ఆశ్రమము చేరుకున్నారు. అని నారదుడు చెప్పి వెళ్ళిపోయాడు. అప్పటి నుండి అహల్యపై ప్రేమతో వున్నాడు ఇంద్రుడు. మహాపతివ్రత అహల్య, పతిసేవావ్రతియై మెలగుచున్న సమయమున, ఇంద్రుడు అహల్యాగౌతముల ఆశ్రమానికి వెళ్ళి, కోడిరూపం ధరించి, అర్ధరాత్రి వేళ కొక్కొరొకో అని కూశాడు తెల్లవారిందనుకొని గౌతముడు సముద్ర స్నానానికి అహల్యతో చెప్పి వెళ్ళిపోయాడు. అహల్య ఇల్లు, వాకిలి శుభ్రపరచి, పూజాద్రవ్యాలు అమర్చుచున్న సమయమున, ఇంద్రుడు తనపతి గౌతముని రూపము ధరించి, ఆశ్రమములో ప్రవేశించి,

ఉ॥ రంభా ఊర్వశుల తలదన్ను రాణివయ్యు
అలరు నీకు నీ ఆశ్రమవాసమేల, ఇమ్ము
నాకు సకల సుఖమ్ములు నిపుడు జగములన్
జయింపజాలిన జగన్‌మోహినీ స్వర్గమునకు రాణిగా జేతు నిన్ను

వచనం :- అనిన వానివంక చూచి స్వామీ! ఇదేమి మరలివచ్చితివేల? అహల్య ఈనాడు నీపై అనురాగం తప్ప నాకు వేరు ప్రపంచం అగుపడుట లేదు. స్వామీ! ఏమి ఈ విపరీతం? వేకువఝామున పాప సంకులమైన మాటలు పలుకవచ్చునా? అనుచు దివ్వె వెలిగించి చూచి అతను బెదరుచున్న, యోగములో యోగమహత్యం వలన ఇంద్రుడని గుర్తించి, పరమపాపి ఇంద్రా! నా పతి రూపము ధరించితివా! అని దూరంగా వెళ్ళిపోతుంటే. అహల్యా! నన్నే అనుమానిస్తున్నావు. నేను గౌతమ మహాఋషిని అనుచు బెదరుచున్న, గని దుర్మార్గుడా! నన్ను భంగపరచ వచ్చిన నీ శరీరమంతా వెయ్యియోనులు అయిపోవుగాక అనిశపించింది ఇంద్రున్ని అహల్య. అంత దేవనాధుడు కాళ్ళబడి వేడిన, నీ యట్టి పాపులను కరుణించరాదు అన్నది అహల్య.

మ॥ ఎంత నడచిన తెల్లవారరదేమి యనుచు
కలవరమంది దివ్యజ్ఞానంబు వలన చూచి
ఇంద్రుని పన్నాగంబు ఎఱిగి మరలి
ఆశ్రమంబు చేరినంత తెల్లవారిపోయె

వచనం :- నేలబడి ఏడ్చుచున్న ఇంద్రుని గని, నా పత్నిని చెరుప నెంచితివా! అనుచున్న మహాపతివ్రతనగుదునేని పాషాణమైపోదునుగాక. అహల్య తననుతాను శపించుకొనియె. అహల్య రాయిఅయిపోయి స్వామీ! నాకు శాపవిమోచనం చెప్పుడని వేడిన, సతిని గని, గౌతమ మహర్షి కంట తడి పెట్టి అహల్యా! శ్రీరాముని పాదము సోకినంత శాపము దీరు అని చెప్పి పోబోవ, ఇంద్రుడు ప్రార్థించినంత కనికరించి, శాపము ఉపసంహరించెదనని, చూచువారికి నేత్రములవలె కనబడును నీకు మాత్రం అలానే కనబడును. అది ఎప్పటివలె నుండును అని చెప్పి గౌతముడు తపోవనమునకు చనియె. ఇంద్రుడు స్వర్గానికి వెళ్ళిపోయాడు అని విశ్వామిత్రుల వారు అహల్యాగౌతముల కథ వివరించారు. స్వామీ! నేను దేవుడని నన్ను ఎందుకు వినుతించారు? నేను మానవుణ్ణే కదా! అన్నాడు రామచంద్రుడు. ఎందుకు నిన్ను దేవుడని అన్నారో తెలుసా? అహల్య శాప విమోచనం చెప్పునప్పుడు గౌతమ

మహాఋషి ఇలా చెప్పారు. నారాయణుడు శ్రీరాముడనే పేర విశ్వామిత్రుని వెంట వచ్చునపుడు శ్రీరాముని పాద స్పర్శ వలన నీకు శాపవిమోచన మవుతుందని చెప్పారు. అందుకని నీవు దేవుడని గుర్తించి వారు వినుతించారు అన్నారు విశ్వా మిత్రులవారు. అప్పుడు శ్రీరాముడు ఇలా అడిగాడు.

ఉ॥ సత్యధర్మాది వ్రతనిరతి శమదమాది
సద్గుణములు గలవాడు ధర్మార్థ కామ మోక్ష
అర్హుడు అఖిల శాస్త్ర సంపన్నుడైనవాడు.
రాజయోగి ఆపదలు తీర్చువాడు దైవమ్ము సుమ్మీ

వచనం ;- అందుకే అన్ని గుణములు నీ యందు కలవని దేవుడని నిన్ను వినుతించిరి. అన్ని ధర్మములు ఏ మానవుని యందు కలవో అతడే దైవం. సూర్యునికి వెలుగు చూపునట్లు నీకు తెలియనివి ఏమున్నవి రాఘవా. అదిగో మిథిలాపట్టణము

కోట బురుజు మీది జెండా రమ్మని ఆహ్వానించుచున్నది. నానా రాజ కుమారులు, రథికులు, అర్థరథికులు, మహారథికులు, చక్రవర్తులకు సీతా స్వయం వరమునకు పాలు, పెలుగు అమ్మేవాళ్ళు కూడా వెళుతున్నారు. చూచితివా ఇది ఏమి చిత్రమో చూడు అనుచు కోట ద్వారము చేరుకోగానే, జనక మహారాజు విశ్వామిత్రులవారి రాక విని ఎదురేగి తోడ్కొని అర్ఘ్యపాద్యాది విధుల పూజించి నమస్కరించి, మీ రాక వలన మా జన్మ తరించింది. జనక మహారాజా

కన్నడ - ఖండగతి

పల్లవి : సుందరాకాముని - శ్రీరామచంద్రునిన్
అనుపల్లవి: నవమన్మథాకారు - దశరథ కుమారునిన్ ॥సు

చరణం : జలజాక్షి మా సీత - మదన సుకుమారుడు
దుష్ట శిక్షాపరుని - సత్యవ్రత పాలునిన్ ॥సు

వచనం ;- స్వామీ, మీ రాక శుభముల సూచించుచున్నది. అవును జనక మహారాజా, దశరథ రాజ నందనులు రామలక్ష్మణులు నా యజ్ఞ రక్షణార్థమై గొని వచ్చితిని. స్వామీ మమ్ములను ధన్యులుగ చేసితిరి. కొంతకాలం మా వుద్యానవనం విడిదిలో నివసించి మమ్ములను పావనులుగ చేయండి. రామ లక్ష్మణులతో అందు

ప్రవేశించి జనకుడు కాదగు సపర్యలన్ని ఏర్పరచి, అట కలిగిన ప్రజలు, జనక మహారాజు శ్రీరామచంద్రునే చూచుచుండిరి. శ్రీరామచంద్రుని చిత్తరువు జానకి దేవికి అందజేశారు.

మల్లికా, అక్కర లేదని విసరివైచె. దూరమున నిలచి సీత ఆ చిత్తరువు చూచి, ఎంత చక్కగా వున్నాడని, మల్లికా! మల్లికా! ఆ చిత్తరువు ఇలా తీసుకొనిరావే. ఎందుకమ్మా ఒద్దన్నారు కదా! అనుచూ జానకీ దేవికి శ్రీరాముని చిత్తరువు ఇచ్చింది మల్లిక. అంత సీత ఆ చిత్తరువు చూచి, మల్లికా! ఎంత సుందరాకారుడే. ఈ పురోషత్తముని పెరేమొ?

గీ॥ రాముని శుభ నామము కనుగొని మోదమున
పలువరించుచు జానకియు అద్దముల అందలము
మోయుచున్న చెలులతో గూడి
హృద్య వనసీమల విహారము వేయుచుండె

వచనం :- అంత సీతాదేవి వనవిహారం చేస్తుండగా. గాధినందనుడు, క్షాత్ర ధర్మం బోధిస్తున్నాడు రామలక్ష్మణులకు.

అప్పుడు రాముడు, శివ ధనువెక్కుపెట్టిన వారికి కన్యనిచ్చెదరేల? అని అడిగాడు. లక్ష్మణుడు నాకు అదే సందేహము అని అన్నాడు అంత గాధినందనుడు లక్ష్మణా! ఆ కథ చెపుతాను వినండి.

ఉ॥ పటుతరమైన విక్రమునన్ జగంబులు
గెల్చుచున్ నిలుకడ లేని దుర్మదాంధులన్
అఖిల దేవతల మునుల వంచన చేయుచున్న
త్రిపురులనన్ వధింప ఈశ్వరుడున్ ఈధరన్ ధరించెన్ ఫాలనేత్రుడున్

వచనం ;- భూమంతా రథం చేసి, ఐదు వేదాలు అశ్వములుగ చేసి, బ్రహ్మను నడిపే సారధిగ జేసి, సూర్య చంద్రులను చక్రములుగ జేసి, ఆకాశము ఛత్రము, శ్రీమహావిష్ణువును అస్త్రము చేసి, త్రిపురాసురులైన రాక్షసులను ఒకే అస్త్రముతో సంహరించె. అప్పుడు ఈ నారాయణాస్త్రము భూమండలమున విడచె. శివుడు చేతబట్టిన కారణముచేత శివధనువయ్యె. ఎన్నో తరముల నుండి మిథిలాపట్టణములో వారి తాతల నుండి పూజింపబడుచున్నది.

జనకుడు బంగారుబండిపై నుంచి పూజించుచుండె.

మంజరి ; లక్షలాది ప్రజలెల్లరున్ కదలింపజాలరు దీనిన్
కోదండంబు బంతులాడుచు సీత ఎత్తుట
జనకుడంత వీక్షించెన్

వచనం ;- జనక మహారాజు సునాయానను వివాహమాడి యెన్నో వత్సరములు సకల భోగములు అనుభవించుచున్నారే కాని, వారికి సంతానము కలుగ లేదు. అపుత్రస్య గతిర్నాస్తిః అనునట్లు విచారపడుచుండె. ఒకనాడు జనకుడు మంత్రి సామంతాదులతో సభ తీరి వుండగా

ఒక బ్రాహ్మణోత్తముడు వచ్చి, నేను నిరుపేదనని చెప్పగా, ఐదు యకరముల భూమిని దానముగనిచ్చె. ఒక శుభదినమున ఆ బ్రాహ్మణుడు భూమిని దున్నుచుండగా, ఆ నాగలి కొనకి తగిలి ఒక పేటిక వెలువడినది.

ఆ బ్రాహ్మణుడు జనక మహారాజుకు విన్నవించె. విప్రోత్తమా! నీ కిచ్చిన భూమి నీదే కదా! అందు ఏ వస్తువు దొరికినను అది నీదే అగును అన్నాడు జనకుడు. సరే ఆ పేటిక చూచి ఏదేని వింత వస్తువు కలదేని దాని ఎత్తు ధనము మీకిచ్చి నే కొనెద పేటిక తెరచినంత బాల సూర్యకాంతులతో కన్య లభించినది, ఇది నా భాగ్యమే అని జనకుడు ఆ కన్య ఎత్తు ధనము ఇచ్చి ఆ బాలను గొనియె.

నాగలి చీలకు సంస్కృతములో సేతు అంటారు గనుక సీత అని నామకరణం చేశారు. సంతానహీనుడయిన జనకుడు, సునాయాన మహారాణి అపురూప సౌందర్య యగు సీతను ప్రాణ సమానముగ పెంచుచుండె. దాన ధర్మ, గోదాన, భూదానాది, అడిగిన వారికి లేదనక దానధర్మాలతో మహా వైభవముగా పుత్రికోత్సవాలు జరిపించారు.

మహారాణి సునాయానయందు ఊర్మిళయను కన్యకారత్నము జన్మించినది. జనకమహారాజు తమ్ముడు కుశధ్వజుని కుమార్తెలు మాండవీ, సుతకీర్తులు ఈ నలుగురు కన్యలను పెంచి, పెద్ద జేసి, సమస్త విద్యా బుద్ధులు నేర్పించారు. నలుగురు కన్యలు యుక్త వయస్సుకు వచ్చారు. చెలులతో హృద్య వనములో బంతులాట ఆడుచున్నారు. లక్షలాదిగా జనులెత్తినా కదలని శివధనువు.

వీరాడే బంతి ధనువు కిందికి వెళ్ళిపోయింది. ఆ సమయములో వారి పురోహితుడు శతానందుడు, జనక మహారాజు మాట్లాడుకుంటూ వస్తున్నారు. ఆట తమకములో సీతమ్మ యడమ చేత్తో శివధనువెత్తి, బంతి తీసుకొని, ఆడుకొంటూ

వున్నది. అది చూచిన జనక మహారాజు ఆలోచించి, ఈమెకే ఇంత బలమున్నది కదా! ఈమెను పెండ్లాడిన వారికి ఎంతో బలముండాలి అని ఈమె మహాలక్ష్మి సీతగా పుట్టింది. కనుక శివధను వెక్కుపెట్టినవారికి సీతను ఇచ్చి వివాహం చేస్తానని ప్రకటించారు.

రామలక్ష్మణులారా! ఆ కారణము వలన ఎవరు శివధను వెక్కుపెడితే వారికి సీతను ఇచ్చి వివాహం చేస్తానని ప్రకటించారు. నాయనలారా! అలసి పోయారు. ఉద్యానవనములో కొంతసేపు విహరించి రండని విశ్వామిత్రుడు జనక మహారాజు వద్దకు పోయి మాట్లాడుచుండె.

అంత వనములో విహరించుచున్న సీతను చూచి, రాముడు పరవశుడై

ఖండగతి — శంకరాభరణము

పల్లవి : చక్కవలెన్ వచ్చి చేరె - మేఘమ్ముნా
చుఱుకుటమ్ములు వైచెనూ
కాముడు దయమాలి ॥చు॥

అనుపల్లవి: చక్కనీ జవరాలు - నా మనసు దోచుకొనె
నన్ను జూచుచు సోలె - నా తన్వి అది ఏమొ ॥చు॥

చరణం : విలుదునిమి కరకంఠు - యీ క్షణములో తప్పక
యీ చెలిని చేకొందు - ఇది నిజము తమ్ముడా ॥చు॥

వచనం ;— నవ మన్మథాకారుడగు కౌసల్యా తనయుని చూచి, రాముని ప్రతిన విని, సంతోషమంది, చెట్లు చాటునకు నన్ను తీసుకొనిపోవె. నాకు మూర్ఛ వచ్చుచున్నదే. పటము కన్న ఎంత చక్కగా నున్నాడే.

మంజరి : ఝల్లని పుప్పొడి - రాలినంత
యుల్లము ఝల్లనియే
పలుకరింపగా బోవునంతలో
జనకుడంత రమ్మనియె

వచనం :— పరవశులై సీతా రాములు సంభాషించుకొనబోవ జనకుని పిలుపున స్వయంవర మండపం చేరె అనేక దేశ రాజన్యులు, రావణ, బాణాసురులు, పండితులు, పామరులు, యువరాజులు, చక్రవర్తులు, దేవతలు, యక్షులు, గంధర్వులు,

పది తలలు గల రావణుడు, నాలుగు లక్షల వెయ్యిన్నూట ఇరవై ఏడు తాళ్ళ ప్రమాణంగలిగి ఒకటి, రెండు చేతులతో ఎత్తబోయి సాధ్యపడక, ఇరవై చేతులతో కూడా ఎత్తాడు. కొంత వరకు లేచిన ధనువు జారిపడి, తన చేతులు నలిగి, రావణుడు సిగ్గున తలవంచుకొని ఎత్తలేక తన సింహాసనంమీద కూర్చున్నాడు. గరుడ గంధర్వ, కిన్నెర, కింపురుష, యక్ష, సిద్ధులు, సమస్త దేశాధిపతులు శివ ధనువు ఎత్తలేక నమస్కరించి అందరూ తిరిగి వెళ్ళిపోతున్నారు.

మంజరి ; తన కులదైవంబని వెలిచె.
రావణ బాణాసురులు
యెక్కడ జని వెలిచిరి
అనమానంబున తలవంచీ
చుక్కలలోన చంద్రుని వోలె
వచ్చెను శ్రీధరుండూ
ఒక్కపరి సభను తిలకించి
విల్లు చేతగొనె రాముండు
నచ్చ వేల్పులు, నరులు, నెల్లరు
ముచ్చటతో గనుచుండ
విచ్చిలవిడిగా రామచంద్రుడు
విరిచెను ధనువు త్రుటిలోన

మ॥ గణగణమని వింటి గంటల్ మ్రోగెన్
తళతళమని శస్త్రంబు వెలిగెన్
నారి మ్రోగింప గుభిల్మని గుండెల్ అదరెన్
ఫెళ్మనె విల్లు జగములు తల్లడమందెన్

వచనం :— దేవతలు పూలవాన గురిసిరి. దేవ దుందుభులు మ్రోగె. పరశురాముని గుండెలదరె. రాజులు సిగ్గున తలవంచిరి. పూలమాల వేయక నిలచిన సీతను గని, రాముడూ, పూలమాల వేయక నిలచిన కన్యను గని, బొమలు ముడివైచి, చూపుడు వేలుతో కోరుకొని నా మీద ప్రేమ లేదా! పదుగురిలో అవమానమాయెనని తలంచుచున్న, జనకుడు అది గమనించి, సీత దరి జేరి, అమ్మా! శ్రీరాముని కంఠమున పూలమాల అలంకరింపుమనియె. అంత జనకుని చూచి, నాన్నగారూ! ఒక్క పాషాణము శ్రీరాముని పాదము సోకి స్త్రీగా మారిపోయె గదా! వజ్రవైఢూర్య

రాళ్ళ నగలు ఎన్నో ధరించి వున్నాను. రామపాదము సోకి కన్యలుగా మారునేమో యని భయంబున మాల వేయనైతిని.

అది విని జనకుడు చిరునవ్వు నవ్వి, ఆ విధమున ఏల జరుగును. పూలమాల అలంకరించు తల్లీ అన్నాడు,

సిగ్గుతో ఇంకా తలవంచుకొంది సీత. ఆ కారణమున ఆమె రాళ్ళ నగలలో వజ్ర, వైఢూర్య. గోమేదిక, పుష్యరాగములలో ఎదుట నిలచిన రాముని ప్రతిబింబము కనబడుచుండె.

అది గని సీత అసలు రాముడెక్కడున్నాడో తెలియక నిలచిపోయె. అది గమనించి, చెలికత్తెలు ఆమె గడ్డం పట్టి కొంచెం పైకెత్తారు, ఎందుకమ్మా సందేహం? అన్నారు, ఎన్నో కోట్ల రామచంద్రులు కనబడుతున్నారు. ఇందులో ఎవరికి పూలమాల వేయను నాన్నగారూ అని అన్నది సీత. అంత జనకుడు నిజ రాముని చూపించి పూల మాల వేయమంటే, తల వంచి, మాల రెండు చేతులతో పైకెత్తి వెయ్యబోయి శ్రీరాముని పాదాలు చూస్తూవున్నది. జానకి మనసులో ఇలా అనుకుంటున్నది. పెద్దలు ఎప్పుడు ముహూర్తం పెడతారో? ఎప్పుడు పెండ్లి చేస్తారో? శ్రీరాముని పాదాలు ఎన్నాళ్ళకి చూస్తానో అని అనుకుంటూ, శ్రీరాముని మెడలో పూల మాల వేసింది. కరతాళములు మిన్ను ముట్టినవి. రాముడు సీతకు పూలహారము వేసె. సంతోషముతో నోలలాడుచుండిరి.

మంజరి ; హంస గమన శ్రీ జానకీదేవి వైచె పూలహారంబు
అంతలోనే అఖిల దేవతలు కురిసిరి పూలవర్షంబు

వచనం ;- దశరధ మహారాజునకు జనక మహారాజు శుభవార్త తెలియజేశారు. శతానంద, వశిష్ఠ, నామదేవ, గౌతమ, నారద, తుంబుర. కపిల, కస్యప. విశ్వామిత్ర. అగస్త్య. సనకసనందన సనత్కుమార, అత్రి భృగువాది ఋషులతో, దేవ మానవ, శంకర, పార్వతి, బ్రహ్మ, సరస్వతి, ఇంద్ర, దిక్పాలకులతో, మునికాంతలతో, అగస్త్య లోపాముద్రలు, రాజకాంతలతో, ఏనుగులు, గుఱ్ఱములు, ఒంటెలు రథములు, బండ్లు నడిపించే పెత్తనగాండ్రు, సకల దాసీజనములు, శాంత. ఋష్యశృంగుడు, కౌసల్య. సుమిత్ర కైక అంతా మిథిలకు ప్రయాణమయిరి. అరుంధతి అనసూయ రాముని చిన్ననాటిచేష్టలు ఇట్లు చెప్పదొడగిరి. శ్రీరాముడు తప్పటడుగులు వేస్తూ, చిన్ని కిరీటము ధరించి, మొలగజ్జెలు. కేయూరములు. కాలియందెలు

బోసి నవ్వులతో, ముద్దుటుంగరములతో పరువులెత్తేవాడు. నిద్దుర లేక ఒకనాడు పోరుపట్టాడు. ఎవ్వరు ఎత్తుకున్నా, యెంత ఓదార్చినా వూరుకోలేదు. దశరథుడు కౌసల్యకిచ్చాడు. కౌసల్య ఓదార్చలేక సుమిత్ర కిచ్చిన, సుమిత్ర ఓదార్చలేక కైక కిచ్చింది. కైకేయి యెత్తుకోగానే కమ్మగా ఒడిలో నిద్దురపోయాడు. కైకకు రాముడంటే, రామునకు కైక అంటే అంత ప్రేమ.

ఒక సమయంలో పది నెలల రాముడు కాళికాదేవిని పూజించాలని కౌసల్య తలంటుపోసుకోవడానికి వెళ్ళింది. వంటకాలన్ని, సకల షడ్రసాన్నములు నివేదించాలని పూజా మందిరంలో పెట్టేశారు. పూజా ద్రవ్యాలన్నీ అమర్చారు. తొట్లో పడుకొని వున్న రామచంద్రుడు నారాయణమూర్తి గనుక, మా అమ్మకు ఇంకా అజ్ఞానం పోలేదని. పది నెలల కుఱ్ఱవాడు ఐదు ఏండ్ల కుఱ్ఱవాడుగా మారి. పూజా మందిరవములో ప్రవేశించి సకలవంటలంతా తినేశాడు అన్నీ తిని బయటకు రాబోయే సమయంలో కౌసల్య అలంకార భూషితయై వచ్చింది. గబగబా పరుగెత్తి వెళ్ళి, పది నెలల బాలుడై తొట్లో వున్నాడు. మా అమ్మ పిచ్చిది. నాకంటే దేవుడెవరున్నాడు. సర్వం నేనే కదా! ఇలా అనుకుంటుండగా, ఆశ్చర్యంగా తొట్లో చూచింది. ఏమీ ఎరుగని వానివలె పది నెలల బాలుడుగా వున్నాడు.

మూతి నిండా పాయసం అంటుకొని వున్నది. ఇదేమి ఆశ్చర్యము. ఇతడు దేవుడే కాని మానవుడు కాడు. రామా! ఎంత దొంగవురా? అన్నది కౌసల్య అప్పుడు రాముడు క్యార్ మని ఏడ్చాడు. నోరు తెరచి ఏడ్చే. శ్రీరాముని నోట బ్రహ్మాండజాలము కనబడుచున్నది. ఇంత చిన్నవాడవు, ఇన్ని పదార్థాలు యలా తిన్నావురా? అని నోటిలో వెతికి వెతికి చూస్తున్నది కౌసల్య, బ్రహ్మాండజాలము చూచి, ఆశ్చర్యమానసురాలై గడగడ వణకిపోతూ,

శ్రీరామా! నీవు సాక్షాత్ పరమేశ్వరుడవు. తెలుసుకోలేక బ్రహ్మాండ నాయకుడవని, తల్లివని తెలుసుకోలేక కాళీని, దుర్గయని, దేవతారాధన చేయబోతిని ఇప్పుడు పుత్రవాత్సల్యము మరచి, భక్తవాత్సల్యముతో శ్రీరామచంద్రుని పెంచుతున్నది కౌసల్య.

ఒక సమయంలో మూడేండ్ల వాడై, దశరథుడు ఎత్తుకొని వుండగా నాకు ఆ చందమామ కావాలని ఒకటే పోరు పెట్టాడు. ఎన్ని విధాలుగా ఏది ఇచ్చినా పోరు మానలేదు. పెద్ద అల్లరై పోయింది. అప్పుడు కైక ఒక అద్దం తీసుకొని వచ్చి అందులో చందమామను చూపించినది. ఆ అద్దంలో చూచి ఆడుకున్నాడు

రాముడు. ముత్యాల వర్తకుడు వచ్చాడు. చిలిపిచేష్టలు లేని రాముడు ముత్యాల వర్తకుని ఒక ముత్యం తీసుకొని పారిపోతున్నాడు. ముత్యం, ముత్యం అని వర్తకుడు వెంట పడ్డాడు, బావిలో వేశాడు. రాముడు ఏ ముత్యాలిచ్చినా, దానికి బదులు ఎన్ని ఇచ్చినా వద్దన్నాడు. అదే ముత్యం కావాలన్నాడు. బావిలో వెతికినా దొరకలేదు. అప్పుడు శ్రీరామచంద్రుడు బావిలో చేయి ఇలాతిప్పాడు. వెంటనే ముత్యాల చెట్టు పైకి వచ్చింది. ఒక ముత్యానికి బాధ పడ్డావు ఎన్ని వున్నాయో చూడు, ఎన్ని కావాలో అన్ని తీసుకో అన్నాడు. అప్పుడు వర్తకుడు నీవు దేవుడవు కాని మానవుడవు కాదు అన్నాడు. ముత్యాలన్ని ఆయన పాదాల ముందు వేసి, నమస్కరించి తపోవనానికి వెళ్ళాడు. అంత గొప్పవాడు శ్రీరామచంద్రుడు అని శాంతాదేవి ఇలా చెప్పుచున్నది.

ఒకనాడు కోతి కావాలని ఏడ్చాడు. రెండు రోజుల వరకు ఆగలేదు అప్పుడు ఎక్కడెక్కడ కోతులను తీసుకొచ్చారు. ఈ కోతి నాది కాదు నాదికాదు అని ఏడ్చాడు. కిష్కింధనుండి కొన్ని కోతులను తెచ్చాడు, ఆ కోతులలో రాముడు వెతకి. ఇది నా కోతి అని ఆంజనేయుని తీసుకున్నాడు. వారిద్దరూ గాలిపటం ఆడుకుంటున్నారు. రాముని పటం ఆకాశంలో ఎక్కడో ఎగిరిపోయి, ఎంత లాగినా రాలేదు. ఆ దారము వెంట ఆంజనేయుడు వెళ్ళాడు. స్వర్గానికి వెళ్ళాడు. ఇంద్రుని కూతురు జయంతి పట్టుకుంది ఆ గాలిపటము. అమ్మా! గాలిపటము ఇమ్మన్నాడు శ్రీరాముడు వస్తేనే గాని ఇవ్వనన్నది జయంతి. మళ్ళీ ఆ దారము వెంట వచ్చి రాముడికి చెప్పాడు చిత్రకూటములో దరిశనము ఇస్తాను అని చెప్పాడు. అలానే చెప్పాడు. గాలిపటం విడిచిపెట్టేసింది.

ఒకనాడు రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు గురువు దగ్గర అస్త్ర విద్య నేర్చుకొని వచ్చి, బంతి ఆట ఆడుతున్నారు. శ్రీరాముడు విసరిన బంతి మందర కాలికి తగిలి విరిగింది. రాముడు స్వయంగా సేవ చేశాడు.

ఐదవ యేట వేదశాస్త్రములు చదివించి, వుపనయనాది కార్యములు నెరవేర్చిరి. అఖిల శాస్త్ర సంపన్నులు, అస్త్ర విద్యా నైపుణ్యంలో ఆరి తేరారు. నూనూగు మీసాలతో పెండ్లికొడుకు లయ్యారు. ఇలా చెప్పుకుంటూ మిథిలా నగరం చేరుకున్నారు.

ముసలితనములో దశరథునకు మహావీరులైన నలుగురుకొడుకులు ఆ కథలు చెప్పుకుంటూ మిథిలా నగరం చేరుకున్నారు. ఈ వార్త చారుల వలన

విని జనక మహారాజు దశరథునకు ఎదురేగి సకల మర్యాదలతో విడిది మందిర ములో ప్రవేశింపజేసె. అఖిల మర్యాదలతో విందులు చేసి మహదానందముతో వున్నారు. సంధ్యావందనము చేసి, భోంచేసి, తాంబూలం వేసుకొని ,దశరథమహా రాజు సభతీరి యుండగా, ఆమాట ఈమాట మాట్లాడుతుండగా, దశరథచక్రవర్తి మీకు నలుగురు కొడుకులు వున్నారు కదా! జనకునికి నలుగురు కుమార్తెలు వున్నారు. రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు సీత, వూర్మిళ, మాండవీ, సుత కీర్తులను ఇచ్చి వివాహం చేస్తే బాగుంటుందని అన్నారు విశ్వామిత్రులవారు. అంత దశరథుడు చిరునవ్వు నవ్వి అంతకన్నా మహాభాగ్యమేమున్నది స్వామీ! ఇదంతా మీ సత్కరుణ వలననే కదా! మా రామునకు కల్యాణ భాగ్య మబ్బినది. అంత వశిష్ఠులవారు జనకమహారాజా! మీ అభిప్రాయం చెప్పండి అన్నాడు.

కం॥ జనకుడు మహా సంతసమున బలికె
అంతకన్న భాగ్య మేమున్నదనిన
అందరు సంతోషము వ్యక్త పరచినారు

వచనం ;– వశిష్ఠులవారు మహాఋషులతో కలసి చైత్ర శుద్ధ నవమి, పునర్వసు నక్షత్ర, కర్కాటక లగ్నం సోమవారం ముహూర్తం పెట్టారు. శుభలేఖలు వేయించి పండితులైన బ్రాహ్మణులతో దేశదేశాలకు పంపించారు. నలుగురు కొడుకులకు ఒకేసారి కల్యాణమని కౌసల్య, దశరథులు వుబ్బిపోతున్నారు.

**కాఫీ రాగం — ఖండగతి**

పల్లవి : చిగురు కొమ్మలలో - చిన్ని పాటలతో
(సీత) చిన్నారి నా కోవెలా ॥చి॥

అనుపల్లవి: అలసి సొలసినాను - గానక అలమటించినానే
అలమటించినానే ॥చి॥

(రాముడు) మల్లె పొదలలో - తుమ్మెద ఓలె
తొంగి చూచె హంస ఓలె

చరణం : చిలుక పలుకులతో - అలయించెదవె
బంగరు కొలనులో - జలకము లాడగ
నాట్యము సేయుచు - రావే
నాట్యము సేయుచు రావే

చరణం : శుకపిక శారిక రవములు వెలుగుచున్న
సీవనసీమలో సన్నజాజి, సంపంగి, పారిజాతము
ఘుమ్మని సువాసనలతో ॥వి॥

చరణం : వసంత ఋతువున మంగళ వీణా కిన్నెర
నాదములు - మ్రోయగ
రతిని జేరి మన్మథు మదన క్రీడల దేలింప
మరలి పోయెనా
మనసు కలతదీర్ప వచ్చె రఘుధీరుడు దయతో ॥వి॥

వచనం :- ఈ విధమున చిలుకలు, పావురములు, హంసలు, గోరువంకలు ఇవన్ని సీతా రాములకు చీటీలందిస్తున్నాయి. అక్కడ వార్తలు ఇక్కడ అందిస్తూ వున్నాయి మయూరములు లేళ్ళు. ఇది ఇలా వుండగా చెలికత్తెలు సకల మధుర పక్వాన్నములు, పాయసములు, పిండివంటలు, షడ్రసాన్నములు ఇవన్ని సీతాదేవి తయారు చేయించి శ్రీరామచంద్రునికి చాటుగా పంపిస్తున్నది.

ఇలా తిరిగే చెలులు గోడకు చాకే యజ్ఞ చీమల బొఱులు యెలా వుంటాయో చూడండీ ఆ రీతిగా సీతమ్మ దగ్గర నుండి రాముడి దగ్గరకు, రాముడి దగ్గర నుండి సీతమ్మ దగ్గరకు ఆ రీతిగా తిరుగుతున్నారు.

శుభలేఖలు తీసుకున్న కౌసలేయ, సుమిత్రేయ, కైకయ దేశ దేశ రాజన్యు లంతా విచ్చేశారు. నవరత్న ఖచితమైన అద్దాల మండపము తయారు చేశారు. ముత్యాలముగ్గులు,పగడపు స్థంభాలు, అనేక శిల్పశాలలు, ద్రాక్ష గుత్తుల తోరణాలు, పచ్చని తోరణాలు, పసుపు కుంకుమలు, గాజులు, రాశులుగా ఇలా మిథిలానగరం కోలాహలంగా విద్యుద్దీపాలతో స్వర్గంలాగుంది

శంకరాభరణం — ఆది

పల్లవి : నలుగు వేసిరి రామ లక్ష్మణులకు
అనుపల్లవి: భరత శత్రుఘ్నులకు ముత్యాల పీటలపై ॥న॥

నలుగు వేసిరి జానకీ కన్యకు
నాణ్యంబుగా - శాంతా అరుంధతిలెల్లను ॥న॥

విరునగవుల శృంగార పురుషుడా
వరుసలు బాడిరి యువతీ జనమ్ములు ॥న॥

చరణం : కోడలా, వదినా, కదలి రావమ్మా
తలంటి పన్నీట జలకంబులాడేవు
మా పిల్లను గని మురిసేవు శ్రీరామ
వెతికిన దొరకదు ఈ జగమందున ॥న॥

చరణం : ఎన్ని నోములు నోచెనో మీ పిల్ల
అల్లుడాయె. మా రఘురాముడు ॥న॥
అల్లరేల రండని సరసములతో
పెండ్లి కొడుకుల పెండ్లి కూతురుల జేసిరి ॥న॥

వచనం :– కౌసల్య. సుమిత్ర, కైక, అరుంధతి, శాంతామ తల్లి, సప్త ఋషుల భార్యలు, మునికన్యలు పసుపు రాసి, కల్యాణపు బొట్లు పెట్టి. మధు పర్కములు ధరింపజేసి అడుగుల పారాణి నలది. చెక్కిలి కాటుక చుక్కలతో అలంకరించి, బ్రహ్మపురోహితుడై, వేదమంత్రములు చదువుచుండ, మహా ఋషులెల్లరు వేదోచ్ఛరణ చేస్తుండగా, జనక మహారాజు, సునాయాన మహారాణి బంగారు పళ్ళెరములో శ్రీరామచంద్రుని పాదములు కడిగి, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల పాదాలు కడిగి, సీత, ఊర్మిళ, మాండవీ, సుతకీర్తులను కన్యాదానం చేశారు మహా వైభవంగా నవరత్న మండపంలో.

శ్లోకం · మాంగల్యం తంతునానేన మమ జీవన హేతునా
కంఠే బధ్నామి శుభకే సంజీవ శరదాంశ్శతం

భీంప్లాస్ — ఆదితాళం

పల్లవి : వెయ్యి కన్నులున్న చాలవు
అనుపల్లవి: సీతారాముల కల్యాణము జూడగ ॥వె॥

చరణం : పసుపుపచ్చని - యొడలు గలిగి
మధుపర్కములు ధరించిన శ్రీ సీతా ॥వె॥

చరణం : నలుగురు నాలుగు వేదముల వలె
వేదార్థమన, నలుగురు కన్యలు

ఇట్టి దంపతుల విందు గానము
వేదముల నటనకు మనమెల్లరము ॥వె॥

మాంగల్య ధారణములు వేసి
మంచి ముత్యాలు తలంబ్రాలు పోసి
పెండ్లి కొడుకులా పెండ్లి కూతుల హొయలు
ముచ్చటలు దీరగ ॥వె॥

వచనం ;- ఈ విధముగ శ్రీ సీతారాముల కల్యాణము జరిగినది. ఊరేగింపులు, ఆటపాటలు, పట్టు వస్త్రాలు, నగలు, గోవులు, వెండి కొమ్ముల గోవులు, బంగారు కొమ్ముల గోవులు, వస్త్రాభరణాలు, వెయ్యి దాసదాసీజనులు ఈ విధముగా జనక మహారాజు కుమార్తెలకు కట్నముగా ఇచ్చాడు.

జనక మహారాజు అల్లుడికి పది వేల గుఱ్ఱాలు, పదివేల ఏనుగులు, పదివేల రథములు, పదివేల ఆయుధాలు, పదివేల విచిత్ర శిల్పములు, వస్త్రాభరణములు గాక ఇవన్నీ ఇచ్చి.

మణిమయ నవరత్న కిరీట కేయూర కుండల తారహార చంద్రికలతో శ్రీరామచంద్రునకు కట్నముగా అనగా అరుణముగా ఇచ్చారు. దశరథ చక్రవర్తి కోడళ్ళకు , మూడువేల మంచి దాసదాసీజనులు, వస్త్రాభరణములు బంగారు వెండి కొమ్ములేసిన గోవులు లెక్కలేనన్ని నగలు నాణ్యాలు అరుణముగా ఇచ్చారు. అగ్నిసాక్షిగా రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు సీత, ఊర్మిళ, మాండవి, సుతకీర్తులకు మహా వైభవముగా ఐదు రోజులు కల్యాణోత్సవము జరిగినది. దేవతలు పూల వర్షం గురిపించి దేవదుందుభులు మ్రోగించారు. వసంతపు బిందెలో బంగారు వుంగరాలు వెతుకుతూ రాముని కన్న సీత బటువు ముందుగ తీసింది. జనక మహారాజు నా గుర్తుగ ఎప్పుడు ఈ సిరోమణి ధరించమని సీతకు ఇచ్చాడు నిషేధ ముహూర్తం అనంతరం భక్ష్య భోజ్యములయిన తరువాత అందరూ కట్నకానుకలు తీసుకొని దీవించి వెళుతున్నారు. దశరథచక్రవర్తి, జనకచక్రవర్తి కనక వర్షం గురిపించి, గోదాన, భూదానాలతో జనకమహారాజు శలవు తీసుకుని దశరథ చక్రవర్తి నలుగురు కొడుకులు, నలుగురు కోడళ్ళతో అయోధ్యకు ప్రయాణము అయ్యారు.

అప్పుడు జనక మహారాజు వెయ్యి కావిళ్ళ పాలు, వెయ్యి కావిళ్ళ పెరుగు, వెయ్యి కావిళ్ళ నెయ్యి, వెయ్యి కావిళ్ళ తేనె, వెయ్యి కావిళ్ళ బెల్లం, వెయ్యి

కావిళ్ళ ఫలపుష్పాదులతో జనక మహారాజు అప్పగింతలు చేశారు. రథము వూరు వెలుపలకు రాగానే సుడిగాలి దూసుకువస్తున్నట్లుగా దుమ్ము ఆకాశమునకు అంటు తుంది.

శ్రీరాముడు ధనుష్టాంకారం చేసినప్పుడు ఆ శివ ధనువు గంటల సవ్వడి విని అప్పుడు, అరరే నా గురువుదైన శివ ధనువును ఎవరో ఎక్కు పెడు తున్నారు అని గండ్ర గొడ్డలి భుజాన వేసుకొని మహా కోపంగా అప్పుడు ప్రయాణ మయిన పరశురాముడు ఇప్పుడు మిథిలా పట్టణం పొలిమేరల చేరుకున్నాడు.

శ్లో॥ · తత బలోద్దండ వేదండ సుండాదండ
చండద్దిహః కాండ ప్రకాండమున
ధగధగ ధగాయమానమైన
కఠోరమైన కుఠారమునుగొని
ముయ్యేడుమారులు
కయ్యాన పుడమి రేడులన్
జెక్కు జెక్కుగా తరిగి
నెత్తురుటేరులు నిగిడించినట్టి జట్టి
భార్గవ రామునిన్ విత్త విధి నఖిలషింతు
నన్ గాచుటకై, నితాంత గుప్త
నిజ కింకర, సుదీక పరశురామ కొలను పాక
వీరనారాయణ ముకుంద విశ్వతుంద

వచనం :- అట్టి పరశురాముడు శ్రీరాముని రథమున కడ్డుకొని, గండ్ర గొడ్డలి ఝుళిపించి, కన్నుల నిప్పుల రాల్చుచూ

గీ॥ రామనామమునకె గాని నీవొక రాముడవా
శివధనువు విరచిన ఘనుడనుకొంటివా
నా చేతి విలు విరువుము నీ పస తెలియును
రామా లేక చంపుదు నిన్నున్

వచనం ;- క్షత్రియులు నాకు శత్రువులు. ఇరువది ఒక్కమారు ప్రపంచమెతికి రాజులను జంపి, ఆ రక్తము పితృతర్పణము చేసి స్వర్గమునకు అవ్వారి శిరస్సులు మెట్లుగా కట్టాను.

నీ శిరస్సుతో నూట ఒక్క శిరస్సు అవుతుంది. నా గురువుదైన శివ ధనువెందుకు విరచావు. నా గండ్ర గొడ్డలితో నీ శిరస్సు నరికేస్తాను అనిన పరశు రాముని శ్రీరాముడు చూచి, రథం దిగివచ్చి, స్వామీ కొత్తగా పెండ్లయిన వాణ్ణి, నన్నాశీర్వదింపుమని నమస్కరించాడు. నాతో యుద్ధం చెయ్యమన్నాడు. బ్రాహ్మ ణోత్తమా స్త్రీలతో, బాలురతో, బ్రాహ్మణులతో. నపుంసకులతో, వృద్ధులతో, తలపాగా లేనివారితో, ఆయుధము లేనివారితో, యుద్ధములో వెన్ను చూపిన వారితో మేము యుద్ధము చేయయి, ఇది మా వ్రతము అన్నాడు శ్రీరామచంద్రుడు.

రాముని వినయముచూచి మరింత మండిపడుతూ నేనే రాముడుండ గ నీవూ ఒక రాముడవా, నీవు గ్రామ సింహముతో సమానమైనవాడవు. నేను కారు సింగముతో సమానమైనవాడను. ఆ మాట వినేవరకు లక్ష్మణాదులకు కోపం వచ్చింది. అన్నయ్యా! మితిమీరిన ఈ బ్రాహ్మణునకు తగిన బుద్ధి చెపుతాను అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణా శాంతింపుము స్వామీ, మీరు నా శిరస్సు నరికినా సం తోషమే కాని నేను మాత్రం మీతో యుద్ధం చేయను అన్నాడు రాముడు నీకంత బలముంటే రామా నా చేతిలోని విల్లు నీ చేత గొనుము అన్నాడు పరశురాముడు. పరశురాముని చేతిలో విల్లు రామునిచేతిలో లాక్కుంటూ పరశురాముని తపోశక్తి బలసామర్థ్యాలన్నీ లాగేశాడు. అంత పరశురాముడు బలహీనుడై శ్రీరామా శ్రీ రామా నా తప్పులు మన్నింపుము. నా తపోబలమంతా ధనుస్సులో లాగేశావు. కోటి సూర్యులవలె ఆ ధనుస్సు వెలుగుతున్నది.

నీవే నిజమయిన రాముడవు. నీవే కారు సింహము. నేనే ఊరకుక్క తో సమానమైనవాడను నీవే నిజమైన రాముడవు అని పాదాలుబట్టి వేడుతుంటే బ్రాహ్మణోత్తమా! ఎక్కుపెట్టిన విల్లు వదింపక దించుట ధర్మము కాదు నీ రెండు పాదాలు ఖండిస్తాను అన్నాడు రాముడు. రామచంద్రా హిమాలయములో తపస్సు చేసుకోవాలి నా పాదాలను ఖండించకు. ఉత్తరదిశలో కొండలమీద రాక్షసులు న్నారు. వారి మీద ప్రయోగించు అని అన్నాడు.

రాముడట్లే చేశాడు. ఆ దివ్యాస్త్రం తీసుకొని పరశురాముడు హిమా లయాలకు వెళ్ళిపోయాడు. దశరథ చక్రవర్తి సకల జనులతో అయోధ్య చేరు కున్నారు. పెండ్లికూతుర్లకు, పెండ్లికొడుకులకు ముత్తయిదువలంతా ఇలా మంగళ హారతి పాడుతున్నారు.

సరస్వతి — ఆది

మంగళం - నిత్యమంగళం
సీతారాములకు - ఇనకుల సోమునకు
మంగళం - నిత్యమంగళం
పచ్చ కర్పూరపు హారతులతో
కొత్త దంపతులకు - దీవెనలతో
మంగళం - నిత్యమంగళం

— మంగళం —

— శుభం - శుభం - శుభం —





శ్రీ రామ జయం

# శ్రీ అమృత రామాయణము

## తృతీయ అధ్యాయము

## శ్రీరామ పాదుకా పట్టాభిషేకము

### ప్రార్థన

శ్లోకం : ఇంద్రనీల మణికాంతి కాయం
కర్ణకుండల దీప్తి కదలియాడ
రత్న కిరీట కాంతి భాను, బింబంబు మరుగుసేయ
కనకమయ వేల శ్రీరామచంద్ర సుగుణసాంద్ర

#### శ్రీరాగం — ఆది తాళం

పల్లవి : మరుగుజ్జు - నా స్వామి - నా మొర వినరా - కనకమయవేలా
అనుపల్లవి: పార్వతి చిన్నారి పాపడా-బాపరా మాకుగల పాపములు దయతో॥మ॥

#### మాల్‌కోస్ — ఆదితాళం

పల్లవి : రత్న కిరీటధారీ, రాణీ – వాణీ –వీణాపాణి రంజిత వేణి ॥ర॥
చరణం : మరువకమ్మ ఏనాడునూ మదిలోన నీ వారిని
మరువక, రక్తి, భక్తి, శక్తి నిచ్చి బ్రోవుమమ్మ దయతో ॥ర॥

#### కల్యాణి — రూపకం

పల్లవి : శ్రీరాముని పాదుకలకు – పట్టాభిషేకము
అనుపల్లవి: భరతుడు భక్తితో పాలించు రాజ్యము
పతితోడ జానకి పడిన బన్నములు ॥శ్రీ॥

వచనం ;- ఒకనాడు దశరథుడు సర్వాభరణభూషితుడై రత్నాభరణాలుధరించి రత్న కిరీటము ధరించు సమయములో ఆ నిలువుటద్దములో తెల్లని వెంట్రుక ఒకటి కనపడినది.

దశరథుడు ముసలివాడినయ్యానని రామునకు పట్టాభిషేకము వేయవలెనని సభలో ఇలా చెపుతున్నాడు.

సీ॥ దేవమానవులు మెచ్చ
దేవదేవుడు నాకు సుతుడు
ఏ వంశమున ఇట్టి కొడుకు బుట్టె
ఎవరి కీర్తి దిగంతములు నయ్యే
నాకుగల అదృష్టంబు లేదుగాన
రామునకు పట్టాభిషేకమేను
చేయదలచితిని గాన మీరునెల్ల
సంబారములెల్లను సిద్ధపరుపుడనుచు

గీ॥ కనుల పండుగ రామ పట్టాభిషేకమనుచు
తలయూచి రాముని అడిగినంత
భక్తితో రాముడు ఒప్పుకొనియె
రాజ్యమెల్ల అలంకరించినంత

వచనం :- శ్రీరామా నీ అభిమతమేమి అని అనిన తండ్రీ మీ యాజ్ఞానుసారం వర్తింతునని నమస్కరించె. వశిష్ఠ మహా ఋషి ముహూర్త నిర్ణయం చేయండని దశరథుడడిగాడు. దశరథా చైత్ర శుద్ధ నవమి మూడు దినములే వున్నది అని ముహూర్తం పెట్టాడు.

అప్పుడు ప్రజలిలా అనుకుంటూ వున్నారు. రేపేనా రామ పట్టాభిషేకమని. జై, శ్రీరామచంద్రమూర్తికీ జై అని ఎవరి పనులలో వారు నిమగ్నులయ్యారు. ఎంత చిత్రమో చూడండి. అరవై నాలుగు వేల సంవత్సరములు రాజ్యమేలిన దశరథునకు అప్పుడు కనబడినదట తెల్ల వెంట్రుక. అంత వరకూ ఆయన తల తెల్లబడలేదు.

అయోధ్య స్వర్గం చేసేశారు. ఆ కోలాహలం. ఆ వేడుకలు వేయి

నోళ్ళ వర్ణించ తరముకాదు. అప్పుడు మంథర తెల్లవారుఝామున తన మందిరం దగ్గర నుండి కైక మందిరానికి వస్తున్నది. ఆ అలంకారమంతా చూచి ఏమిటే ఈ అలంకారానికి కారణం? శ్రీరామ పట్టాభిషేకమునకు అని దాసీ చెప్పింది, ఏమిటీ శ్రీరామ పట్టాభిషేకమా? అవునమ్మా శ్రీరామ పట్టాభిషేకము. అన్నాది. వాల్లే అని మూతి ముక్కు తిప్పుకొని వెళ్ళిపోయింది, మంథర.

కం॥ నిప్పులు గ్రక్కుచు మంథర ముప్పేమటలతో
వచ్చి అనియె కైక తోడ గుండె బాదుకొనుచు

మంజరి : కైక దాసి మంథర, కైకనట్టె పరికించి
తెలియనేరవు వెలుపలి సందడి
వెఱ్ఱిదానవని నవ్వి

వచనం ;– చూడు కైకా నీవు తెలివులేని దానివని నీ తండ్రి నన్ను పంపించారు అన్నది మంథర. మంథరా ఏమిటో చెప్పవే. ఏమని చెప్పమంటావమ్మా, శ్రీరామ పట్టాభిషేకం. ఏమిటే మంథరా ఏమన్నావు శ్రీరామ పట్టాభిషేకమా - ఆహహా! ఎంత శుభవార్త చెప్పావే. ఇదిగో. ఈ రత్నాభరణం తీసుకో. ఎందుకమ్మా ఈ హారం. శుభవార్త చెప్పినందుకు. సవతికుమారునకు పట్టాభిషేకం నీకు సంతోషమా అని నేలకు కొట్టింది రత్నాలమాల. నీకు కొడుకు, కోడల్లకు నీడ వున్నదా!

ఉ॥ కొడుకు రాజని మురిపించు సవతి కౌసల్య
అనుచు సిగ్గు ఎగ్గు లేక, సంతసింతువా నీవు
మతి మాలితివా నీ కుమారునకు పట్టము
గట్టెదనని పెండ్లియాడె నిన్ను మరచితివా మగువ నేడు

వచనం : తనకు మాలిన ధర్మం లేదు కైక మంథరతో ఇట్లనియె. నాకుమారుడు భరతునకు రాజ్యార్హత లేదు. చిన్న వాడు కనుక, రాముడు పెద్దవాడు మా సూర్య వంశంలో పెద్దవానికే పట్టం కడతారు అన్నది కైక. నీవు నీ కొడుకు కోడలు వారికి బానిసలుగా వుండాలి అన్నది మంథర.

మాండు – ఆది

పల్లవి : వన్నె వన్నెల పూలు - అందమైన బాటలూ
ఏ వంక చూచినా - ముత్యాల ముగ్గులే ॥వ॥

అనుపల్లవి: ఆ రంతులు - ఆ గంతులు - ఆ వంతులు
ఆ విందులు - వందలు - వేలు ॥వ॥

వచనం ;- ఇలా కైక, మంథర మాట్లాడుతూ వున్నారు. దేవలోకంలో దేవత లంతా సరస్వతీదేవి దగ్గరకు వెళ్ళారు. అమ్మా! దుష్ట శిక్షణ, శిష్ట రక్షణమునకు రాముడు వనవాసం చెయ్యాలి. కైకలో చేరి భరత పట్టాభిషేకం, రామవనవాసం ఈ రెండు వరములు కోరుకోతల్లీ! చాలు అని వేడుకొన్నారు. భారతి కైక జిహ్వ లో(నాలుక) ప్రవేశించింది. ఆ క్షణము నుండి కైక మారిపోయుంది.

సీ॥ కొంతవరకు కైక యోచించి పలుమారు
మంథర చెప్పిన మాటలందు
కలదు మేలటంచు తలనూపుకొనుచు
నిట్టూర్పులు నిగిడించుకొనుచు
ముదుసలి తన మగడు వెనుదీయడు
తన యాజ్ఞ గెలతునంచును తాను తన మది తలచు
పరుల మేల్గని ఓర్వరు మునులునైన
సవతి మేల్గని సహించగలనె

గీ॥ భరతునకు పట్టాభిషేకము జేయుమనుచు
తనకుమాలిన ధర్మమెందైన గలదె
తన సుతుడు రాజగుటకన్న తల్లికి
కలదె సంతోషము ఏ కాలముననను

భళీ! లెస్స బలికితివే మంథరా! మెచ్చితినే.

ఉ॥ దశరథుడు అందరికన్న నా యందు మిగుల
తగిలియుండు నటంచు చెప్పుకొందువీవు కాని
జూడగ కౌసల్యపైన వలపు కలుగు నటంచు
దోచుచుండె వెఱ్ఱిబాగులదాన వగుటవలన

కమాచి — ఆది

పల్లవి : పాటించి నీ మాట నెరవేర్చకున్న కైకనగుదునె
అనుపల్లవి: నే కైకనగుదునే ॥పా॥

చరణం : నా మాట నమ్మి మాపాటికి వెళ్ళి కుదిరి
రోకలి తల జుట్టుమన్నట్లు
మహారాజు పదవినే
నిముసమున గొనెదనే ॥పా॥

సీ॥ అగ్ని సాక్షిగా పెండ్లి ఆడిన భర్త
అవమానపరుప సహించగలనే
తనకుగాని సుఖంబు సాటివారును పొంద
నోర్వగల్గునే మునియైనగాని
తన సుతుడు రాజగునని నుడికించుచున్న
సవతులెల్ల - నా సుతుడు నా కోడలు
నిలువ నీడలేక నిలువవలసె

గీ॥ ఫితి హితవు లేని బ్రతుకదేల
ఈ పరాభవాగ్ని భరింపజాల
ఇంక నాకొసంగుము రెండవరంబులీవు
భరతుని రాజుని చేసి, రాముని పదునాలుగేండ్లు నుంచు కానలోన

వచనం :- దేవాసుర యుద్ధమప్పుడు దశరథుడు మూర్ఛబడగ నీవు యుద్ధం చేశావు. నిన్ను మెచ్చి నీకు రెండు వరములు ఇస్తానన్నాడు. ఆ వరములలో ఒకటి భరతునకు పట్టాభిషేకంకట్టమనుము రాముని పదునాలుగేండ్లు వనవాసంపంపుము అని మంథర కైకకు బోధించి అదుగొ, మహారాజులవారు వస్తున్నారని, మంథర దాక్కున్నది. కైక కోపగృహమునకు పోవుచు నగలు. పూలు, సకలాభరణములు మంగళ ద్రవ్యములన్ని ఇల్లంతా చిందర వందరగా వెదజల్లి పడేసింది.

వీణలు, మృదంగాలు వాయించే సకల దాసదాసీ జనులనంతా తరిమేసింది. తాను చీకటి గదిలో తల విరబోసుకొని శివశక్తిలాగ మాసిన చీర గట్టుకుని, కోపగృహంలో నేల పరుండి వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

అంత, దశరథుడు ఆ శూన్య గృహమును చూచి. ఓహో! ఇదంతా నేను రెండు దినములలో రాని కారణము చేత కైకకు కోపం వచ్చినదని, దశరథుడు కోపగృహంలోకి పోయి, కల్ల, నగవు, దొంగనిద్ర, ఇలా నటించే కైకను చూచి, బ్రతిమాలుతూ లేపుతున్నాడు. కైకా, కైకా, నీకు ఎవరు ఏమి అపచారం

చేశారు? వారు నా చేతిలో బ్రతుకుతారా.

గీ॥ నీకుగల కోర్కెలు ఏమయిన దీర్తు
నీ సంతోషమె నా సంతోష మరయ
కోరు మిద్దేని వరమిచ్చెద నో మశ్చకంఠి
అని కౌంగలించు విభునకు కైక అనియె నిట్లు

వచనం :- అని బ్రతిమాలగా, బ్రతిమాలగా చెప్పరాని నటనలతో కైక అనేక విధముల దశరథుని అలయించినది. నీవు సంతోషపడాలంటే. నా ప్రాణమయినా ఇస్తాను. ఏమి కావాలో కోరుకో కైకా,

నీకు ఒక శుభవార్త చెప్పాలని ఎంతో సంతోషముతో చెప్పాలని, నా మాటలు వింటే నీవు ఎంత సంబర పడిపోతావో, అని దశరథుడు అన్నాడు. అంత కైక దేవాసుర యుద్ధము నాడు నాకు ఇచ్చిన వరములు కావలసి వచ్చె. ఓహెూ ఇంతేనా. నా ప్రాణమయినా ఇస్తానన్నాను కదా! తప్పక ఇచ్చెదరా. కైకా తప్పకుండా ఇస్తాను. కోరుకో ఎన్ని వరాలయినా ఇస్తాను.

ఒక వరము, అయోధ్యకు, భరతుని పట్టభద్రుని చేయాలి. రెండవ వరమునకు బ్రహ్మచర్యాది నియమములతో పధ్నాలుగేండ్లు శ్రీరాముని అరణ్య వాసమునకు పంపాలి. నాకు ఈ వరములిచ్చిన చాలును. కైకా. శ్రీరామ పట్టాభి షేకము అని చెప్పవచ్చితిని నీ విధము చూచి మరచితిని. నాతో సరసము లాడు చుంటివా కైకా. పరిహాసము కాదు. నిజమే ప్రభూ. కైకా నీకు రాముడంటే ఎంతో ప్రేమ కదా! నీ రాముని వనవాసమునకు పంపుటకా, కల్ల నగవులు, దొంగ నిద్ర లేని దుఃఖము - నిజమేనా, రాజా నా సవతి కొడుకునకు పట్టాభిషేకం నాకానంద మెట్లగును నాకూ కోరికలున్నవి కదా!

నా కొడుకు రాజయితే నాకే కదా! సంతోషం, కైకా అని గట్టిగా అరచి నీకు పుట్టిన దుర్బుద్ధి కాదు. నీకెవలో బోధించారు. నీవు రాకాసికాని మాని సివి కావు. రాముని వంటి సుగుణ రత్నాకరుణ్ణి వనవాసమున కంపుదువే రాక్షసీ,

శ్రీరాముడు ఏమి నేరం చేశాడని నీ మనస్సు మార్చుకో రాజా. నా రెండు వరములు నాకిస్తే సరి. లేకుంటే ఆ కత్తితో నేను పొడుచుకొని నా ప్రాణాలు విడిచెదను.

అనగానే దశరథుడు హా! రామా! రామా! అంటు మూర్ఛబడి పోయాడు. సీతారాములు కృతస్నానులై, సర్వాభరణ భూషితులై, గజారోహణం పై వూరేగింపు జరిగి రాముడు తిరిగి వచ్చాడు. ముహూర్తము సమీపించినది. కైక మందిరమునకు వెళ్ళిన దశరథుడు ఇంకా రాలేదని. ఇసుక వేస్తే రాలని జననహరులో, కిక్కిరిసిన జనసమూహం. రామ పట్టాభిషేకమని, ముత్యాల హారాలు, రత్నాల హారాలు దోమాలతో రాముని సత్కరిస్తున్నారు.

మంత్రి సుమంతుడు, కైక మందిరానికి వచ్చేవరకు కైక సుమంతా, సుమంతా, నీవీ తక్షణమే పోయి, నా ఆజ్ఞగా రాముని నా మందిరమునకు రమ్మనుము.

తాతగారి ఇంటికి వెళ్ళిన భరత శత్రఘ్నుల వెంటనే పిలిపించండి, అని చెప్పిన కైక అవతారమును, దశరథుడు మూర్ఛబడియుండ గనిన సుమంతుడు - క్షణ మాత్రము ఆలస్యము చేయక ఏదో కీడు వాటిల్లుచున్నదని - రామ చంద్ర ప్రభూ - కైక మందిరమునకు రమ్మనమని పిత్రాజ్ఞ అయినది. అప్పుడు వెంటనే శ్రీరామచంద్రుడు కైక మందిరానికి వచ్చి నమస్కరించి - అట గల విశేషములు గ్రహించి, అప్పుడు ఇలా అంటున్నాడు.

## జగన్మోని — రూపకం

పల్లవి : ఏమీా చేసీతి తల్లి - నేరంబులేను

అనుపల్లవి: తెలిపీనా సవరించుకొందును వేవేగ ॥ఏ॥

పాదములకు మ్రొక్క - పలుకడు తండ్రి
పలుకరించిన గాని - పలుకదు తల్లి
ఏ జన్మాములలోన - చేసినా పాపము
భరియింపగా జాల - ఎరిగింపుమమ్మ ॥ఏ॥

వచనం ;- రామా! నీ తండ్రి మాట నిలుపుదువా, అన్నది కైక. శ్రీరామ చంద్రుడు నమస్కరించి, అంతకన్నా మహా భాగ్యమేమున్నది తల్లి.

గీ॥ భరతునకు పట్టము కట్టదలచితిని
నిన్ను పదునాలుగేండ్లు కానకంప దలచితిని
వనవాసమునకు కేగవలయు
ననిన, తల్లి, తండ్రి ప్రేమ పదవికి దూరమైతి।

వచనం ;- అమ్మా! మీ ఆజ్ఞ శిరసా వహించెద. రామా! ఈ రాజభూషణములు విడచి, నార వస్త్రములు కట్టుకొని, పదునాలుగేండ్లు వనవాసము చేసిరమ్ము. భరతుడు రాజ్యమేలును అని చెప్పిన కైక మాట విని నారవస్త్రములు కట్టుకొని, తల్లి పాదములు కన్నీటితో కడుగుచూ రామచంద్రుడిట్లనియె.

చక్రవాకము — ఖండగతి

పల్లవి : వనవాసమునకు నన్నంపగాలేక
నా తండ్రీ నీవిట్లు తపియింతువా ॥వ॥

అనుపల్లవి: నారకోక లు గట్టి పోయి వచ్చెదననిన
జానకి వచ్చి పయనమగునంతలో

చరణం : పితృవచనము నిలుప కానకు పోయెద
అత్తమామల సేవ సేయుచూ నుండుమా
అనిన జానకీ నేగూడ వత్తునన
పదునాలుగేడులు గడపి వచ్చెదననిన ॥వ॥

వచనం :- సీతారామచంద్ర నన్ను గొనిపోవకయున్న ఇప్పుడే నా ప్రాణములు విడిచెదనన్న సీత రాకకు శ్రీరాముడు సంతసించె. లక్ష్మణుడు వచ్చి నారకోకలు ధరించి యున్న సీతా రాములను చూచి మండిపడి కైకను చంపబోవ, రాముడు నివారించె. అట్లయిన రామచంద్రా! ఈ అయోధ్యలో ఒక్క క్షణం కూడా వుండలేను. నేను కూడా మీపాదసేవ చేస్తూ మీ వెంటనే వచ్చెదను. లక్ష్మణా! భరతునకు పట్టాభిషేకం, పద్నాలుగేండ్లు వనవాసము చేసి వచ్చెద. పితృాజ్ఞ అయినది. నీవు తల్లిదండ్రుల సేవ చేస్తూ, అయోధ్యలో వుండి సర్వకార్యములు నిర్వహింపుము అప్పుడు లక్ష్మణుడు సవతమ్మ దురూపదేశమా ఇది, ఇప్పుడే కైక తల నరకి కాకిమూకలకాహారము వేసెద అనిన లక్ష్మణుని నివారించి లక్ష్మణా! ఆగ్రహింపక నీవు తల్లిదండ్రుల సేవచేయుచూ రాజ్యములోనే వుండుము. నీవు లేని అయోధ్యలో ఒక్క క్షణము కూడా వుండలేను. కాదంటివేని ఇప్పుడే నీ పాదాల చెంత ప్రాణములు విడుస్తానని అన్నాడు లక్ష్మణుడు. లక్ష్మణుని రాకకు సమ్మతించె. రామా-రామా యని పలుకక దుర్భర శోక దావాగ్ని దంధవ్య మానసుడైన దశరథ చక్రవర్తిని చూచి పాదములకు నమస్కరించిన కొడుకులను గని, కౌగిలిని చేర్చుకొని, నోట మాట రాక ఖిన్నుడై చూపు తప్ప ఏమీ లేని దశరథుని చూచి నమస్కరించి తన్ను బాసి తన తండ్రి బ్రతుకలేడని గ్రహించిన రాముడు సీతా, లక్ష్మణ సహి

తుడై పినతల్లికి నమస్కరించి కౌసల్యా మందిరమును చేరుకొనియె. నార చీరలు ధరించి వచ్చిన రాముని గని. కౌసల్య, సుమిత్ర, అంతఃపుర స్త్రీలందరూ ఘొల్లు మని ఏడ్చి నమస్కరించు కొమరుని కౌగలించుకొని ఇదా! నీ రాజరూపము రామ చంద్రా? రామా! రాజువై రాక-జోగివై పోవుచుంటివేల? నీ తండ్రి బ్రతుకునా? యని ఆశీర్వదించి ముద్రిక రామునకు రక్షామణిగా తొడిగిరి, అంత చూచి అమ్మా విచారింపకుము. వశిష్ఠాది మునులకు చెప్పి, సుమిత్రకు అభయమిచ్చి, వశిష్ఠాది మహా ఋషులకు నమస్కరించి, తనపై ప్రేమగల ప్రజలకు వారి బాధ నివారించి మంత్రి సామంతాదులకు చెప్పి, సుమంతుడు రథం సిద్ధపరుపగానే సీతా, లక్ష్మణ సమేతుడై రథమెక్కి సరయూనది చేరబోవ, ప్రజ లెల్లరు గుంపులు గుంపులుగా వెంటబడి పోవలదని ఏడ్చే ప్రజలతో రాముడు ఇలా అన్నాడు. నేను మరలివచ్చి రాజ్యపాలన చేస్తానని చెప్పినా వినక వెంట బడ్డారు. సీతా, లక్ష్మణ సహితులై, సరయూనది దాటి

శా॥ తనయా రామా యని కృంగి కృశించి భరింపలేక పాదములబడిన
తన సవతుల నుడికింతునంచు పొంగు కైకను ఏమనలేక ప్రాణములు
పోవుచున్న దశరథుని చూచి నవ్వుచు తన సవతులను వుడికించవచ్చునని
పొంగుచున్నతరి రామా-రామా-రామా యని దశరథుడు ప్రాణంబులు విడిచెన్

వచనం :- రామా! రామా! యని ప్రాణం విడిచాడు దశరథుడు. ఈ వార్త తెలిసి అందరూ ఘొల్లుమన్నారు. కౌసల్య, సుమిత్ర, అంతఃపుర కాంతలు ఘోర ముగా ఏడ్చుచున్నారు. స్వర్గ సమానమైన అయోధ్య క్షణములో నరకంగా మారి పోయింది. కైకకు భర్త చనిపోయాడన్న బాధ లేక తన కుమారుడు రాజ్యమేలు తాడన్న ఆశతో ప్రపంచము కానని గర్వముతో తులతూగుచున్నది. భరత, శత్రు ఘ్నులను వారి తాతగారి ఇంటి నుండి రమ్మనమని వర్తమానం పంపింది.

## శంకరాభరణం — ఏకతాళం

పల్లవి : రామా రఘుకులసోమా ఏమి నీ లీల ఎరుగగజాల

అనుపల్లవి: చదువగలేని మూర్ఖుడ సామీ నా పడవ సరిగ అమరేనేమీ ॥రా॥

చరణం : రాజ్యము ఏలక ఏల పోయెదవు
ఎవరు నిన్ను బంపిరిరా స్వామీ ॥రా॥

కం॥ ఎవరి వలన ద్రోహంబు లేదు నా తండ్రి
ఆజ్ఞ వలన పోవుచుంటి పొంక మెడసి

వచనం ;- అంత గుహుడను నిషాధ పతికి సమాధానపరచి నంత ఎన్నియో కానుకలు, అడవి పూలు గొనివచ్చి శ్రీరామ పాదములు పూజించి, చిన్న పర్ణశాల వేసి, అడవిగోవు పాలు, కందమూలములు, కొండతేనెలు ఆరగింపచేసి, ఆ రాత్రి నిదురించిరి.

మంజరి : మృగబాధ లేక దరుముచునుండి పవళించె నా గుహుడంత
లక్ష్మణుడు భయమంది సీతారాముల కాచుచుండె నంత

వచనం :- సీతా రాములను మృగములు గొనిపోవునని కావలి వున్న లక్ష్మణునకు నిద్ర వచ్చుచున్నది. నేను నిద్రపోతె ఎవరికి ఆపద వస్తుందోనన్న భయముతో కనురెప్పలు నరుకుకొనబోవ అశ్వనీదేవతలు ప్రత్యక్షమై, లక్ష్మణానీ నిద్ర, ఆకలి, దేహ పీడ మేము పద్నాలుగేండ్లు పంచుకుంటాము. ఒక్కొక్కరం ఒక్కరుగ అనుభవిస్తాము కాబట్టి నీకు పద్నాలుగేండ్లు నిద్ర, ఆకలి, దేహపీడ వుండవు అని చెప్పిరి.

నిద్ర, ఆకలి, దేహ పీడ లేని వారు, బ్రహ్మచర్యంతో వున్న వారి చేతిలో ఇంద్రజిత్తు చస్తాడు. అందుకని మేమిలా చేశాము అని చెప్పి వెళ్ళిపోయారు తెల్లవారగానే రామలక్ష్మణులు మఱ్ఱిపాలతో జడలుధరించి, సూర్య, చంద్ర, తార సమూహము సాక్షిగా వ్రతదీక్ష తీసుకున్నారు. బ్రహ్మచర్యాది వ్రతదీక్ష పూనిరి. అంత సుమంతునితో రామచంద్రుడిలా చెపుతున్నాడు.

సీ॥ దశరథసూనుండు వనవాసమునకేగె
గంగ దాటి బ్రహ్మచారియగుచు
భరతుని ధర్మము తప్పక
రాజ్యమేలు మనుము
నా మీద ప్రేమచే వచ్చెడి ప్రజల
ధర్మము తప్పక ఏలుమనుము
వనవాస మొనరించి మరలి వచ్చెదనని
నా తల్లి దండ్రుల కనుమ

గీ॥ తల్లి తండ్రికి ప్రేమకు దూరమైన నిర్భా
గ్యుడు రాముడని పినతల్లి కనుము
రథము గొని పొమ్ము సుమంత నీవు
ఋష్యశృంగ వశిష్ఠాదులకు నమస్కారములనుము

వచనం ;– అని సుమంతునకు చెప్పి. రథం తీసుకొని అయోధ్యకు వెళ్ళు, వారిని జాగ్రత్తగా చూచుకో. శ్రీరామా! మిమ్ములను విడచి పోజాలనన్న సుమంతునికి నచ్చచెప్పి అయోధ్యకుతరలించి,

మంజరి : రాతిని నాతిగ చేసిన పాదం
కడిగెదనని గుహుండు
కడిగి పాదములు నావకు తగలక
పడవపైన ఎక్కించె

వచనం :– గంగ దాటిన రాముడు తన వుంగరము తీసి గుహుడా! ఈ వుంగరము గొనుము అన్నాడు రామచంద్రుడు. స్వామీ రామయ్యా! నీ వుంగరము ధరించే శక్తి లేదు సామీ. మీ దయ వుంటే చాలు. నేను నీ ఎంట వత్తాను సామీ నీ పాదాలు సేవించుకొంటాను సామీ. అప్పుడు రాముడిలా అన్నాడు.

గుహుడా! గంగ దాటించేవాడవు నీవే కదా! అని చెప్పి సీతారాములు లక్ష్మణ సహితులై ఘోరారణ్యంలో వెళుతున్నారు.

ఈ విధంగా నడచి. నడచి, జానకీ దేవి నడువ లేక పాదములలో ముండ్లు విరుగుచుండె, దానిని తీసి. లాలించి, నవ్వించి, అనేక పిట్ట కథలు చెప్పి, కందమూలాదులు అరగించుచు. చెట్లక్రింద పడుకొనుచు, సెలయేరులలో స్నానము చేయుచు, మూడు దినములు నడచి. నడచి. కాళింది హరదంబు దాటి భారద్వాజ ఆశ్రమము చేరి, ఆ మహా ఋషుల సావాసముతో విశ్రాంతి తీసుకొని, ఋషుల ఆశీర్వాదముతో అట నుండి మండు ఎండలో పాదములు బొబ్బలెత్తి, దారి తెన్ను లేక గొప్ప అడవులు దాటి. సీతా లక్ష్మణ సహితుడై శ్రీరామచంద్రుడు అఖిల ఋషిమండలము గల చిత్రకూటం ప్రవేశించి. ఋషులకు ఋషిపత్నులకు నమస్కరించి, వారి ఆశీర్వాదము పొందిరి, శ్రీరామ లక్ష్మణులారా! మీరు ఈ చిత్రకూటములో పర్ణశాల కట్టుకొని ఇక్కడే వుండి మమ్ములను ధన్యులుగ చేయండని ప్రార్థించిరి.

క్షణ మాత్రములో ముని బాలకులతో కలసి పర్ణశాల నిర్మించారు. సీతారాములు గృహప్రవేశమయ్యారు. లక్ష్మణుడు కట్టిన సోమదపు చెట్ల ఉయ్యాలలో వూగుతూ వున్నారు సీతారాములు. లక్ష్మణుడు అడవికి పోయి, కొండతేనె ఫలములు, పుష్పాలు అన్నీ తెచ్చి ఇచ్చి, మృగాలు రాకుండా తాను ద్వారం వద్ద కాపలా కాస్తున్నాడు. సీతారాములు పుష్టిగా భోంచేసి, ఆ మాట, ఈ మాట చెప్పుకొంటూ నడచి వచ్చి, ఆయాసం తీరునటుల నిద్రపోయారు. ఈ విధంగా చిత్రకూటంలో వున్నారు సీతారామ లక్ష్మణులు.

ఇది ఇలా వుండగా అయోధ్యలో భరత, శత్రుఘ్నులు వచ్చి తండ్రి అకాల మరణమునకు నెత్తి, నోరు బాదుకొని ఏడ్చారు. తల్లిని గని - కైక వలన ఇలా జరిగినదని యెల్లరు పలుకుచుండ విని, తల్లిని ముక్కలు ముక్కలుగా నరికేస్తానని వెళ్ళాడు. అంత కౌసల్య, సుమిత్ర, మహాఋషులు అడ్డుకొని భరతా! స్త్రీ హత్యాపాతకం కాదా? తల్లిని చంపుట ధర్మం కాదు నాయనా అన్నారు.

అంత కైక భరతా! నిన్ను చక్రవర్తి చేయాలని ఎన్నో ఆశలు పెట్టుకొని వున్నాను. నన్ను చంపుతావా తండ్రీ! ఈ రాజ్యమే కాదు ప్రపంచమంతటికి పట్టాభిషేకం కట్టినా నాకక్కర లేదు. ఒక్కసారి శ్రీరామా! అని పాదాలకు నమస్కారము చేసినంత విలువ లేదు.

నీవు ఇనవంశం నాశనము చేయడానికి పుట్టిన శనివి కాని, రాణివి కావు. రాక్షసీ ఇక మాట్లాడకు అని భరతుడు ఆగ్రహించి, తండ్రికి చేయవలసిన కర్మకాండలన్నీ ముగించాడు.

అయోధ్య వాసులందరూ రామా! సీతారామా! అన్నమాటే కాని మారుపలుకలేదు.

ꕥ ꕥ ꕥ

చిత్రకూటంలో సీతా రాములు అరణ్యావాసమునకు బాధపడుతుంటే సీతా లక్ష్మణా

గీ॥ అలరు వనవాసమే మన రాజ్యలక్ష్మి
కలుగు వెలుగు సూర్యచంద్రులే వెలుగునిచ్చు
బంటులు క్రూరమృగంబులు ఛత్రమే కొండగాలి
పాన్పురాళ్ళు సత్యధర్మములె మనకు రాజధాని
ఇంతకన్న మరేమి వలయు మనకు

వచనం ;- ఇప్పుడు మనకేమి లోటు? అని సీతా లక్ష్మణులకు ధర్మాలు బోధించి సీతారాములు ఫలహారము చేసి నిదురపోయారు.

మధ్యాహ్న సమయములో జయంతి, జయంతులు - అన్నా చెల్లెలు జయంతి సీతారామ దరిశనము చేసుకొని స్వర్గానికి వెళ్ళిపోయింది. జయంతుడు కాకాసురుని రూపములో సీతాదేవి కుడికాలి బొటనవ్రేలు దొండపండని ముక్కున కొరికి సంతోషపడుచుండె.

అప్పుడు రక్తం ప్రవహించుచుండగ అతి సుకుమారి జానకీదేవి నడచిన ఆయాసంలో అతి నిద్రలో వున్నది. శ్రీరామచంద్రుడు లేచి దర్భను మంత్రించి బ్రహ్మాస్త్రము చేసి కాకాసురునిపై విడిచాడు.

బ్రహ్మలోకము, కైలాసము, వైకుంఠము అన్ని లోకాలు వెళ్ళి శరణు వేడిన. రామ బాణం ఆపే శక్తి మాకు లేదన్నారు. మరి నా గతేమిటి అన్నాడు కాకాసురుడు. శ్రీరామచంద్రునే శరణు వేడితే ఆయనే నిన్ను రక్షిస్తాడు.

ఆ విధముగ రాముని శరణువేడాడు. కాకాసురా! క్షత్రియులు ఎక్కుపెట్టిన అస్త్రాన్ని సంహరించక విడువరు. ఈ అస్త్రం శాంతించాలంటే బలి కావాలి. అట్లే అన్నాడు, రఘురామా! నా కుడి కన్ను బలిగా ఇస్తానన్నాడు.

అలానె కాకాసురుడు బలి ఇచ్చాడు. బ్రహ్మాస్త్రం శాంతి వహించింది. అప్పటి నుండి కాకాసురుడు కాకా - కాకా అని తిరుగుతున్నాడు. అంటే నా కన్ను పోయింది అని అర్థం.

మ॥ భరత, శత్రుఘ్నులు దుఃఖభాజనమున విచార
మున నున్న అయోధ్య గాంచి, వెక్కి వెక్కి
ఏడ్చు వారల గని ఏడ్చి ఏడ్చి, తెలిసి తెలిసి
సర్వంబు తెలిసి తల్లి జేరి అనియె నిట్లు

హిందోళ — ఏకతాళం

పల్లవి : తల్లివే నీవు ఘాతకివి కానీ

అనుపల్లవి: కల్లలాడి పతిని జంపిన పాపీ
తండ్రిలేని పిల్లల జేసి
పసుపు కుంకుమలు పోగొట్టుకున్నావు ॥త॥

చరణం : తారుమారు చేసితివి రాజ్యము
తనవారినెల్ల దూరము చేసి
ఘోరమైన నరకము పాలయితివీవు
నిను జంపిన నా పాపము పోవును ॥త॥

వచనం ;- మరల మరల చంపబోవుచున్న భరతుని వారించి, స్త్రీ హత్య మహా పాతకమని కౌసల్యాదులు స్త్రీ హత్య చేస్తావా నాయనా అని బోధించిన, పాపీ! నీ మొఖం చూపించకు. నీవు నా తల్లివీ కావు. నేను నీ కొమరుణ్ణి కాను. శ్రీరామ చంద్రున్ని ఎన్ని కష్టములపాలు చేసితివి.

సీ॥ కఠిన పాషాణము పడతిగా చేసిన
పాదములు బొబ్బలెత్తె
మణికాంతులలోన మసలెడి నా యన్న
కారు చీకటిలో కలగుచుండె
షడ్రసాన్నము లారగించెడి రాముడు
కందమూలంబులు మెక్కనేమొ
గంధర్వ గాన వీణల మ్రోగు కర్ణముల్
మృగముల అర్పులు వీనుల వినెనేమొ

గీ॥ హంసతూలికమగు బంగారు తూగుటుయ్యాలలూప
నిదుర రాని అన్నయు ఒదిన చిన్నన్న
తోడ అడవిలోన తపమాచరింప
నేను రాజగుదునె మహాత్ములారా

వచనం :- నే పుట్టకున్న రామునకు యీ పాట్లు రావు కదా!

సీ॥ క్షణమైన నినుబాసి నిలువజాలని
తండ్రిని మెప్పించి చంపె తల్లి
సవతిమత్సరమున శ్రీరామచంద్రుని
అడవి పాల్జేసె తల్లి
అన్నదమ్ములకు ఇల్లు నడిపి
వెతల పాలు చేసె తల్లి
అతి సుకుమారి మా వదిన జానకీదేవి
కష్టములపాలు జేసె తల్లి

గీ॥ ఏమని వచింపగలను ఈ ఘోర అపవాదు
పొలయితి నకటా రామచంద్రుని గొనివచ్చి
రాజ్యమునకు పట్టము గట్టు వరకు
భరతుడు బ్రతుకలేడు లెండు ప్రజలారా రామచంద్రు దరికి

వచనం ;- అనిన భరతుని భక్తికి మెచ్చి, అందరూ కలసి రామభక్తులై కదలి పోయిరి. నేల ఈనినట్లు గుంపులు గుంపులుగ వెళుతున్నాడు భరతుడు ప్రజలతొ.

అప్పుడు అయోధ్య పరిస్థితి ఇలా వున్నది. చెవిటి వాని వద్ద శంఖ మూదినట్లు, గ్రుడ్డి వానికి అద్దము చూపిన యట్లు, వృద్ధుని వివాహ మాడినట్లు, మూర్ఖునకు ఉపదేశమిచ్చినట్లు. ఈ పాడు కొంప అయోధ్య మాకేల రండు రండ నుచు గుంపులు గుంపులుగా గంగ చేరబోవ గుహుడు చూచి భరతుడు ఎంత దుర్మార్గుడు? చక్రవర్తి నయ్యానని, ప్రజలంతా తన వారని, వెంట పెట్టుకొని శ్రీరామ చంద్రునిపై పగతో వెళుతున్నాడు భరతుడని, తన బంధువు లందరిని రావించి కొమ్ములూది సమరమునకు సిద్ధమై వుండిరి.

భరతా! నా రాముని మీద పగ పట్టావు గనుక, మిమ్మల్నందరినీ గంగలో ముంచేస్తానని నిలబడ్డాడు. వాళ్ళను చూచి భరతుడు

బిలహరి — రూపకం

పల్లవి : రామ దాసుడను కానీ గుహుడా
రామ విరోధిని కానూ

అనుపల్లవి: చపలమున నా తల్లి కోరిక కానీ
నేనే పాప మెఱుగను గుహుడా ॥రా॥

చరణం : అన్నను గొనివచ్చి పంపన్నుగ రాజ్యమేలించెద
రాకయున్న నే రాజ్యమొల్లను
నా మాట నమ్ముము నా తండ్రి యాన ॥రా॥

వచనం :- అది విని, భరతుడు మంచివాడని తెలిసి భరతునకెదురేగి నమస్క రించి నా తప్పులు మన్నింపుమని యెల్లర గట్టు చేర్చగా, భరత, శత్రుఘ్నులు మఱ్ఱి పాలతో జడలు ధరించి రఘురాముడు రాజ్యమేలు వరకు బ్రహ్మచారులుగ వుందు మని రాముడేగిన వనంబున బోవుచు వస్త్రాభరణములు జానపదులకు వొసంగుచు,

శ్రీరాముని జాడ జానాపద ఋషుల నడుగుచు కాళింది హరదంబు దాటి భార ద్వాజ ఆశ్రమము దాటి పాంధుల నడుగుచున్నంత అయ్యా! ఒక పూట మా పల్లె లో వుండుడని ప్రార్థించినా మేము గ్రామాలలో ప్రవేశించమని చెప్పి వెళ్ళిపోయారు. చెక్కలతో మేము సీతారాముల విగ్రహాలు చేసుకొని పూజించుకుంటున్నాము.

సీతారాములు అడుగువేసిన బండల ఇరుకులు, ఇసుకలో అడుగు పడిన రామ పాదములు జలజాంకుశాది రేఖలు చూచి ఇది రాముని పాదమేనని గుర్తించి ఈ అరణ్యములోనే ఇక్కడే ఉంటారని తెలిసి ఆ వైపునకు అందరూ నేల ఈనినట్లు జనసమూహమంతా వెళుతున్నారు.

చిత్రకూటంలో శ్రీరామచంద్ర మూర్తి కూర్చొని, కుడి మీసం ఎడమ చేతితో దువ్వుతూ వున్నాడు. సీతాదేవి పాదాల వద్ద కూర్చొని వున్నది. లక్ష్మణుడు ధనుర్ధరుడై నిలబడి వున్నాడు.

మంజరి ; అన్నా సైన్యము వచ్చె చూడుమా
త్రుటిలో వధింతువానీ
కన్నుగానక వచ్చె దురాత్ముడు
ఇక నిలువ నేర్చునా చూడు

వచనం – లక్ష్మణా! ఆగుము. తొందరపడకు వచ్చిన రానిమ్ము. అదే, అయోధ్య వాసుల వలె కనబడుచున్నారు. భరతుడే ఈ సైన్యమును పంపి వుండవచ్చు. లక్ష్మణా తొందర పనికిరాదు.

ఉ॥ అన్నా మము కావుము. దిక్కులేని దీనులమయ్యా
మా ఆక్రందన నూలింపుము. మనల విడిచి,
మన తండ్రి సత్యనిరతుడు మాట తప్పలేక
అకటా క్రన్నన దివికి జనెన్ అపన్నులమము కాపాడగదే

వచనం ;– అని పాదముల వ్రాలి వెక్కి వెక్కి ఏడ్చు తమ్ముల, ప్రజల, తల్లుల యెల్లరగని తండ్రి మనల విడిచి పోయెనని గొల్లున ఒక్కసారి ఏడ్వసాగె. మునులు, మునిపత్నులు ఎల్లవారు ఓదార్చుచుండిరి. నే పుట్టకున్న నా తండ్రికి ఇట్టి పాట్లు వచ్చునా అని వెక్కి వెక్కి ఏడ్చుచున్నాడు. దుర్భర శోక దావాగ్నికీల దంధవ్య మానసులై, ఇది ఏమి? తండ్రీ అనిన పలుకలేక యీ కన్న తండ్రిని విడిచివచ్చిన కఠినాత్ముడను.

శ్రీరామచంద్రుడు తనవారినెల్లర చూచి నా వలన, రఘువంశమునకే పాట్లు వచ్చినదని, తండ్రి ప్రేమకు నోచని నిర్భాగ్యుడనని అంత్యక్రియలకైనా అర్హుడను కానివాడనైతినని ఏడ్చే రామునకు వశిష్ఠ కౌసల్యాదులు ఓదార్చి. అప్పుడు వశిష్ఠులవారు ఇలా చెపుతున్నారు. భరతునకు నన్నంట అర్హత లేదని చెప్పిన తండ్రికి శత్రుఘ్నుని చేత దహనక్రియలు చేసితిమి. ఆ మాటలు విని అందరు చెప్పిన మాటలు విని, సెలయేరులో సీతారామలక్ష్మణులు పితృ తర్పణము చేసిరి అప్పుడు రాముడు, మీరందరూ వనవాసమునకు వచ్చితిరా బ్రహ్మచర్యమేల పూనితిరి. భరత శత్రుఘ్నులను కౌగిలిలో చేర్చుకొని, భరతా నామాట విని తల్లి కోరినట్లు రాజ్యపరిపాలనము సేయుము నాయనా-తల్లిదండ్రుల కోరిక తీర్చడమే మన ధర్మం అని చెప్పిన అన్న పాదములు భరతుడు కన్నీట కడుగుచు అన్నా ప్రాణమలైనా విడుతును గానీ రాజ్యమును మాత్రం ఏలజాల.

ఎంతకూ వినకున్న కైక రాముని జేరి నాయనా రామచంద్రా నా వలన ఇనవంశమునకే మశ్చ కలిగినది. అన్నదమ్ములకు మీకీ పాట్లు వచ్చె. ఆడినమాట తప్పని సత్యవ్రతదీక్షుడు మీ తండ్రి నావలన ప్రాణములు విడచె. దురాశ వలన పసుపు కుంకుమలు పోగొట్టుకున్న నీచురాలిని. నాపై అనుగ్రహించక నీ రాజ్యము నీవేలుకో రామచంద్రా అని కంటికి కడివెడుగ ఏడ్చే కైకను చూచి అమ్మా నా విధి గాని, నీవు చేసింది ఏమీ లేదు, నీ కారణమున ఎందరో భక్తులు నన్ను దర్శించుకుంటారు. నావలన నీచరాక్షసుల బాధ ప్రపంచానికి లేకుండా చేశావు.

ఈ పదునాలుగు వత్సరములలో దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసి మరలి వచ్చి అయోధ్య చేరుకుంటాను. తల్లులు, ప్రజలు, తమ్ములతో చెప్పి భరతా నీ భక్తి అపారమైనది. నీ భక్తికి మెచ్చాను నాయనా. ముగ్గురు తమ్ములు మూడు లోకాలు. నీవెళ్ళి రాజ్యమేలుకో అన్నాడు రాముడు.

అన్నయ్యా, ఆడి తప్పుట మన కులములో లేదు గనుక మీరు మరలి వచ్చుట దుర్భరము, దుస్సహం కనుక నా కోరిక మన్నించి, భవత్ పాదుకలు నాకర్పించినట్లయితే, మీకు మారుగా పాదుకా పట్టాభిషేకం చేసి మీరు వచ్చునంతవరకు బ్రహ్మచారులుగానే బ్రహ్మచర్యవ్రతదీక్షతో రాజ్యము మీ పేరు మీద పాలన జేస్తుంటాము. పదనాలుగు వత్సరములలో, ఒక్క క్షణము అటు, ఇటూ అయిన అగ్నిలో బడి ప్రాణాలు విడుస్తామని చెప్పారు. భరతా! నిన్ను

పొగడ తరముకాదు. పాదుకలు సంతోషముగా ఇస్తాను. అట్లె చేయుము అని పాదుకలు ఇచ్చాడు. ఆ పాదుకలు తీసుకొని కళ్ళకద్దుకొని ఘొల్లున ఏడ్చాడు. మాత కైక రాజ్యము లేకుండ చేసింది. నేను పాదాలకు ముళ్ళు గుచ్చుకునేలాగ కాళ్ళకు పాదరక్షలు కూడా లేకుండా చేశాను. ఈ పాపం ఎన్ని జన్మలకు తీరు తుంది రామచంద్రా అని అందరూ ఆ రామునకు నమస్కరించారు. అందరూ శ్రీరామ పాదుకులకు జై - శ్రీరామ పాదుకులకు జై అని అందరూ వెనకకు మరలిరి నంది గ్రామము భరత శత్రుఘ్నులు చేరి వైభవముగా పాదుకా పట్టాభిషేకం చేసి ధన్యులైరి. నంది గ్రామమునకు పాదుకలు సిరమున నిడుకొని భరతాదులు మరలినంత, సీతాలక్ష్మణ హితుడై శ్రీరామచంద్రుడు చిత్రకూటము విడిచి అత్రి అనుసూయ ఆశ్రమము చేరుకొనిరి.

భరతుడు ఎంత మంచి వాడు! ఆ పాదుకలకు పట్టాభిషేకం చేసి బ్రహ్మచర్యము చేసిరని ప్రజలు వేనోళ్ళ వినుతించిరి.

తృతీయాధ్యాయం శ్రీరామ పాదుకా పట్టాభిషేకం సంపూర్ణం.

మోహన — ఆది

రామపాదుకలకు నిత్యమంగళం
మంగళం - నిత్యమంగళం
మంగళం - నిత్యమంగళం

గీ॥ అని పలికి ఈ విధమున కైలాస విభుడు
శ్రీరామ పాదుకా పట్టాభిషేక కథ ముప్వురు
తమ్ముల యశము భువి దివికి పొంగిపొరల
మనకు వినిపించె ధన్యుడయ్యె మనల ధన్యుల జేసెన్

వచనం :- ఈ విధముగా పాదుకా పట్టాభిషేకం పూర్తి చేసి అనుష్టానము తీర్చుకొని అయ్యా పాదుకా పట్టాభిషేకం సంపూర్ణమయ్యె. రామ సుగ్రీవ మైత్రి చెప్పెద నాలింపుడని పరమేశ్వరుడు రామ సుగ్రీవ మైత్రి ఈ విధముగ చెప్ప దొడగె.





శ్రీ రామ జయం

# శ్రీ అమృత రామాయణము

## చతుర్థ అధ్యాయము

## శ్రీరామ సుగ్రీవ మైత్రి



శ్లో॥ సర్వేశ్వరీ ప్రియసుతం సర్వ విఘ్న నివారకం
అఖిల దేవతా పూజనీయం గణేశం నమామి

సరస్వతి ప్రార్థన

అనంత కోటి దేవ మానవ వేద స్వరూపం
అఖిల మంత్ర, తంత్ర, జప, హెూమార్థ్వం సరస్వతిమ్

శ్లో॥ రామ రామ రామాయణ కథనం
సమస్త లోక సన్నుతం రామం భజే శ్యామలం

మోహన — ఆది

పల్లవి : రామ సుగ్రీవ మైత్రి చరిత్రము
రమ్యకథా అమృతము గ్రోలుడు ॥రా॥

చరణం : సతినెడబాసి అడలిన రాముని
ఆదరించిరి వానరులెల్లరు
చపల చిత్తుల యైనట్టి కోతుల
సాయంబున లంకను జయించిన యట్టి ॥రామ॥

వచనం :— సీతారాములను అత్రి, అనసూయలు పూజించి పునః పూజలంది అంత, అనసూయా సతి

## ముంతాజ్ రాగం — రూపకం

పల్లవి : అనసూయ తిలకంబు శ్వేత వస్త్రమొసంగె
అత్రి అనసూయల - ఆశీస్సులందుకొనె

అనుపల్లవి: రఘుకుల తిలకుడు - శ్రీరామచంద్రుడు
అవనిజా - నీ పూర్వపుణ్యమున అబ్బెనె ॥అ॥

చరణం : ఈ తిలకంబున పరుడు - అంట వెఱచు
కలికి ఈ చీర కట్టినంత - ఆకలి నిద్ర నశించు
అన విని అత్రి, అనసూయ వలన
పతివ్రత ధర్మము లెఱిగి
కదలి సీతాలక్ష్మణులంతా
దండకారణ్యము జేరి

వచనం ;- అమ్మా! సీతా, ఈ తిలకము ధరిస్తే పరుడు నిన్ను అంటబోడు. ఈ తెల్ల చీర ధరిస్తే ఆకలి నిద్దుర నశించిపోతుంది. నీ పూర్వ పుణ్య వశం చేత రాముడు నీకు భర్త అయ్యాడు. నీకు చిన్నతనం - కొన్ని పతివ్రత ధర్మాలు చెపుతాను విను.

సీ॥ వనితా వినవమ్మ - ఇలసతీ ధర్మంబు
పతి సేవ కన్న లోకమున వేరొక పూజ లేదు
వేకువన లేచి - స్నానమాడి పసుపు కుంకుమ లంది
పూల పూజించి షడ్డ స్నానములు మొక్కజేసి
నగలు నాణ్యములు పట్టు వస్త్రంబులు
అమితమైన కోర్కెల అడుగరాదు
కష్టసుఖంబుల పతికి హితవు లొనగూర్చి
ఇంటి గుట్టు రచ్చకీడ్వరాదు

గీ॥ కలిగిన లేకున్న కలత బడక
అత్తమామల బావమరందుల ఆదరించి
పతికి మారాడక మసలుకొన్న సతికి
సకల లోకంబు లెల్ల స్వాధీనమగును తల్లీ

శా॥ మూడు విధములు గల పతివ్రతలు గలరు
ప్రథమ పతివ్రత పతి దక్క లోకముల గల
పురుషుల నెల్ల స్త్రీలవలె భావించు - రెండవ
పతివ్రత - పరుల అన్న, తండ్రి అని పిలచు - మూడవ
పతివ్రత పరపురుషునిపై ప్రేమ గలిగిన మరల దిద్దుకొనుచునుండు

కల్యాణి — రూపకం

పల్లవి : పడతిరో సద్ధర్మ నిరతులౌ నా సతులు

అనుపల్లవి: కష్టముల కెరువక పాలించిరి ధర్మంబు

చరణం : వనవాసంబని యెంచక వనితరో కష్టముల కోర్చి
అఖిలలోక మాతవంచు విఖ్యాతి నొందుమమ్మ ॥ప॥

వచనం ;— ఈ విధంబున పతివ్రత ధర్మాలు బోధించిన అత్రి, అనసూయలకు నమస్కరించి, దండకారణ్య ప్రాంతమున ఘోరారణ్యములో పోవుచున్నారు.

మంజరి: రామలక్ష్మణులు ధనుర్ధరులై దండకారణ్యంబున జనుచుండ
విరాధుడను రాక్షసుండు నరవాసన యనినంత

వచనం — విరాధుడను రాక్షసుడు శూలము భుజాన వేసుకొని, ఆ శూలమునకు అటూ నిటూ ఏనుగులను గ్రుచ్చుకొని, పుట్టెల హారములతో మురళి మ్రుక్కున వూదుచు, పర్వతాల బంతులవలె నాడించుచు, సీతారాములను చూచి, అబ్బురపడి ఆ రాకాసి వికటాట్టహాసం చేయుచు ముగ్గురిని ఒకేసారి నమిలి మ్రింగేస్తానని ఒకే సారి పట్టుకోబోతున్నాడు. అంత జానకీదేవిని చూచి ఓరీ నరులారా! మీముగ్గురిని మింగేసేవాణ్ణి కానీ, ఆ ఇంతి సోయగమునకు ముగ్ధుడనై దయతలచి విడిచితిని. ఆమెను నా కప్పగించి, మీ రెక్కడయినా బ్రతుక పొండు అని సీతను పట్టుకొన బోతున్నాడు

అన్నయ్యా! ఆ దురాత్ముని వధించడానికి అజ్ఞ ఇవ్వండి అన్నారు లక్ష్మణుడు. వెంటనే దివ్యాస్త్రముతో వాని చేయి నరికివేశాడు లక్ష్మణుడు. నీవు సామాన్యుడవు కాదురా అని రెండవ చేయి రాముడు నరికేశాడు. రామ బాణం తగలగానే రాక్షసరూపం పోయి తుంబురుడనే గంధర్వుడు నిలిచాడు రామచంద్రా! మీ వలన నా శాపం తీరిందని రాముని ఇలా ప్రార్థించుచున్నాడు.

## కాఫీరాగం — ఖండగతి

పల్లవి : దశరథ కుమారా దనుజ సంహారా
నరరూపధారి నారసింహా ॥ద॥

అనుపల్లవి: కనురెప్పపాటున కలుషములు దునుమాడి
కాచినాడవు తండ్రి కలకాలమూ నన్ను ॥ద॥

చరణం : అవనిలో జనియించి అవనిజాపతివై
ధర భక్తులను కావ ధరియించితస్త్రములు ॥ద॥

వచనం ;- అని ఈ విధముగ వినుతించి నిలచిన తుంబురుని చూచి

కం॥ కటిక రాక్షసుడవై చెలగితివేల
తెలియబల్కుమయ్య మౌనివర్యా

వచనం :- ఒకానొక సమయంలో ఇంద్ర లోకంలో నేను గానం చేస్తున్నాను. నారదాది విద్వాంసుల నందరిని ఓడించేశాను. ఆ సమయంలో అందరూ తలలూపుతుంటే, కుబేరుడు తలయూచలేదన్న కోపముతో అడిగితిని మహాగర్వివై తివిగాన రాక్షసుడవై పొమ్మని శాపమిచ్చెను. శాప విమోచనం చెప్పుమని వేడితిని రామ బాణం తగిలిన శాపం తీరుననియె. మీ వలన శాపం తీరినది. నీకు శుభం కలుగుగాక యని తుంబురుడు చనియె.

అంత, కొండ గుహల్లో పడుకొని, సెలయేళ్ళలో స్నానం చేస్తూ, సీతాదేవి నడువలేక బాధ పడుతుంటే శ్రీరామచంద్రుడు ఆమె నెత్తుకొని పిల్లకాలువలు దాటించుచు ధనుష్టంకారములు చేయుచూ మృగములు తరుముకొనుచు పదునైదు దినములలో పంచవటి చేరుకున్నారు.

మంజరి శరభంగుడను ముని అగ్నియందు తన దేహం ఆహుతి వేయదలచి
అగ్నిలో దూకు సమయంబున రామలక్ష్మణుల జూచి

వచనం ;- సీతారామ లక్ష్మణుల జూచి శరభంగుడు నమస్కరించి, పూజించి, శ్రీరామ చంద్రా! నీ దయ వలన ధన్యుడనైతిని. వాల్మీకి మహాఋషి ఆశ్రమములో ఇదే ఘడియలో శ్రీరామచంద్రుడు ఇక్కడికి వస్తాడని తెలిసి అదే సమయములో అగ్నికి ఆహుతి కావాలనుకున్నాను. మీరు రాలేదు. అదే సమయంలో మీరు వచ్చారు. మీ దర్శన భాగ్యం కలిగింది అనిన శరభంగుని సీతారాములు

దీవించి మోక్షం ప్రసాదించిరి.

శరభంగా! భక్తాగ్రగణ్యా! మమ్ముల దర్శించి కృతార్థుడ వైతివి అని దీవించారు. ముమ్మారు శరభంగుడు ప్రదక్షిణ చేసి, అగ్ని బడియె. సీతారామ లక్ష్మణులు కొంతవరకు విచారించి, ఋషులకు నమస్కరించుచు పోవు చుండిరి. సుతీక్ష్ణుడు శరభంగుని జన్మవృత్తాంతము సీతారాములకు చెప్పదొడగెను.

సింహళ రాజ్యమేలు మహారాజు సత్యం, ధర్మం, నీతి దప్పక రాజ్య పాలన చేస్తున్నాడు. ఇట్లు రాజ్యంబేలుతరి ప్రజలు సుఖసంతోషములతో నుండిరి.

కాశ్మీర దేశమును పరిపాలించుచున్న కనకవర్మ అనే మహారాజుకు మదవతి అనే మహారాణి పతిసేవాపరురాలై మెలగుచుండె గానీ, సంతానములేక ఆ రాజ దంపతులు విచారపడుచు, వారి కుల దైవమైన "శార్వాణి"ని దీక్షతో పూజింపదొడగిరి. కొంత కాలమునకు వారి పూజ ఫలించి, సరస్వతీదేవి ప్రత్యక్షమై కనకవర్మా! మీ పూజాఫలము వలన మీకు ఒక పుత్రిక జన్మిస్తుంది. ఆ పుత్రికతో బాటు ఒక శరము కూడా జన్మిస్తుంది. ఆ శరాన్ని భంగించిన వానికి నీ కుమార్తె నిచ్చి వివాహం చేయి అని చెప్పి అంతర్ధానమయ్యెను. ఆ దంపతులకు ఒక శుభ దినమున బాలిక జన్మించెను. ఆ బాలికకు "శార్వాణి" అని నామకరణం చేసిరి. ఆ బాలికను అల్లారుముద్దుగా పెంచుచుండిరి. యుక్త వయస్సు రాగానే ఆమె స్వయం వరమునకు ఏర్పాటు చేసిరి. ఆమెతోబాటు ఆ శరము కూడా పెరిగి పెద్దదయ్యెను ఆ శరము విరచిన వానికి ఆ కన్యనిచ్చి వివాహము చేయుదునని ప్రకటించిరి. ఆ స్వయంవరమునకు సింహళ రాజకుమారుడు ననిధ్వనుడు లేచి శరభంగము చేసెను అంత దేవతలంతా సంతసించి సుమవృష్టి కురిపించి శరభంగుడని నామకరణము చేసిరి. అంత పూలమాల అలంకరించెను అంత కనకవర్మ, మదవతి దంపతులు దేవతల చేత నామకరణం చేయబడిన శరభంగునికి శార్వాణి నిచ్చి మహా వైభవ ముగా వివాహము చేసిరి. కొడుకు కోడలిని చూచుకొని సుమతీదేవి సింహళ మహా రాజు సంతోషముగ కుమారునికి రాజ్య పట్టాభిషేకం చేసెను.

శార్వాణి సహితుడై శరభంగుడు సత్య ధర్మములు తప్పక, సుఖ సౌఖ్యములతో రాజ్య పరిపాలన చేయుచున్న సమయమున వారికి ఒక కుమారుడు జన్మించెను. అతనికి సకల విద్యలు నేర్పించి యుక్త వయసు రాగానే రాజ్యపట్టాభి షేకము చేసి, ఆ రాజ దంపతులు తపోవనమునకు వెళ్ళిపోయిరి అని సుతీక్ష్ణుడు ఆ శరభంగుని చరిత్ర సీతారామలక్ష్మణులకు చెప్పెను.

రామభద్రా! మీ దర్శనభాగ్యమున ధన్యులమైతిమి. అదే అగస్త్య మహా ఋషి ఆశ్రమము. స్వాదు ఫలహార మొనర్చి విశ్రాంతి తీసుకొని పోదము రండు మునీంద్రా! అగస్త్య మహాఋషి అనిన ఎవరు? గొప్ప తపో సంపన్నులు వారి చరిత్ర చెబుతాను వినండి.

గీ॥ దేవ దానవ సంగ్రామసీమలోన వచ్చి
సముద్రమందు దాగిన దేవతలు అగస్త్యుని
వేడుకొనిన రాక్షసుల జూపుమని
ఔపోసనగా సముద్రము ద్రావె గ్రుటుక్కున

సీ॥ ఒకనాడు స్నానార్థమై వచ్చు
అగస్త్యుని గని ఇల్వలుండు
ఆతిథ్యమునకు రమ్మని పిలచి
వాతాపిని మేషంబు జేసి
వాని ఖండించి మాంసాదుల పక్వంబు
గాగ వండి వడ్డించినంత సంతోషమున
ఆ సమ్యమీంద్రుడు భుజించి అన్న పిలువబోవ
జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణమనియె.

గీ॥ జీర్ణించిపోయె తమ్ముడని
నిజరూపము దాల్చిన
ఇల్వలుని గురువరుండు
భస్మంబు జేసె

వచనం ;- శరభంగుడు అగ్నికి ఆహుతి చేసిన తర్వాత ఆయన జన్మవృత్తాంత సీతారాములతో చెప్పి సీతాలక్ష్మణ సహితుడై మహర్షుల ఆశీర్వాదము తీసుకొని వెళుతున్నాడు. ఆ సమయంలో అగస్త్యులవారి శిష్యుడు రండి మా ఆశ్రమమునకు అని తీసుకొని వెళ్ళి. వారి ఆశ్రమములో పండ్లు, పాలు ఆరగించిన తరువాత, మహాత్మా! మా గురుదేవు లయిన అగస్త్యుల వారి ఆశ్రమము ఇక్కడే వుంది. వెళ దాము రండి. ఆ మహాత్ముడు సామాన్యుడు కాడు. సముద్రాన్ని గుటుక్కున త్రాగాడు వాతాపిని జీర్ణం చేశాడు అన్నాడు సుతీక్ష్ణుడు. ఓహెూ, వాతాపిని జీర్ణం చేశాడు అంటే ఏమిటా కథ? అన్నాడు.

స్వామీ! ఒకప్పుడు దేవతలు రాక్షసులు యుద్ధం చేసే సమయంలో

మాయా యుద్ధం చేసే రాక్షసులు దేవతలపై దాడి చేసి, వాళ్ళ వెళ్ళి సముద్రంలో దాక్కుంటున్నారు. రాక్షసులను చంపడానికి వారి వలన కావడం లేదు. అప్పుడు నారాయణమూర్తితో మొర పెట్టుకున్నారు రాక్షసులు మమ్మల్నిలా బాధ పెడుతున్నారని. అప్పుడు నారాయణ మూర్తి ఓ దేవతలారా! దండకారణ్యంలో అగస్త్యులవారు వున్నారు. అక్కడికి వెళ్ళి మొరపెట్టుకోండి అని చెప్పాడు. అంత అగస్త్యుల వారితో దేవత లంతా ఇలా మొర పెట్టుకున్నారు. సరేనని అగస్త్యుల వారు సముద్రం నీరునంతా ఔపోసన వేశారు కేశవాయ స్వాహా, నారాయణాయ స్వాహా మాధవాయ స్వాహా అని మూడుమార్లు. అప్పుడు రాక్షసులు బయటబడ్డారు. వారిని దేవతలు చంపేశారు. ఆ తరువాత సముద్ర జలాన్ని మామూలుగా వదిలేశారు అగస్త్యులవారు. అంతటి ఘనులు మా అగస్త్యులవారు. అహో! అంతటి మహానుభావులా! అదే కాదు, వాతాపి, ఇల్వలుడు అనే రాక్షసులు ఇద్దరు అన్నదమ్ములు వాళ్ళ మాయ ఆశ్రమము నిర్మించుకొని వచ్చి పోయే వారిని పిలచి భోజనాదులను పెట్టి సత్కరిస్తుండేవారు. అదెట్లనిన తన తమ్ముణ్ణి ఒక మేకగా తయారుజేసి దాన్ని చంపి, ఆ మాంసమును వంట చేసి, వారికి వడ్డించేవారు. అతిథులు తృప్తిగా భోజనము చేసిన తరువాత వాతాపీ! అని పిలిచేవాడు. వాతాపి భోజనం చేసిన వారి పొట్ట చీల్చుకొని వచ్చేవాడు. ఆ చచ్చిపోయినవారిని ఆ రాక్షసులు తినేవారు ఈ విధంగా వారి శల్యాలన్నీ పర్వతాలుగా గుట్టలు గుట్టలుగా వేశారు. ఒకరోజు అగస్త్యులవారు వస్తే వారికి అలానె తమ్ముణ్ణి మేకగా చేసి చంపి వండి వడ్డించాడు. ఆయన భోంచేసి కూర్చున్నాడు. వాతాపీ! అని ఇల్వలుడు పిలువబోయాడు. అంతలో అగస్త్యులవారు జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం అని అన్నాడు. అలానె పొట్టలో జీర్ణించుకపోయాడు. అప్పుడు ఆ రాక్షసుడు ఇల్వలుడు నిజరూపం దాల్చాడు. అప్పుడు ఆయన కమండల జలం చల్లాడు. భగ్గున మండి భస్మమై పోయాడు. అలాంటి మహానుభావుడు మా అగస్త్యులవారు అని వివరించాడు సుతీక్ష్ణుడు.

ఈ వార్త విని, లోపాముద్ర, అగస్త్య మహాఋషి సీతారాములకు నమస్కరించి వారి ఆశ్రమమునకు గొనిపోయిరి.

భైరవి — ఆదితాళం

| | |
|---|---|
| పల్లవి : | పాహి పాహి జానకీరమణా |
| అనుపల్లవి: | పాహి పాహి విశ్వంభరా ఇనకులాభరణా ॥పాహి॥ |
| చరణం : | సకల వేదసారా నిఖిల ముక్తికార |
| | నిత్య కల్యాణ వినుత సత్యవ్రతదీక్ష ॥పా॥ |

వచనం ;- సీతారాములను పూజించి, పునఃపూజితులై ఆతిథ్యమిడి మార్గాయాస మున అలసిపోయి గాఢనిద్రాపరవశులైరి. అంత తెల్లవారినంత శ్రీరామచంద్రుని అగస్త్య మహాఋషి ఇట్లు స్తోత్రింప దొడగె.

శ్లో॥ కౌసల్యా మహాసాధ్వీం కౌసల్యాం పుణ్యగర్భే జన్మనే శ్రీ రఘునాథే
ప్రాతఃకాలే భానుబింబ ధర్మనే నిత్యకృత్యాం కార్యకర్మనే వైకుంఠ
నివాసినే శేషాది శయనే సుప్రభాతే గోవిందాం గరుడధ్వజాం
శ్రీ మహాలక్ష్మీపతిం నారాయణాం నరశార్దూలం త్రిలోక దేవతానీకం
రక్షణార్థం హరిం

తాత్పర్యం : కౌసల్య, మహాసాధ్వియగు కౌసల్యాదేవి యొక్క పుణ్యగర్భమందు జన్మించిన శ్రీరామా! తెల్లవారుచున్నది. దేవతా పూజాది నిత్యకృత్యములను నెర వేర్ప వలయు. ఓ పరంధామా! మేల్కొనుము. గోవిందా! ఓ గరుడధ్వజా! శ్రీ మహాలక్ష్మి భర్త అయిన శ్రీమన్నారాయణా! లెమ్ము. నిద్ర మేల్కొనుము. మూడు లోకాలకు శుభమొనగూర్పుము.

శ్లో॥ మాతాం సమస్తలోక రక్షణీం సర్వదాం శ్రీ మహావిష్ణుం
వక్షస్థల నివాసినీం మనోహర సుందరాకారం ఆశ్రిత
భక్తజన హస్తాం జగద్రక్షకాం రామచంద్రం హరిం
లక్ష్మీం దేవీం జగదీశ్వరీం శుభకరం హరిం

తాత్పర్యం : మాతా! సమస్త లోకములను కన్న తల్లివి. ఎల్లప్పుడు శ్రీ మహా విష్ణువు యొక్క వక్షస్థలమున వుండు దానవు, మనోహర సుందరాకారము గల దానవు. ఆశ్రయించిన భక్తసమూహముల కోర్కెల ఈడేర్చుదానవు. జగద్రక్షకు డగు రాముని హృదయేశ్వరియగు శ్రీ లక్ష్మీదేవీ! జగధీశ్వరీ! సీతా! మాకు శుభ ముల నొనగూర్పుము.

## శంకరాభరణం — ఏకతాళం

పల్లవి : రామా నీ చరణ దాసులకు ఏమి భయము ॥రా॥

అనుపల్లవి: సగుణ, నిర్గుణాకరుడవు సజ్జన రక్షకుడవీవు
నీవు జగము వేరు కాదు
స్వర్ణమునకు ఛాయవలెను ॥రా॥

శా॥ చతురంబోధి పరీత భూవలయ సామ్రాజ్యాది రాజరాజసింహాసనాలంకార
కౌస్తుభ మణిహార ధీర శివ ధనుర్భంగ సీతాపహరణ
తేజోవికాస సృష్టి స్థితి లయ కారణ కారణాకార
కోటి సూర్య ప్రకాశ శ్రీరామచంద్రా!

వచనం ;- సీతా లక్ష్మణుల గూడి ఈ పంచవటి యందు ఆశ్రమము నిర్మించు కొని నివసించుట శ్రేయస్కరమని అనిన అగస్త్య మహాఋషి అర్ఘ్యపాద్యాది విధుల పూజించెను. మేమిందే ఋషుల సావాసమున నివసించదలచితిమి. అంతకన్న మహా భాగ్యమేమున్నది రఘురామా! లక్ష్మణా! చక్కని పర్ణశాల నిర్మింపుము. అని ఆజ్ఞ అయిన తరువాత.

మంజరి: సరసిజాక్షుడు చెప్పినట్లుగ సత్వరముగ దానేగి
ఫలపుష్పములతో గూడియున్న కొమ్మల లక్ష్మణుండు గొనితెచ్చి

వచనం :- కన్నుల పండువుగా కాచి పూచినట్లు, దొంగల. పాముల. పిడుగుల వలన భయము లేని విధముగ మూడు దినములలో స్వర్గంలాగ గోదావరి ఒడ్డున పర్ణశాల వేశారు. హాయిగా అన్నయ్య, ఒదిన నివసించుటకు సోమదపు చెట్ల నుయ్యాల వేసి ఋషుల సావాసముతో హాయిగా సుఖముగా వున్నారు.

ఉ॥ అంత గౌతమీ ప్రాంతము నందు జానకీ సఖీ ప్రేమను
పచ్చికన్ గనుచు పాలన చేయుచు పిల్లవాయువుల్
గల లతావితానమందున కమ్మని తావి గ్రోలుచున్
భూసుతా రాముడిట్లు విహరింప దొడంగిరి ఎల్లవేళలన్

వచనం ;- సీతారాములిట్లు విహరించుచుండిరి.

మంజరి: దశకంఠు చెలియలు చుప్పనాతి జంబూ కుమారుని చూచి
మరణమొందినా సుతుని గాంచి మునులే కారణమని యెంచి
వారి పైకి పోవ భయపడి

వచనం ;- అమ్మా! అమ్మా! మేము కాదు తల్లీ! మీ కుమారుణ్ణి చంపినది. గోదావరి ఒడ్డున నున్న రామలక్ష్మణులలో లక్ష్మణుడు చంపాడు. అనగానే ఆ రాకాసి పరివిడి పోయి పచ్చిక బయళ్ళ నున్న శ్రీరామచంద్రుని చూచి—

మ॥ ఒడ్డు పొడవున శ్యామల వర్ణమునను
ముజ్జగముల మోహించు విశాల వక్షు విశాల నేత్రు
మోకాళ్ళు దాటిన ముంజేతులు సుందరుల
మోహింప జేయునట్టి సుందరాకారు గవయని నా జన్మ దేల

వచనం :- అంత ఆ శూర్పణక తన కుమారుని జంపిన విషయము చెప్పుడనిన ఇట్లు మహాఋషులు చెప్పదొడగిరి. నీ జంబూ కుమారుడు పొదలో చేరి తపస్స మాధిలో వుండగా సూర్యభగవానుడు తపస్సుకు మెచ్చి ఒకఖడ్గాన్ని పంపించాడు. నాకు ఆ ఖడ్గము వలదని నీ కుమారుడు నిరాకరించాడు. అది ఆకాశానికి భూమికి అనక మధ్యలో వ్రేలాడుచున్నది.

పంచవటిలో నున్న లక్ష్మణుడు ఫలములకై వచ్చి ఇదేమి ఆశ్చర్య మని అని ఆ కత్తి తీసుకొని ఆ పొదను నరికి వేశాడు. నీ కుమారుడు అందులో తపస్సు చేస్తున్నది అతనికి తెలియదు. పొదతో పాటు నీ కొడుకు గూడా నరుక బడ్డాడు అని చెప్పాడు. నాయనా జంబూకుమారా! దుప్పి, లేడి మాంసము, రక్త భాండాలు తీసుకొచ్చానే. నీకు నూరేండ్లు నిండిపోయిందా అని ఏడ్చి ఆ సుందరా కారుని నేనెలా అయినా సరే పొందెదనని మోహినీ అవతారం శూర్పణక ధరించి, శ్రీరామచంద్రుని వద్దకు చేరి.

## సరస్వతి రాగం — ఆది తాళం

| | | |
|---|---|---|
| పల్లవి : | సరస సల్లాప విరసముతో | |
| | సరి లేరురా నీ సాటి | ॥స॥ |
| అనుపల్లవి: | ఓ.... సొగసరి ఇటు చూడు క్రీగంట | ॥స॥ |
| చరణం : | నవరసము లొలికించు నీ దివ్యరూపంబు | |
| | కనులార వీక్షించి కఱిగె నా హృదయంబు | ॥స॥ |
| | కలుగు నీ హొయలెల్ల కారడవి పాల్జేసి | |
| | కలతలలోనేలా కరిగిపోవుదువురా | |
| | ఇటు చూడరా మాటాడరా | |
| | బిగి కౌగిలిలో దనిపి అధరామృత మొసగి | |
| | కావరా దాసురాలి | ॥స॥ |

వచనం :- ఆ జగన్మోహినీ రూపం ధరించిన శూర్పణక ప్రలాపంబులు విని, నీ

పేరేమి? మోహిని అని చెప్పింది. నీ కులగోత్రములేమి? తెలుపుము. సరి సరి నా కులగోత్రములు తెలుపమనెదవా రాఘవా నేనలతి దానను కాను, లంకా పుర మేలు రావణుని చెల్లెలను. నీకు ప్రియురాల నగుదును. నన్నేలుకొనుము అన్నది శూర్పణఖ.

ఉ॥ రఘు కులమున బుట్టి సూర్యాంశజుడనగు
ఏకపత్నీవ్రతుడ సచ్చరితుడ బ్రహ్మచర్యాది
వ్రతమున పితృ వాక్య పరిపాలకుడగు సీతా
కళత్రుడు రాకాసి గూడనగునె పామరురాలై పలికితివిటుల

వచనం :- అనిన శూర్పణఖ - రామా నిన్ను విడిచి బ్రతుకలేను. అంత రఘు రాముడు

గీ॥ రఘు వంశమున జనించి ఏకపత్నీ వ్రతుడనగు
చు పితృవచన పాలించు బ్రహ్మచారి నగుచు వన
ములందు కందమూలము లారగించు
జడధారిని నేను మోహినీ

వచనం :- అని శ్రీరామభద్రుడు పలికిన సూర్పణఖ నేను ఎవరని తలచితివో రావణుని చెల్లెలను

భూపాలం — మిశ్రజాతి

పల్లవి : సామీ నీ పదములొత్త వచ్చితి - నేలుకోరా
మరపురాని నీ సొయగలు మనసులోన నాటి పోయె ॥సా॥

చరణం : మనసు నీదిరా - నీ మతము మానరా
కలువలు బోలు కనులతో నా హృది కదలించితివిరా
సామీ వేడుకొందురా ॥సా

వచనం ;- మోహినీ బ్రహ్మచర్య వ్రతముననున్న నన్ను కోరనగునె వెక్కుము. అయినా మోహినీ, నా పేరు నీకెట్లు తెలిసినది? వచ్చిన తక్షణమే రామాయని సంబోధించితివె అన్నాడు రాముడు. ఏనాడో నిన్ను చూచి భ్రమించితిని మాయన్న రావణుడు - జానకీ స్వయంవరమునకు వచ్చినప్పుడు నేను, నా భర్త వచ్చితిమి. నా భర్త సీతను ప్రేమించి రామా నీ వేషంలో వనంలో తిరుగుతున్నాడు. నేను

నిన్ను ప్రేమించి - సీత రూపంలో వుంటే నీవు నన్ను పెండ్లి చేసుకుంటావని సీత రూపంలో వచ్చాను. రాముడు రూపంలో వుండే నా భర్త కరాళుడు నేనే నిజమయిన సీతనని నన్ను దొంగతనంగా ఎత్తుకొని అడవికి తీసుకొని వెళ్ళి నన్ను మొయ్యలేక ఏనుగులు తిన్నావా పీనుగులు తిన్నావా సీతా అని నన్ను ఎత్తిపడేశాడు.

అప్పుడు నిజమయిన రాముడే యనుకొని హా! రామా నన్ను పెండ్లి చేసుకోమని గట్టిగా పట్టుకున్నాను. హా! సీతా అని కరాళుడు నన్ను పట్టుకున్నాడు. అప్పుడు కరాళుడు నిజమయిన రాముడనుకున్నావా చూడు నా రూపమని నిజ మయిన రూపం చూపించాడు.

అరి నీ జిమ్మడ - నీ కడుపుమాడ ఎంత పని చేశావురా - నిజ మయిన రాముడవనుకొని నీ వెంట వచ్చాను. నేను మాత్రం నిజమయిన సీతనను కొన్నావా - చూడమని నా రూపం చూపించాను. ఇద్దరం మోసపోయాము. అప్పటి నుండి నీపైగల అనురాగంతో తపిస్తుంటె ఆ ఈశ్వరుడు నిన్ను నా దగ్గరికే తీసు కొచ్చాడు.

కాబట్టి నన్ను ప్రేమించు రామా. అలా అయితే మోహినీ నేను భార్యతో వచ్చాను. నా తమ్ముడు ఒంటరిగా వున్నాడు వెళ్ళు, ప్రేమిస్తాడేమో. ఓహో తమ్ముడున్నాడా అని శూర్పణఖ లక్ష్మణుని చెంత చేరె.

సీ॥ ఈ సమస్తావని ఏలిక త్రైలోక్యవీరుడు
రావణునికి చెల్లెలను నేను
కనురెప్పపాటయిన నెట్టి కార్యమునయిన
సాధించు నెఱజాణ నేను
ఏ రూపముననైన కేళీ వినోదముల
వేడుకనూల లాడింతునేను
నాయన్నలు నీకు బావలగుదురు
ఏలింపగలరు నిన్ను రాజ్యమెల్ల

గీ॥ పాడు తపములు మాని నా మాట నమ్ము
పిచ్చి పిచ్చి ఆశలతో చెడిపోకుమింక
లేచిపోదము ఎచ్చోటికయిన నాకన్న మించిన
సుందరి లేదు జగతి నన్ను గూడలేని నీ బ్రతుకు సున్న

వచనం :- అనిన లక్ష్మణుండు

గీ॥ నన్ను కామింపదలచి వచ్చితివి కాని నే
బ్రహ్మచారినగుట ఏమాత్రం లాభముండదు
ఓ అలికులవేణి నా సహోదరుని తరునిగ వరించి
వచ్చితివి నాకు ఒదిన వవుదువీవు

వచనం :- కావున నీవు ఇచ్చవచ్చిన కడకు పొమ్ము. లేదా పెద్ద పెండ్లి అగునని అనిన ఏడ్చుచు, శూర్పణఖ రాముని చెంత కేగి, రామా నీకు నాకు తప్పదనియె. సీతాదేవిని మ్రింగెదనని - మ్రింగదలచిన, లక్ష్మణుడు నా యాజ్ఞానువర్తి. అందుకే వివాహమాడలేదు. నేను ఆజ్ఞఇచ్చితినని చెప్పుమని వీపున వ్రాసి పంపించె రాముడు

మంజరి ; రాకాసి ముక్కు చెవులు కోపంబున గోసి
కోపంబున ఓసీ నీపస గూల్తునంచు స్త్రీయని తపించె

వచనం ;- అంత సూర్పణఖ నీపని పట్టింతునని క్రూర రాకాసి రూపం దాల్చి లంకకు పోయి మూలబలంబు గొని వచ్చిన. శ్రీరామచంద్రుడు తృటిలో వారిని చంపివైచె.

ఖరదూషనాదులను గొనివచ్చె. దూషనుని సైన్యము, దూషనుని సంహరించె. పదివేల కంచు రథములతో వచ్చిన ఖరుడు రామునితో యుద్ధం చేసి చేసి రాముని ఫాలస్థలమున కొట్టిన విరథుడగు శ్రీరాముడు

సారంగ — ఏకతాళం

పల్లవి : శభాష్ నీవు గొప్ప మొనగాడవురా
నా చేతి విల్లు ద్రుంచినావురా ॥శ॥

చరణం : సుంత ఏని గుర్తింపలేక - సుదతి ముక్కు చెవులు
పంతమ్మున కోసినావు వంతలు గల సుఖ జీవనుడవు
పంతగించి నాతో పోర ఎంత వాడవురా
మనగదలచితివేని-నిలువనేర్తువో నా బాణవహ్ని ॥శ॥

వచనం :- శ్రీరాముడు పదివేల కంచు రథంబులుగల ఖరుని వైష్ణవాస్త్రంబున దునిమిన దేవతలు పుమవృష్టి గురిసినంత జానకీదేవి రామభద్రునకు సీతలోప

వారములొనర్ప లక్ష్మణుడు ఫలములకేగెను.

మ॥ శూర్పణఖ రావణు డాసి నర పగతురతోడ
ప్రమందిరి మూలబలంబును ఖరదూషణాదులు
అన రావణుడు ఇసీ తలవంపులయ్యె సురలకు
నైన లొంగని ఖరుడున్ ఏ విధి కూలె వచింపవే తగన్

గీ॥ వినుమన్న రావణా నన్నలయింపకు వచింతు
ఒక్కమాట పలుకగ రాని అందముల ప్రోడ
జానకీ నీ కనువగు సుందరాంగి నీకు గల భా
ర్యలు సమమౌనులె కాలి గోటికినీ

వచనం :- అన్నా! రావణా! ఆ రాముని ఇల్లాలు అపురూప సౌందర్యవతి. పలికిన చిలుకలు పలుకును, నడచిన హంసలు నడచును. ఆ సౌందర్య రాశిని పొందని నీ బ్రతుకు వృధా యని చెప్పిన చుప్పనాతి మాటలు విని రావణుడు సోదరీ! నీవు శాంతింపుము. జానకినపహరించి వరించెదను అని చెప్పి సముద్రము దాటి మామ యగు మారీచుని గృ హ ము న కు పోయెను. అల్లుడా ద శ క ం ఠా! నీ రాకకు కారణమేమి? ఆసీనుడవు గమ్ము. మామా మారీచా! నీ మాయ వలన సీతారాములను ఎడబాటు చేయుము. ఆ రాముని మహిమ నీకు తెలియదు రావణా!

సీ॥ మత్స్యావతారుడై మహి సోమకాసురు గూల్చి
వేదముల కాచిన మత్స్యావతారుడతడు
పాలకడలి తరువ మందరంబు బడక
మూపున దాల్చిన కూర్మావతారుడతడు
వీర హిరణ్యాక్షు వధియింప కిటియై
భూమినేలిన సూకరావతారుడతడు
బాలప్రహ్లాద కావంగ హిరణ్యకశిపుని
జంప స్తంభంబున బుట్టిన నారసింహుడతడు
మూడడుగుల నేల గొని బలిని పాతాళమునకు
త్రొక్కిన వామనావతారుడతడు

గీ॥ కార్త్యవీర్యార్జునుని కారణమున వాని
జంప పరశురాముడయ్యె నరవానరులు తక్క

మరణ మెరుంగని నరుడై రావణుని గూల్చ
పండువంటి లంక పాడేల చేసెదొ ముండ
మాటవిని చెడిపోకుమన్నా

వచనం :– ఏమీా ఆ నరకీటకమును గూర్చి నాకా బోధించుట

గీ॥ నాకన్న ఘనుడు నరకీటకమని ప్రేలెదో
కలడె నా కన్న దైవంబు ఇంకొక్కరుండు
వానికి మారుగా నిను వధింతు నిప్పుడె
మనదలంచితివేని నా మాట చెల్లింపుమీావు

వచనం :– రావణా! మృత్యుముఖమున నుండి తప్పించు, నన్నా నిందించెదవు అన్నాడు మారీచుడు, అప్పుడు రావణా నీ ఇష్టమొచ్చినట్లు. నన్నేమి వేయమందువు? అంత రావణుడు మామా! నీవు లేడి రూపము ధరించి సీతారాములను యెడబాటు చేయుము. చేసితివేని నేను జానకిని అపహరింతును. లేకున్న నీ ప్రాణములు తీసెద. సరే! నీచే చచ్చుటకన్న ఆ రామునిచే చచ్చిన మోక్షము కలుగునని మన స్సులో అనుకొని వెళ్ళిపోయాడు. సీతారాములు పర్ణశాల దాపున విహారము చేస్తు న్నారు. ఆ సమయంలో బంగారు లేడి గంతులు వేస్తూ వస్తున్నది. దానిని చూచి ఆ ముద్దులేడిని చూచితిరా స్వామీ! అన్నది జానకి. సీతా! అవును బాలా చక్కగా వున్నది. స్వామీ! దాన్ని ఎలాగయినా బట్టి తెచ్చి నా కొసంగుడు. ఇది ఏమి? జానకీ ఎన్నడూ కోరని నీవేలా కోరుచుంటివి, అట్లయిన నీ కోరిక తప్పక తీర్చెదను అని రాముడు పోబోవ అది విన్న లక్ష్మణుడు అన్నా!

మ॥ కనక కురంగంబు కలదై ఏ లోకంబందయిన
వేదశాస్త్రంబులందు లేని వింత మృగంబిది
తలప తలప తోచె నా మదికి రాక్షస
మాయ యంచు తలచితి రాఘువేంద్ర

వచనం ;– లక్ష్మణా! కురంగంబైన తెచ్చెద లేక రాకాసి యైన చంపెద. నా వీరత్వము తెలిసి యుండి నీవేల సందేహించెదవు? నేను లేడి వెంట పోయెద. రాక్షసి మాయ ఈ అడవిలో మిక్కుటముగా నున్నది. ఒక్క క్షణము యెడ బాయక మీా వదినను కాపాడుము పర్ణశాల లోనే వుండుము. ఇప్పుడే వచ్చెదనని సీతవంక చూచి, చూచి, లేడిని తరుముకొని రాముడు పోయె.

మంజరి ; ఆ చక్కని బంగరు లేడి తెమ్మనియె జానకీదేవి
ఏడు క్రోసుల దూరంబు గొని చని రాముని చిక్కులు పెట్టె

వచనం :- మరల ఆ జింక పర్ణశాల దాపునకు వచ్చినది, గంతులు వేయుచున్న లేడిని పట్టుకొనపోయి చేతికందక, అబ్బ ఏమి ఈ లేడి? ఏడు క్రోసుల దూరమున అడవి యంతయు త్రిప్పి, నన్నలరింప జేసెనే. ఇది జింక కాదు. రాక్షసుడే. లక్ష్మణుడు చెప్పిన మాట నిజము. తన వెంత నిలచి, బారెడు దూరమున అగుపడును. అప్పుడె మాయమై రాముని వంకె నిలచును.

అంత రాముడు మహా కోపమున ఓరీ రాక్షసాధమా! జరమర శరముతో దాని ఫాలస్థలములో కొట్టేవరకు, ఆ లేడి నిజమైన రాక్షస రూపం ధరించి పర్ణశాల ప్రక్కగా నేలబడి హా సీతా! హా లక్ష్మణా! నన్ను కాపాడుము. అసురుని చేత వంచింపబడితిని అని కేక వేసి, మారీచుడు ప్రాణములు విడచెను. ఆశ్చర్యబడి, సీతా లక్ష్మణులు నలుదిశలు చూచుచున్న సమయమున ప్రాణావశిష్టుడయిన మారీచుడు శ్రీరామా! నేను విశ్వామిత్రుని యజ్ఞము నశింప జేయ వచ్చితిని. నీ బాణాగ్ని కీలలకు తల్లడమంది దక్షిణ సముద్రమున బడి, నీవు దేవుడవని నిన్నే ధ్యానించితిని. నేను మారీచుడను. నాకు మోక్షం ప్రసాదింపుమని చెప్పి ప్రాణములు విడిచెను.

ఆ కేక వినిన శ్రీరామచంద్రుడు భయమంది లక్ష్మణుడు సీతను విడచి ఎక్కడ వస్తాడో నన్న భయంతో చెరచెరా వచ్చుచుండె.

మంజరి ; అన్నా! లక్ష్మణ రామచంద్రుడు
ఆపదలో తానుండె
అన్నా! నీ వేగి, మీ అన్నను
కాపాడుము వేవేగ

ఉ॥ రామానుజుడు విని "అమ్మా, రాము దేవి," "వగవ వలదమ్మా."
నేను రామాజ్ఞనందినాడ రఘుకులేశునకు మించిన వీరవరుడు
కలడె. ఖరదూషనాదుల కంచు రథంబులతో
సకల సైన్యముల గూల్చుట యెఱుంగవే, తల్లీ"

వచనం :- "అట్టి రామచంద్రునకు ఆపద కలుగునా తల్లీ" లక్ష్మణా రాక్షస మాయయని తెలియక నా రాముని లేడి తెమ్మని కోరితిని. నా బుద్ధి యెంత అల్ప

మైనది, ఆ రాక్షసుడు, నా దశరథాత్మజునకు ఎట్టి ఆపదల పాల్జేసెనో, ఎవరికి లొంగని రాముడు, సీతా లక్ష్మణా కాపాడుము, కాపాడుము అని ఆక్రందన చేయునా, తమ్ముడవై అన్న ప్రాణాపాయములోనున్న కాపాడలేవా అని నిందించు చున్న జానకీదేవి పాదముల వ్రాలి, కన్నీళ్ళతో కడుగుతూ అమ్మా! అది రాక్షసుల మాయకాని, రాముని మాట కాదు. మహా కోపమున సీత, ఛీ! మూర్ఖుడా! చాలిం పుము నీ నక్క వినయము.

ఉ॥ నమ్మితి నీదు పాదములటంచు – నమ్మించి మమ్ము
వెంబడించెడి దుర్మదాంధుడవు – యెఱుంగక మోసపోతిమి
"హా!" రఘురామా "హా" రఘురామా
ఇంకేమి చేయుదును. నిర్భాగ్యుని నమ్మి మోసపోతిమే

మంజరి ; అన్న భార్యను నపహరింపగ
తలచితివేమో నీ మదినీ
నన్ను తాకగా నీ తరమౌనా
యెఱుగ నైతివ్ నీ మదినీ

వచనం :– అని ఇట్లు దుర్భాషలాడిన సహింపజాలక జానకీదేవి పాదములబడి

ఉ॥ రాక్షస మాయలంచు వచింపవు నమ్మవు నాదు మాట
ఏమని వచింతు తల్లీ, నిను మెప్పింపగ నేరనైతి నేను
క్రన్నన వత్తునంచు తా జనె రాముడు ఎన్ని చెప్పినన్
సీతమ్మను కావుమంచు, వచించిన సంశయమందుచుంటివే

వచనం :– జగన్మాతా నీకు తెలియని ధర్మములు కలదా! కలవా తల్లీ

చం॥ తల్లిదండ్రుల మరపించు తల్లిదండ్రులనుచు
అన్నదమ్ముల మరపించు అన్నయనుచు
బంధుజనుల మరపించు భాను తేజుడనుచు
పాపకర్మల ద్రుంచు కల్యాణ రాము నమ్ముకొంటి

వచనం ;– "తల్లీ, నీవేనా ఇట్లు మాటలాడుట" నిముసమయినా మిము యెడ బాయ వలదనిన రామాజ్ఞను పాలించితినేగాని, నాకు మీయెడల కపటమేమాత్రం లేదు. అంత సీత మొగమావలకు త్రిప్పుకొని, ఇక నీ మాటలు నమ్మజాలను. నా

రామునికే ఆపద కలిగినదా.

సీ॥ పట్టాభిషేకమై ప్రజల నేలగనున్న
శ్రీరాము కనుగొని ఓర్వలేక
కులగోత్రములు మఱచి కుల గౌరవము చెఱచి
కోరె కైకమ్మ వరముల కోర్కెదీర
రాజ్య మెడబాసె రాచవారిలో తలవంపులుగ
పితృ వచనము నిల్ప కాన జొచ్చె
సుకుమారుడైన శ్రీరఘురాముడు
పడరాని ఇడుములు పడుచునుండె

గీ॥ తోడు బాయని నీడనై తరలి వచ్చితి
అన్నియు మఱచి నన్నుగని రాముడు
రాముని గని నేను బ్రతుకుచున్నాము
ఎన్నెన్నో బాధలతో – అట్టి మమ్ముల నెడబాపి
నన్నపహరింప తలచినాడవె నీ మది కుటిలతతోడ

వచనం :– రామా! రామాయని చెవులు మూసుకొని

కం॥ తల్లి సుమిత్రయే సీవని రాముడే దశరథుడు తండ్రియని
నమ్మి కొలచితి నా మనంబులో – అవని జాత ఇటులాడనగునె మీకు

వచనం :– అని పాదంబుల కడిగి నమస్కరించి అమ్మా. జానకీదేవీ నన్నేల ములుకుల వంటి పలుకులతో బాధించెదవు. అన్నిటికీ ఆ ఈశ్వరుడే దిక్కు. నా మనవి ఆలకించి మీకు శ్రీరామరక్షగా కార్ముఖరేఖలు గీచిపోయెద. యెట్టి ఆపద యందయినా ఈ ఏడు గీరలు దాటవలదు అని పలికిన లక్ష్మణుని పలుకులు ఆలకించి, కోపోద్రేకంబున పలుకకుండె. అంత లక్ష్మణుడు కన్నీరు మున్నీరుగా ఏడ్చుచు, శ్రీరాముని వెతుకుచూ బోవుచుండె. రావణుడు సన్యాసి వేషమున వచ్చి సీతను చూచి "ఆహా," ఏమి ఈ జానకీ సౌందర్యము. నా చెల్లి శూర్పణఖ చెప్పిన దానికన్న వేయి రెట్లు ప్రకాశించుచున్నది. నేనెంత భాగ్యశాలను అని ఆశ్రమ ద్వారమున భవతీ భిక్షాందేహి. భవతీ భిక్షాందేహి. భవతీ భిక్షాందేహి అని ముమ్మారు పిలచిన, తడబడు పదములతో కంపించు శరీరముతో రాలుచున్న కన్నీటితో రామునకు ఆపద మూడెనన్న మనస్సుతో సీతాదేవి కొన్ని ఫలపుష్ప ములు గొని మెల్లన వచ్చుచున్న ఆ రావణాసురుడు హంస నడకల వచ్చు సుకు

మారిని కనుగొని, ఆశ్రమ వాసిని, పతి దూరస్తురాలను నా పూజలంది, నా పతి నన్ను చేరునట్లుగ నన్ను ఆశీర్వదింపుడని భిక్ష నిడబోవ, అంత దశకంథరుడు ఓ సీతా! ఆశ్రమ వాసివి. తపసి పాదముల కడిగి ఆతీథ్య మిడవలయునే కాని అలతిగా చూడరాదు. అంత జానకి తాపసవర్యా!

శా॥ మీాదు పాదంబులంటి నమస్కరింపజాల – మరిది
ఆజ్ఞ నే మీారజాల సప్తగిరులు నేదాటి రాజాల
అపజయము కల్గు నాకు ఆగ్రహింపక గొను
భిక్ష అర్థింతు మిమ్ము తపోధనులు మీారు

వచనం :- అంత దశకంఠుడు కోమలీ, నీ సందేహములన్నీ తీర్చెదను. ఆ గీరలు దాటి పాదపూజ నొనర్చినగాని నీ భిక్ష స్వీకరింపను. ఆపదలో వున్నట్లు న్నావే. అవును స్వామీా! కురంగము వెంటపోయిన నా రాముడు, అన్నను వెతక పోయిన లక్ష్మణుడు క్షేమమే కదా! సీతా! దివ్యజ్ఞానంబున చూచితిని. ముందు పూజలర్పింపుము. నా మహిమ వలన నీకు ఎట్టి ఆపదా కలుగదు. అంత జానకి

మంజరి : గడగడ వణకుచు సీతమ్మతల్లి
శ్రీరాముని ఎద దలచి
కార్ముఖరేఖలు దాటి రావణుని
పూజింపగ ఎదదలచి

వచనం :- అంత కార్ముఖ రేఖలు దాటినంత భగ్గున మండిపోయె. రావణుని పాదములు కడిగి, పూలతో పూజించి. భిక్షనిడి స్వామీా! రామలక్ష్మణులు క్షేమ మేనా? సీతా! ఆ మాయా రాక్షసుడు రాముని, తమ్ముని సంహరించె. అంత సీత హా రామా! యని మూర్ఛిల్లె. అంత సీతమ్మ తల్లికి భూదేవి ప్రత్యక్షమై అమ్మా! ఇతడు తపసికాడు. నిన్నపహరింప దలచిన లంకాపురమేలు రావణాసురుడు. వీని నదలింపుము. నేను నీ తల్లి భూదేవిని. అని అదృశ్యమయ్యెను. వైదేహి లేచి దుర్మార్గుడా! మాయారూపమున మోసగించెదవా?

మ॥ నిజరూపమున రావణుడు నిలచినంత
జానకీదేవి జూచి భయభ్రాంతయైన
వెకిళినవ్వు నవ్వి దశకంఠుడు వికృతరూపం జూపిన
రామ రామా యటంచు రమణి బడియె.

వచనం :- నలుదిశలకు గని భూమిని త్రవ్వి జానకీదేవి నెత్తుకొని ఆకాశమార్గ మున జనుచుండె.

ంఁంఁ ంఁంఁ ంఁంఁ

కురంగము వెంట జనిన రాముడు ఏడు క్రోసుల వరకు దానిని వెంట దరిమి హా! లక్ష్మణా! హా! సీతా! అని పరువిడుచున్న రాక్షసుని సంహ రించిన రాముడు ఆ కేకలు విని పర్ణశాలలో సీతాలక్ష్మణులు ఎంత భయపడు తున్నారో అని ఇట్లనుకొనుచు పరువిడి పరువిడి వచ్చుచున్న రామునకు లక్ష్మణుడు ఎదురై అన్నయ్యా నన్ను క్షమింపుము. నీ ఆజ్ఞ జవదాటితిని, వచ్చితిని. తత్తర పాటున శ్రీరామచంద్రుడు లక్ష్మణుని చూచి - లక్ష్మణా కన్నీటితో వచ్చిన కారణమేమి? ఆ రాక్షసుని మాయ నిజమని నమ్మి

మః జనక జాత రామునకు ఆపద కలిగెనంచు
రాక్షసుని మాయలకు లోనై నా మాట నమ్మకుండె
వీరాగ్రగణ్యుడు శ్రీరామచంద్రుడన్న నశించిన
నన్నేలుకొన దలచి పోజాలవా పాపి నీవు

వచనం :- ఆ మాటకు వెఱచి వచ్చితివా.

చః సీత అమాయకురాలు - ఎఱుగదు పాపపుణ్యములు
సుంతయున్, రవంతయేని - యోచింపక మూఢబుద్ధివై
వీడితివేల నా ప్రాణసమమగు అర్ధాంగలక్ష్మినిన్
ఏమని చెప్పుకొందు - విపరీత విధికి నేను ఏడ్చుచుంటి

వచనం :- అని వగచి పర్ణశాల జేరి సీతా, సీతాయని పిలచి, బదులురాక, నేల చిందర వందరయై పడుచున్న ఫలపుష్పముల చూచి విఫలములైన కార్ముఖరేఖలు చూచి భూమి త్రవ్వబడియుంట ఇది ఏల? రాక్షసుల మాయ కాదు కదా! రాక్ష సుల వలన కీడు సంభవించెనని తలంచెద.

"హా" సీతాయని రాముడు గట్టిగా అరచి చెట్టుకు వేరబడి వాపోవుచుండె.

ంఁంఁ ంఁంఁ ంఁంఁ

రావణుడు ఎత్తుకొని పోవుచున్నాడు సీతను.

కం॥ గోడు గోడున ఏడ్చుచున్న ఆ సీత తలపోసెనిట్లు
దశరథు కోడల రాముదేవిని రక్షింపుడని వెలుగెత్తి పలికె

గీ॥ పక్షులార యక్షులార - వనదేవతలార
పుర కాంతారములార - సిద్ధులార ఖగ మృగములార
తపసులార బంధుజనులార - మిత్రులార
దశరథ కోడల నన్ను రక్షింపరారె

శా॥ పుట్టితి భూమిలో - జనకసుతనైతి మెట్టినిల్లుగా
రాము చేబట్టినయట్టి - అవనిజాతను సీతను రామాజ్ఞ లేక
అథమ రాక్షసుడెవడో - నన్ను ఆకశము నుండి గొని అరుగుచుండె
లక్ష్మణుని తోడు బాసిన నిర్భాగ్యురాల - కావరారేల వేగమే కరుణతోడ

వచనం ;- కన్నీరు మున్నీరుగా ఆక్రందన చేయుచున్న గగన యానము చేసెడి జటాయువను పక్షి, దశరథుని మిత్రుడగుటచే జలజాక్షిని రక్షింప, రావణునితో యుద్ధమునకు తలపడె.

మంజరి : రావణుని బరిమార్చు నంచు జటాయువు సీతమ్మ సంతసించె
ఆ క్షణములోన రావణాసురుడు పక్షి రెక్కలను నరికె

వచనం :- "హా" రామా రామాయని మేరుగిరి పర్వతము రీతి సీత మూర్ఛబడియె కొంత తడవునకు మెలుకవ తెచ్చుకొని రెక్కలు పోయి ప్రాణములు విడువనున్న పక్షి రాజును గాంచి. "ఓ. పక్షిరాజా నే పతివ్రత నగుదునేని నా వార్త నా పతికి ఎఱుంగించునంతవరకు నీ ప్రాణములు నిలుచుగాక" అని దీవించి ఎవరు నన్ను రక్షింతురాయని నలుదిశలు చూచుచు

## హిండోల్ — రూపకం

పల్లవి : ఇక నన్ను బ్రోచువారెవ్వరు
ఈ ఇలలో శ్రీరామ ॥ఇ॥

చరణం : కలనైనా తలచనైతి
ఈ దైత్యుడు చెరబట్టుననుచు
యెడబాటే లేదటంచు
విఱ్ఱవీగితిని గానీ

కోరుకొన్న వరము చేత
కోమలాంగ దూరమైతి

వచనం :- అని వగచి, వగచి, ఏమీ తోచక నలుదిశలు
మూక పర్వతముగ, దశకంఠుడు పోవుచున్న సీత తన పైట
మూటకట్టి ఋష్యమూకంపై విసరివైచె. అంత రావణుడు లం
వృక్షము క్రింద సీతనుంచె.

పర్ణశాలలో రాముడు తమ్ముడా లక్ష్మణా
జగన్మోహిని — రూపకం

పల్లవి : ఏ పాపము యెఱుగనట్టి – సీతను యెడబాసితి
శాపమో నా పాపమో – నిర్భాగ్యుడనై తపింప

చరణం : యెండ కన్నెరుగనట్టి – సుకుమారి నా సతిని
రాక్షసుల కర్పించినట్టి – రణశూరుడా ఈ రా

వచనం :- "ఇది రాక్షసుల మాయగాని వేఱుగాదు"
భీరులని నీవెరుగవా. జానకిని ఎడబాసి పోవలదని ఎన్ని వి
వినక నీవు వచ్చినందులకు రాక్షసుడెవడో సీతను గొనిపోయి
సీతా జగదేక పావనీ అని చతికిలబడి

సీ॥ యెన్నడు కోరని వివిధ
లేడి కావలెనని యేల కోరినావు
కోరినంతనె దాని మర్మంబు తెలియక
తెచ్చుటకు నేనేల యేగవలయు
యేగినంతనె రాక్షసుడు జచ్చి,
'హా' లక్ష్మణాయని యర్వనేల
వినియు నాదు వీరత్వ మెంచక
లక్ష్మణుని తోడేల బాపుకొంటి

గీ॥ యేమని వచింతు. ఈ విపరీత విధికి
లక్ష్మణా ఈ నాకింత జరిగె,
బ్రతికి యుండిన సీతనే గాచుకొందు
లేక యుండిచన రాముడే లేక యుండు

వచనం :– 'అన్నయ్యా! యేల అశ్లీలములు పలికెదరు. నేను నిరంతరము రామ భక్తుడ నగుదునేని' సీతారాములకు యే విపత్తు సంభవించకుండుగాక అని లక్ష్మ ణుడు నమస్కారం చేశాడు.

అంత రాముడు "తమ్ముడా, ఇక ఎక్కడి సీత ఎక్కడి రాముడు" పర్ణశాల నలుదిక్కుల వెతకి, వెతకి, యెల్లవారి నడిగి, నడిగి, ఇక చేయునది లేక ఇక విచారించి ప్రయోజనము లేదు. ఈ వనములలో వెదుక పోదము రమ్ము.

అమ్మా! సీతాదేవీ, వదిన గారూ, చెంతనే యున్న సెలయేరుకు పోయెనా, మునికాంత చూడబోయెనా లేక మమ్మేతుక వచ్చెనా దొంగల చేత పట్టు బడెనా, మృగములు మ్రింగెనా, రాక్షసుల మాయ తెలియక నేను చచ్చితినని జానకి పర్వతముల నుండి దుమికి ప్రాణములు విడిచెనా, లేక ఏ రాక్షసులయినా అపహరించుకపోయెనా ఎందునా కానరాదే, ఎవరినడిగినా లేదందురే వనవాసము నకే వగచుచున్న ఇందు ఎడబాటు కూడా సంభవించెనా, కల్లాకపటము తెలియని నీవు పాపి శూర్పణఖను చూచి బెదరి, రామా, రామా, రామాయని నా హృదయ మునకు హత్తుకొను నీవు, ఇప్పుడెట్లున్నావో, ఏమి కష్టము లనుభవించుచున్నావో నాకెట్లు తెలియును. తెలియకున్న రాముడిక జీవించుటెట్లు.

కన్నీటి కాల్వలుగా ఏడ్చుచు ప్రయాణించుచున్న రాముడు సీతను తలచి, తలచి నొక మద్ది వృక్షమున సీతగా తలపోసి, "హా" సీతా, ఇక్కడున్నావా నీ ముద్దు మోము జూచి ఎన్నాళ్ళయినది. ఈ రాముడు నిన్నెడబాసి వుండజాలడు. అని మద్ది చెట్టును కౌగలించుకొనియె, రఘుధీరుని దుఃఖము చూడలేని లక్ష్మణుడు ఛీ! ఛీ! ఏల నాకీ పాడు జన్మ, సుగుణమూర్తులు, దివ్యమంగళాకారులు, అతిసుకు మారులు, అతి ప్రేమానురాగులైన సీతారాములు యెడబాటు అగుటకు నేనేకదా కారణం. ఏ పినతల్లి కైక బంధువులను, రాజ్యమును ఎడబాపె, ఒక పినతల్లి సుమిత్ర కొడుకుని వెంటబంపి భార్య నెడబాటు చేయించె. తమ్ముడు భరతుడు పాదరక్షలు గొని పదవులకు ముండ్లు నాటజేసె. లక్ష్మణుడు నా ప్రాణములే హరింపనుండె అని దశరథరాజ తనయుడు ఎంత పొక్కుచుండెనో, నా ప్రాణ సమానమైన వదినగారిని వేరు చేయుట రాముని హాని చేసినట్లే కదా! రామచంద్రా. ఇది నా కడసారి వందనం. జానకీరాములకు ఎడబాటు చేసిన నేను ఇక మని యుండరాదు. ఈ పాషాణమునకు నా తల మోదుకొని ప్రాణములు విడిచెదగాక అని పోబోవుచున్న, శ్రీరామచంద్రుడు, "హా!" లక్ష్మణా! యేమి నీ సాహసం.

శ్రీరామా, నన్ను మన్నించు. నేనున్న ఇంక నీకెన్ని బాధలు కలుగునో అని పా
ణమునకు తల బలిమిని కొట్టుకొనియె. 'హా' లక్ష్మణాయని రాముడు మూ
బడియె. అది గని అన్నయ్యా అని అరచి రాముని కౌగిలి చేర్చుకొనియె.

'లక్ష్మణా! నా అర్థాంగలక్ష్మి నన్ను అన్యాయం చేసినట్లు నీవు
చేసెదవా. అన్నయ్యా నీ దుఃఖము చూడలేక నన్ను క్షమింపుము. కౌసల్యాసుతు
లక్ష్మణా ఇంకెన్నడూ ఇట్టి పని చేయనని ప్రమాణము వేయుము. రాఘవ
ఎన్నడూ చేయను. రణధీరా, నాకును అట్లే ప్రమాణమిమ్ము. ఇచ్చెద. ఒకరినొక
ప్రమాణము తీసుకొనిరి. అప్పటి నుండి ఎవరిలో ఎంత దుఃఖమున్నా వారిలో
ఇమిడ్చుకొని సీతను వెదకుచూ ఒక వృక్షం నీడ కూర్చున్నారు.

అప్పుడు పార్వతీదేవి పరమశివుని చూచి స్వామీ! ఆ మహా ప
వ్రత జానకీ దేవికి అనసూయ నిడిన తిలకము మహిమ చేత పరుడు అం
వెఱచును కదా! రావణాసురుడు ఎట్లు గొని చనియె?

'ఓ. ఉమాసతీ. చెప్పెదను వినుము' పరమేశ్వరుడు ఈ విధము
ఛాయా సీత చరిత్ర చెప్పదొడగె.

పంచవటీ తీరంలో పర్ణశాలలో సీతారాములు నడచి నడచి ప్రయాస
తో సోమరపు వుయ్యాలలో గాఢనిద్రా పరవశులై వున్న సమయమున సీతాదేవి
పైట చెరవు తొలగి నంత శ్రీరామ చంద్రుడు చూచి, ధనుర్ధరుడై 'ద్వారములో
లక్ష్మణుడు నిలచి యున్నాడు.' సీతను, లక్ష్మణుని చూచి, శ్రీరామ చంద్రుడు
మెల్లగా తమ్ముని దరి జేరి. లక్ష్మణా! నీవు పర్ణశాల కొచ్చితివా? లేదన్నయ్యా,
మృగముల దరుముచు, ఇందే యుంటిని. చూడు లక్ష్మణా!

గీ॥ ఎన్ని జపములు, తపములు చేసి యైనగాని
చతుర్వేదములు చదివిన గానీ
పదునెనిమిది పురాణములు వల్లించిగాని
అష్టసిద్ధులు పొందియూ కామవాంఛులైరి

వచనం - కాబట్టి భార్యను విడచి, రాజ్యం విడచి మా వెంట ఎన్నియో కష్ట
ములకోర్చి వచ్చుటకేమి కారణమా యని నా మనస్సునకు అనుమానస్పదము
కలిగినది. అది విన్న సుమిత్రాత్మజుడు అన్నయ్యా, సూర్యచంద్రుల సాక్షిగా

రాముడే దశరథుడు. నా తల్లి సుమిత్రయే జానకీదేవి అని తలంచితి కాని నా మనస్సులో ఏ కపటమూ లేదు అని శ్రీరాముని పాదములు బట్టి కన్నీరు రాల్చు చున్న అంతకుముందే లేచి వారి సంభాషణ వినుచున్న జానకీదేవి, సర్వము విని, పురుషోత్తముడయిన రఘుకులతిలకునికి నాయందు అనుమానము రానే వచ్చింది. ఇక నే బ్రతికి వుండలేను. అని సీతాదేవి గబగబా పర్ణశాల వీడి, విశాలమయిన ప్రదేశమునకు జని సాక్షీభూతుడైన ఓ అగ్నిహోత్రా! నన్ను నీలో చేర్చుకొనుమూ.

అది చూచిన శ్రీరామచంద్రుడు పరువిడి వచ్చి చూచేవరకు భగ్గున మంటలు మండుచున్నాయి. ఏమిటి సీతా? అని చెయ్యి పట్టుకున్నాడు. రామా! కన్నకొడుకులా వుండే లక్ష్మణునిపై మీకు అనుమానం కలిగింది కనుక ఇక ఈ సీత అగ్నిలో లీనమైపోవుటయే మంచిది. జానకీ!

మ॥ నిఖిల సౌందర్యవతి ఊర్మిళ నీరజాక్షి
అందు సుఖభోగములందు సమయమందు
అఖిల భోగ సంపదల కాస్పదంబయిన
అయోధ్య వీడి బాధకోర్చి మనల సేవించుటేల

వచనం :- యుక్తవయస్సు నందు గలిగిన రాముడు సీతా నీవు నా వెంట వున్న కారణమున కష్టములు భోగములుగ. దుఃఖము సుఖములుగ అరణ్యవాసము స్వర్గ వాసముగా, లతా వనములు హృద్య వనములుగ, చిలుకలు, గోరలు, హంసలు, మయూరములు, జింకలు, పావురములు, నాట్య విశేషంబుల జేయు నర్తకులు, అరచు మృగముల నాదములు, భేరీ మృదంగాది సమ్మేళనములు, తుమ్మెద ఝుం మ్మని మ్రోగు తుమ్మెద రవములు, వీణా గాన విశేషంబులు, చల్లని సెలయేరు, చల్లని కొండగాలి, పండు వెన్నెల రేయి, గంధ సువాసనలచేత వెదజల్లు. ఈ వన సీమలో నాకేమి రాజ్య భోగములకన్న ఆనందపరవశుల చేయుచున్నది. నా కెట్టి కళంకము వుండదు, నీవు ప్రక్కన వున్న కారణమున. కానీ భార్యను వీడివచ్చిన లక్ష్మణుని మనస్సు తెలుసుకొన నటించితిని. ఏ తపోధనులకు లేని ఏకాగ్రతగల వాడు లక్ష్మణుడు.

స్వామీ! మీ అర్ధాంగలక్ష్మిని అయిన నాకు మాత్రం ఆ మాత్రం తెలియక పోలేదు. మీరు సూత్రధారులు. పాత్రధారులు. మీ మనస్సు తెలుసు కొని నేను ఇక రాక్షసాదులు వస్తారు. నా వద్దకు వచ్చే శక్తి వారికి లేదు అందు చేత వనవాసం వున్నంత వరకు నేను అగ్నిహోత్రుని చెంత నివసించెద అన్నది.

జానకీదేవి నాకు సహధర్మచారిణివై నీవు లేకపోతే నేను అరణ్యవాసం చేయగలనా స్వామీ మిమ్మేడబాసి నేను బ్రతుకలేను. నాకు మారుగా ఛాయా సీత (మాయా సీత) ను మీకు పరిచర్యలు చేయుచుండునని అని చెప్పి, పతికి నమస్కరించి సీతాదేవి అగ్నిలో ప్రవేశమయ్యినది.

వేదములో పుట్టిన వేదవతిని. రావణాసురుడు జడ అంటుకున్న కారణమున అంతవరకు అగ్నిలో లీనమైయున్నది· ఆ మాయాసీత వచ్చి రాముని ప్రక్కన నిలబడినది. శ్రీరాముడు చిరునవ్వు నవ్వి సీతతో పర్ణశాలకు మరలె. ఈ సర్వము అనతిదూరములో జరిగినప్పటికి శ్రీరాముడు నిందవేసిన కారణమున లక్ష్మణుడు తిరిగి చూడడయ్యె.

కనుక నో పార్వతీ ఆమె మాయాసీత గనుక రావణుడు ఎత్తుకొని పోయెనని చెప్పి, ఆ వృక్షము నీడ కూర్చున్న రామునకు ఈ కథంతా గుర్తునకు వచ్చి అడవి గోవుపాలు. మునుల బలవంతం మీద త్రాగి అటనుండి ప్రయాణమై ఘోరారణ్యంబులో పోవుచుండిరి. రామా, రామా, రామాయని, ఆర్తానాదం వినవచ్చె. అది విన్న రామలక్ష్మణులు నలుదిశల పరికించి చూచిరి. పొదల చాటున ఒక పక్షిరాజు రామా, రామా యనుచుండె.

అన్నయ్యా. యెవడో రాక్షసుడు. మనల మోసగింప, పక్షిరూపం ధరించె. ఆజ్ఞ ఇచ్చెదరేని ఖండ ఖండాలుగా చేసెద. లక్ష్మణా శాంతింపుము. రామ శబ్దము, ఎట్టి దుర్మార్గుని నోట వచ్చినా వారిని సంహరింపను. నన్ను యెదిరించిన వారుతక్క.

పక్షిరాజు చెంత చేరి ఓ పక్షిరాజా!

శా॥ రాజ్యమెడబాసి ప్రాణసతిని వీడి బ్రతుకుచున్నాడు
రాముడు చావలేక, అట్టి రామచంద్రుని శబ్దము
నీ నోట అవతరించె. ఏ విపత్తున నన్ను వేడినావో
కోరుకొమ్ము తగు సహాయము చేయువాడ

వచనం :— యెవరు మీరు? పక్షిరాజా. మేము దశరథరాజ నందనులం, రామ లక్ష్మణులము. "ఆహా" ఏమి నా భాగ్యము. నా చిన్ననాటి చెలికాడయిన దశరథ చక్రవర్తి కుమారులా, పరమపురుషా! మీరా స్వామీ ధన్యుడనైతిని.

## మోహన — ఆది

పల్లవి : మోహనరూపా శ్రీరామా

అనుపల్లవి: నిరతము నిన్నే మదిలో కొలతును ॥మో॥
పడతి సీతకై పరితాపమేల
పాపాత్ముల జే చిక్కి తపించె
అధముని త్రుంపీ ఆర్తిని బాపీ
ఆ జగన్మాతను అదుకో స్వామీ ॥మో॥

వచనం :– రామచంద్రా యని చెప్పబోవు సమయమున ఓ జటాయు పక్షిరాజా! సీతయను నా అర్ధాంగ లక్ష్మి యటనయినా అగుపడెనా? రామభద్రా! రావణుడనే రాక్షసుడు సీతను గొనిపోవుచుండ ఆ జగన్మాతను కాపాడనెంచి, రావణునితో యుద్ధం చేసి నఖములచే భర్జించి వాని శరీరమెల్ల చిత్రవధ చేసితిని. తుదకు నా రెక్కలు నరికి ప్రాణావశిష్టుని జేసె.

సీతమ్మ కరుణ వలన ఈ వార్త మీకు తెలుప ప్రాణములతో నిలుచుంటిని. ఇక నా ప్రాణములు బొందె నిలచుట లేదు. ఇక ప్రాణములు విడచెద మీ తండ్రి దశరథునకు ప్రియమిత్రుడ. నీకు తండ్రి సమానుడను. కాబట్టి మీ తండ్రికి చేసినట్లు నాకూ ఉత్తరక్రియలు చేయుము అని జటాయువు చెప్పాడు. పట పట పళ్ళు గీటి నేత్రములు అగ్నికణముల రాల్చుచు అరే పాపాత్ముడా రావణా ఇక నీ ప్రాణములు నిలచుట కల్ల.

శ్లో॥ అరెరె క్రూధనూజాధమా రణశూరుడు సూర్య
వంశ సంజాతుడు రఘుకులాన్వయుడు శ్రీరఘు
రాముని ధర్మపత్ని వైదేహిని నపహరించిన నపది
తలలు కోదండంబున డొల్ల చేసెద పృధివ్యాది పంచ
భూతంబుల సాక్షిగా కాచుకొమ్మికన్

వచనం – ఓ పక్షిరాజా! అతడెచ్చోట నివసించునో తెల్ప వేడెద. రామా, రామా, రామా యని మారు మాటాడక జటాయువు ప్రాణములు విడచె. వాని నుండి వెలుగు వచ్చి రామునిలో లీనమయ్యె. మంచి గంధములతో జటాయువుని దహనం చేసి కొంత వరకు విచారించి రామలక్ష్మణులు జనుచుండిరి. ఆ ఘోరారణ్యమున పోవుచుండ కబంధుడనే రాక్షసుడు తన రెండు చేతులతో రామలక్ష్మ

ఖుల బట్టి మ్రింగపోవుమండ రామచంద్రా ఆజ్ఞ ఇమ్ము వీనినిప్పుడే సంహరించెదం తమ్ముడా, నిరాయుధుణ్ణి వధింపరాదు అనుచున్నంతలో

మంజరి :- రామలక్ష్మణుల మ్రింగదలచిన
రాకాసిం గమనించి
కరవాలమ్మను దూసె లక్ష్మణుడు
కరఖండనంబు జేసె

వచనం :- రాముని మ్రింగబోవ లక్ష్మణుడు వామహస్తమును ఖండించె. లక్ష్మణుని మ్రింగబోవ దక్షణహస్తం రాముడు ఖండించె. రామబాణం శోకినంత రాక్షసుడు గంధర్వుడై రాముని ప్రార్థించె.

మ॥ కానబడి యెన్నియో వత్సరముల దరిగానలేక
బ్రతుకుచున్నాను నీచమయిన బ్రతుకు
నాడు ప్రహ్లాద నారద పరాశరాది దేవతలెల్ల
పూజించు దివ్యమూర్తి శాపవిముక్తి చేసె శ్రీరామమూర్తి

వచనం :- గంధర్వా! ఈ వికృతరూపం ఏమి? రఘుకులేంద్రా! దేవేంద్రసభలో యెల్లరు గానము చేయుచుండిరి. సభ వారెల్లరు సంతసించుచుండిరి. నేను నా సంగీత గానముతో యెల్లరును మెప్పించితిని. విద్యాగర్వంబున బృహస్పతి తల యూచి నన్ను గౌరవించలేదని పెద్దల నవమానించినందు వలన ఇంద్రుడు రాక్షసుడవు గమ్మని శపించె. అప్పటి నుండి దేవతలను, పతివ్రతలను, మహాఋషులను నానా హింసలు పెట్టుచుంటిని అది దేవతలు మొర పెట్టుకొనగా అంత ఇంద్రుడు వజ్రాయుధంబున శిరస్సును కొట్టె. ఆ శిరస్సు వక్షంబున దిగిపోయె ఆ కతమున కబంధుడనైతి. శిరము వక్షమున చేరుటచే తిరుగలేక ఒక్క చోటనే పడి వుంటిని స్వామీ! నాకాహారం ఏదయిన తినునట్లు మార్గం ప్రసాదింపుమని ఇంద్రుని వేడగా రెండామడల మేర ఏ ప్రాణినయినా పట్టుకొని నే భుజించునటుల దీర్ఘ బాహువులు ప్రసాదించె. ఏ ప్రాణి నయినా కదలిన, నడచిన వాటిని పట్టుకొని ఆకలి తీర్చుకొని బ్రతుకుచున్నాను. దేవా! నాకు శాప విమోచనం చెప్పుమని వేడగా, ఇంద్రుడు ఎప్పుడు రామలక్ష్మణులు నీ చేత చిక్కుదురో వారు నీ చేతులు ఖండించినంత నీకు శాపవిమోచనం తీరు. నీ వలన శాప విముక్తి కలిగె, మీకు శుభం కలుగు గాక! అనిన రామచంద్రుడు ఓ గంధర్వా! నీకు శుభం కలుగు గాక అని దీవించిరి. ఘోరారణ్యమున నుండి ఋష్యమూక పర్వతమునకు పోవు

సమయమున శబరి యను చెంచు కన్యను పెంచిన మతంగను మహాఋషి ఆశ్ర మము చేరుకొనిరి. వృద్ధురాలయిన శబరిని చూచి నిలచిన రామలక్ష్మణులకు శబరి ఇట్లు చెప్పదొడగె.

బిలహరి — ఆది

పల్లవి : పాలన సేయవయ్యా రామయ్యా

అనుపల్లవి: పాలన సేయవయ్యా రామయ్యా ॥పా॥
ఇంద్రనీలమణి భాషితమైన
నీ దివ్యరూపు కన నోచితిని ॥పా॥

చరణం : కామాదుల గెలచిన నీ కొరకు నిలచియుంటినిరా రఘురామా
అలకించి నా మొర అవనిజాత వీడి
వనుదెంచితివా ॥పా॥

వచనం .— అని ఈ విధంబున ప్రార్థించి. రామా జగదభిరామా యంతకాలము నకు వేంచేసితిరి స్వామీ! పూలబాటలు వేసి ఎదురుచూచుచున్న శబరి ఆదరింప రఘువల్లభుడు పూలబాటన నడవసాగె. పర్ణగద్దెపై కూర్చుండ నియమించి పూల పళ్ళెరమున రామపాదం కడిగి శిరప్రక్షాళణము చేసుకొని, పూలతో పూజించి. నమస్కరించిన ఆ వృద్ధతపసిని చూచి రాముడిలా అన్నాడు అమ్మా మీకు శుభం కలుగుగాక. నీ శుభ నామమేది. అమ్మా సతిని గోల్పోయిన నిర్భాగ్యుడను. దారి తెన్ను గానక వచ్చె నాకు మీ ఆదరణము లభించె. నా అర్ధాంగలక్ష్మి అయిన సీతను యెవరైనా ఎత్తుకపోవ చూచితివా. దశరథరామ నా పేరు శబరి. శబరి వనమున పుట్టిన కారణమున శబరి యందురు. నేను మతంగ మహా ఋషి శిష్యు రాలను. దశకంధరుడు.

ఉ॥ అవని జాతను సీతను ఆకాశమందు దివ్య
విమానమున ధీరుడగుచు గొనిపోవ
ఆ జలజాక్షి అంతులేని దుఃఖమున అలమటించె
రక్షణము సేయ జాలనైతి శ్రీరామచంద్రా

వచనం — "ఆహా" ఎంత చల్లని వార్త చెప్పితివి. రాతిని నాతిగా చేసిన రామా సీతామహాసాధ్వి జీవించియే యున్నది. విచారించకు ప్రభూ నీ కొరకు అనేక రక ముల ఫలములు మూడు పర్వతములుగ నీ కొరకు దాచితిని స్వామీ. ఆరగింపుడు

అమ్మా! శబరీ జానకి బ్రతికి వున్నదని చెప్పిన ఆ మాటకు నిజముగ బ్రతికిపోయితిని. నా మనసు శాంతింప చేసినివి.

మంజరి : స్వామి కైంకర్యమునకై ఫలముల తెచ్చి ఎదురుంచె
ఆ రామచంద్రుడు ఆ ఫలములారగించె

వచనం :- ఈ విధమున మూడు పర్వతములు మూడు బుట్టలుగ మారినవి. రెండు బుట్టల పండ్లు రాముడారగించె మూడవ బుట్టలో ఒక్క ఫలము తీసుకొనగానె అన్ని మాయమైపోయినవి. శ్రీరాముడు రెండు బుట్టలలో రెండు ఫలములు తిన్నాడు. మూడవ ఫలము తినబోవ అన్నయ్యా ఇప్పటికే శబరికి బొందితో వైకుంఠప్రాప్తి ప్రసాదించితివి. ఇక అరగించితిరేని ఆమెకు దాసులమగుదుము. కావున వుపసంహరింపుము అనగానె ఫలములు అదృశ్యమైపోయెను. అమ్మా శబరీ నీ తల్లిదండ్రులెవరు? దాశరథీ చెప్పెదను వినుము.

శాణుడనే ఒక బ్రాహ్మణోత్తముడు తీర్థయాత్రలు సేవించి ఈ మార్గమున పోవుచున్న తరుణములో యౌవవతియైన చెంచు కన్యను చూచి ఆమెకు పుత్రదానం చేసె.

ఉ॥ అడవి జాతియందు అవతరించిన గాని బ్రాహ్మణోత్తముడె
తన పతిగ కొలచుచు నన్ను ఒడసె శబరి పక్షుల చేత
నిలచిన మతంగ మహామునికి నన్నప్పగించి
తపమునకు చనె నా తల్లి శబరియని నామకరణము చేసి యుపదేశమిచ్చె

వచనం – శబరి పక్షులచేత పెంచబడితి ఐదవ ఏట శ్రీరామ తారకమంత్రాన్ని వుపదేశమిచ్చారు. మతంగ మహాఋషి అనాటి నుండి

సీ॥ కన్యప్రాయము నుండి అన్యమేదియు లేక
అలరుచున్నాను నీ నామస్మరణ చేత
జపతపములు ఎన్నియో చేసితి
నీ దర్శన భాగ్యంబు కొరకు
మారుతి వలన మీరాక తెలసి
పూలబాట వేసి ఎదురుచూచుచుంటి
ఫలము లెన్నియో రకముల చవిజూచి
దాచినాను నీ కొరకు దేవదేవ

గీ॥ నీ మంత్ర మహిమ వలన పుష్పములు వాడక
ఫలములు కుళ్ళిపోక మధుర రస జలములు
నిండి ఈ నాటికి నిలచియుండె అట్టి
నీ పాదపద్మములు లభించె అమలచరితా

వచనం :- అని పలికిన శ్రీరాముడు అమ్మా! నీకేమి వరము కావలయును. స్వామీ! శరీరముతో వైకుంఠప్రాప్తి ప్రసాదించు. అట్లె ఇచ్చితినిన్నాడు శ్రీరాముడు తక్షణమె పుష్పకవిమానం వచ్చి, రావణుని వధించి సీతమ్మను రక్షించు శ్రీరామ చంద్రా అని చెప్పి రామలక్ష్మణులకు నమస్కరించి శబరి పుష్పక విమానమెక్కి వైకుంఠము చేరుకొనియె. దేవతలు పూలవర్షం కురిపించిరి.

అంత రామలక్ష్మణులు ఋష్యమూక ప్రాంతమునకు చని పద్మ సరయు అను కొలను యందు స్నానము చేసి, జపతపము లాచరించి. ఋష్యమూక ప్రాంతమునకు పోవుచున్న సమయమున

మ॥ అరుణ కిరణములవలె సదమల మతులైన
సజ్జనులు, గుణనిధులు, ధీరవరులు, అతిబల
తేజో సంపన్నులు రాజమకుట కిరీటాలంకృతులు
కోదండపాణియైన వారెవ్వరో హనుమా నీ వెఱిగి రమ్మ

వచనం - ఋష్యమూక పర్వతమున హనుమంతుడు శ్రీరామ అను తారకము జపించుచుండె.

కాఫీ రాగం — ఆది తాళం

పల్లవి : తారక నామా - శ్రీరామా

అనుపల్లవి: దరిశనమీవా రఘురామా! ॥తా॥

చరణం : సతి భంగముగా చరియించినాడవని
నాధా దరిశన మిడుదువని ఇంతి ॥తా॥

వచనం - అని ప్రార్థించుచున్న తరిని సుగ్రీవుడు కోదండధారులై వచ్చుచున్న రామలక్ష్మణులను చూచి భయమంది పరువిడి వచ్చి హనుమతో ఇట్లనియె.

మంజరి : రామ తారకము జపియించెడి హనుమ కన్నులు తెరచి
నీ భయంబునకు కారణంబేమన రామలక్ష్మణుల చూపి

వచనం :– చూచిన తక్షణం వారి సౌందర్యములకు అబ్బురపడి, అంత హనుమంతుడు బాల బ్రాహ్మణ వేషధారియై పర్వతము చేర వచ్చెడు రామలక్ష్మణుల కెదురై నమస్కరించి

మః బాల రూప యౌవన ప్రాయులైన మీరలెవ్వరు?
మీ నివాసమ్మేట? నామమెయ్యది? ఎవరి
కారణముగ నిట కరుగుదెంచుచున్నారు
పలుకు వరకు ముందడుగు విడగరాదు

వచనం :– అంత శ్రీరామచంద్రుడు వాని జూచి

ఉః బాల బ్రాహ్మణ బ్రహ్మచారియగుచు
దాచినాడవు నీకు గల దివ్య రూపమెల్ల
తేనెలొల్కెడి పల్కులు పల్కెడి పండితుడవు
కవచ కర్ణ కుండలములు గలవాడవు నీవెవడవోయి

వచనం ;– అనిన అంజనాగర్భుడు

గీః కవచ కుండల కిరీట కౌపీన కాంతులు యెవని
కనుల బడునో అట్టి వీరవరుడె నా దైవము
ఇలవేల్పు వటంచు నెంచి
తలంచుచుంటి నరవరేణ్యా

వచనం ;– స్వామీ! మీ నామధేయము లేమి? అన్నాడు హనుమ. మేము దశరథరాజ నందనులము. నేను రాముడను, ఇతడు నా తమ్ముడు లక్ష్మణుడు సీతయను ధర్మపత్నితో తండ్రి యాజ్ఞానుసారము మేము వనవాసమొచ్చితిమి.

చక్రవాకం — ఏకతాళం

పల్లవి : హనుమంతుడ అనిల సుతుడ
మీ దాసుడనై జనించితి నీ ఇల ॥హ॥

అనుపల్లవి: దశరథ నందన మీ సేవకునై
నిలచి యున్నాను ఋష్యమూకమున

చరణం : రవి వంశోద్ధారక నిను వర్ణింపగ
ఎవ్వరంచు నే తలతును మదిలో ॥హ॥

చరణం : దేవుడవా, చతుర్ముఖుడవా
హరుడవో, శ్రీహరివో
ఎవరని నిన్ను వినుతి చేతురా
జానకీరమణ సందేహమాయె ॥హ॥

సీ॥ సరసిలో క్షీరాబ్ధి శయనుడై
సకల జీవుల గాచు సచ్చరిత్ర
నాభికమలంబున అవని సృష్టించెడి
నలువను గన్న నళిననేత్ర
సాధు మానస సీమలలో విహరింప
నరుడవై శ్రీరామ నామమునను
రఘువంశమున బుట్టి రమణి సీతను గొని
మహిని పితృవచనమున కాననకు వచ్చినావు

గీ॥ నిన్ను కొనియాడ నాకున్నె వాసి
పిచ్చి కోతిని నిన్ను వినుతింపగలనె
నన్ను ఆశీర్వదింపుమో ఇనకులాబ్ధి
సన్నుత గుణసాంద్ర శ్రీరామచంద్ర

వచనం :- రామచంద్రా! నా ఏలిక సుగ్రీవుడు ఈ ఋష్యమూకమున నున్నాడు.

మంజరి : రామలక్ష్మణులకు నమస్కరించి ప్రేమమీరా
ఋష్యమూకమున జేర్చి
అనిలము సాక్షిగ రామసుగ్రీవ మైత్రి వెంటనే జేసిరి

వచనం - రామభద్రా యని సుగ్రీవుడు వచ్చి, శ్రీరాముని శరణు శరణు అని వేడిన, రఘురాముడు సుగ్రీవా! నీ ఆర్తికి కారణమేమో తెలుపుమన, దాశరథీ! నా కభయమిచ్చు వరకు నా బాధ నిర్ణయింపజాల అన్నాడు సుగ్రీవుడు. అట్లయిన హనుమా! అగ్ని కల్పింపుము. అగ్ని సాక్షిగా సుగ్రీవా! నీ శత్రువులను జంపి నీకు కలిగిన బాధలు తీర్చెద అని రాముడు ప్రమాణపూర్తిగా అభయమిచ్చాడు, మీ కష్టములు తీర్చి నీ భార్యను మీ రాజ్యమును మీకు వచ్చునంతవరకు నేను

నా సైన్యముతో సహా సాయపడెదనని అగ్ని సాక్షిగా శ్రీరామచంద్రునకు సుగ్రీవుడు అభయమిచ్చాడు సూర్య తనయా నీకు కలిగిన ఆపదేమొ చెప్పుము.

రామభద్రా నా అన్న వాలిని వధించి నా రాజ్యమును, నా భార్య రుమను నాకొసంగుము, సీతాదేవి జాడల అరసి మీ రాజ్యం మీ సతి నిన్ను చేరు వరకు సహాయము చేసెద అన్నాడు సుగ్రీవుడు. అంత రాముడు సూర్య తనయా

గీ॥ ఏ కతమున నిన్ను జంప బూనె నీయన్న
బలము ధైర్యము గల మా అన్న వాలి
మహిసాకృతుడగు మాయావి వలన
వచ్చె వైరంబు మాకు కాపాడు నిందిరేశ

వచనం :- శ్రీరామచంద్రుడు, సుగ్రీవా! మీయన్న వాలికి, నీకు కలహమెట్లు వచ్చె? రామచంద్రా! చెప్పెద వినుము. ఒకనాడు మహిసాకృతి కలిగిన మాయావి యను రాక్షసుడు వచ్చి సమరమునకు రమ్మనియె అంత వాలి చని వానితో ఆరు మాసములు సమరము చేసిన పిదప, ఘోరారణ్యమున గుహలో చేరి సమరము చేయ, నేను అన్నకు ఆపద వచ్చునని నేను లోనికి పోబోవ, వాలి సుగ్రీవా! నీ వింటె నుండుము అని చనియె గుహనుండి నెత్తురు వచ్చుచున్న గని అన్న చచ్చె నని గుహకు పర్వతము అడ్డము పెట్టి వచ్చితిని. కానీ వాలి మాయావిని చంపి, కిష్కింధకు వచ్చి పట్టభద్రుడయిన నన్ను నేలబడవైచి చంపుచున్న అంజనేయుడు రక్షించి నన్ను ఈ ఋష్యమూకమున నుంచిరి. మా యన్న దీని మీదకు వచ్చె నేని శిరస్సు పగిలి చచ్చును. ఎలనన,

దుందుభియను రాకాసితో సమరము చేసి ఆ కళేబరమును కిష్కింధ నుండి కాలితో తన్నిన ఈ ఋష్యమూకమందు తపమాచరించు మాతంగ మునిపై రక్తము చింది పైబడియె. అంత ఈ కళేబరమును తన్నినవాడు ఈ పర్వతమును ఎక్కెనేని శిరము పగిలి చచ్చునని శపించె. కావున నేను యీ ఋష్యమూకమం దుండి మాయన్న ఎవరిని బంపి నన్ను చంపునో యని భయపడి మిమ్ములను గని హనుమ నంపితిని. నా రాజ్యమును, నా భార్య రుమను గొని నన్ను చంపెదనని బలుకుచుండుననిన, శ్రీరామచంద్రుడు భయపడకుము. నీ యన్న వాలిని జంపి నీకు రాజ్య పట్టాభిషేకం జరిపెద. నీ భార్య రుమను నీ కొసంగెద. శ్రీరామభద్రా శరణు శరణని వేడుకొనియె.

రామచంద్రా మా అన్న మహా బలశాలి. మీరు మా అన్నను చంపుతానని నాకు అభయమిచ్చారు. మీరు మా యన్నను చంపగలరో లేదో యని నాకు సందేహముగా నున్నది అనినంత రాముడు సుగ్రీవా నీ సందేహమేమొ తెలుపుము అన్నాడు రామచంద్రుడు.

రఘురామా! సప్తతాళ్ళను ఒకే బాణము చేత మీరు ఖండించినచో నా సందేహము తీరుతుంది. మీరు మా అన్నను చంపుతారని నేను నమ్ముతాను. శ్రీరాముడు సుగ్రీవా అట్లగుటకు కారణమేమి తెలుపుము, స్వామీ చెప్పెదను వినండి.

మాయన్న వాలికి తాటి ఫలములంటే ఇష్టం. అప్పుడప్పుడు తాటి ఫలాలను తెచ్చి ఒక గుహలో దాచుకునేవాడు. ఎక్కువ ఫలములయిన తరువాత ఒకేసారి మనసార తినాలని కోరిక. ఇలా రోజు ఫలము తెచ్చి దాచేవాడు, అవి ఏడు ఫలములయినవి. ఒక సర్పరాజు చూచి ఆ ఫలములను ఆరగించుచుండె, సుగ్రీవుడు ఇంకొన్ని ఫలములు చేర్చుకొనునంత వరకు ఆగలేక తాను తినాలని గుహలోనికి జనియె. ఆ సమయమున సర్పము తినుట చూచి మహా కోపదీప్తుడై నేను తినాలన్న ఫలములు నీ వలన విషసకులమైనది. కాబట్టి ఈ ఏడు ఫలములు ఏడు తాటి చెట్లుగ నీ వెన్ను పైన మొలుచుగాక అని శపించాడు. ఆ పాము గబ గబా అడవిలో పారిపోవు సమయములో గుహకు కొంత దూరమున దాని వెన్ను పైన ఏడు తాటిచెట్లు మొలిచెను. ఆ సర్పము మహా కోపముతో సుగ్రీవుని ఇట్లు శపించెను. ఈ ఏడు తాళ్ళను ఒకే బాణముచే త్రుంచిన వాడు నీకు మృత్యువు. ఆ కారణమున యీ సప్తతాళ్ళను ఒకే బాణముచే త్రుంచిన మీరు మా అన్నను చంపగలరని నమ్ముతాను. మా అన్న పైకి యుద్ధానికి వెళతాను. యీ శాపం వున్నది గనుక ప్రతి నిత్యం మాయన్న ఆ తాటిచెట్లను క్రిందికి వంచి ఫలములను తింటాడు. కాబట్టి ఇప్పుడు మీరు ఆ సప్తతాళ్ళను ఖండించాలి. అంత రామచంద్రుడు ఆ చెట్లు ఎక్కడున్నవో చూపించమని అడుగగా సుగ్రీవుడు చూపించాడు. శ్రీరామచంద్రుడు ఒక్క బాణంతో ఆ ఏడు తాళ్ళను త్రుంచాడు తాటిచెట్లు పాముతో సహా ఆకాశంలో గిరగిరా తిరుగుచున్నవి. రాముడు చూచి లక్ష్మణా ఇది ఏమిటి? అన్నాడు. అంత లక్ష్మణుడు అన్నయ్యా! మీ కుడికాలు బొటన వ్రేలితో నా పాదం పైన తుడిచినట్లయితే తాటి చెట్లు పడిపోతాయి. అలాగె అని శ్రీరామచంద్రుడు అలానె చేశాడు. తాటిచెట్లు పడిపోయినవి.

రావణుడు ఒక సతిని చెరబట్టి ఈ మూకము నుండి గగనంబున

పోవుచు, పైట చెరగున నగలు మూటగట్టి పారవైచె. అవి అంజనేయుని చేత బడినవి. ఇరువురము కలసి దానిని గృహాంతరాళమున భద్రపరచితిమి. నేను పర్ణశాల యందు లేని సమయమున ఎవరో నా సీతను యెవరో ఎత్తుకొని పోయిరి. వెదకుచూ ఇటు వచ్చితిమి. లక్ష్మణా! జానకి నగలేమో పరీక్షింతమా? రామచంద్రా ఇదిగో నగలమూట. రాముడు చూచి హా! సీతా! యని నివ్వెరపాటుతో నిలచిపోయె సీతాపతీ,

## తోడి రాగం — ఆది తాళం

పల్లవి : జానకి దివ్య ఆభరణములె అని దోచె నా మదికి

అనుపల్లవి: భూమిజాత అవునో కాదో యని
అనుమానము దోచె లక్ష్మణా ॥జా॥

చరణం : నిరతంబును పాదంబులు గొలిచెడి కతమున
అందెల గుర్తించితి క్షమించు మగ్రజా ॥జా॥

వచనం :- సీతను చూచిన విధంబున సంతసించు రఘురాముని జేరి, వాలిని చంపగల శౌర్యము కలిగిన రామా! సప్త తాళ్ళు ఖండించి, నా అనుమానం దీర్పుమన, సప్త తాళ్ళు ఏకాస్త్రమున ఖండించెదవేని సర్పరాజు వెన్నున నున్న తాళ్ళు నేలబడిన నాగేంద్రుడు సంతసించె. ఇంద్రుడు వాలికొసంగిన మణిమాల రాముని కొసంగిన వాలితో సుగ్రీవుడిట్లనియె.

గీ॥ నా సతి నాకిడి నన్ను రాజును చేయకున్న
దశరథరాజ సుతుడు సఖుడు గలడు
వాని వలన నీకు వచ్చును మృత్యువు
బ్రతుకదలచితివేని నా మాట వినుము

మంజరి : అతని కాపాడుకొనలేని నరుడు నను జంపననుచు
బలుక నీ నాలుక చీల్చి ప్రాణంబులు దీతునింకా

వచనం :- సమరము చేసి పిడిగ్రుద్దుల సుగ్రీవుడు నేలబడి హా! రామా! యని పిలచిన, సుగ్రీవా! మీరిరువురూ ఒకే రూపములో నున్నారు. గుర్తించలేనైతి. ఈ మణిమాల ధరించి పొమ్ము మీ యన్న బలము నీకే వచ్చును. పర్వతముల పెకిలించి వాలి, సుగ్రీవులు యుద్ధము చేసిరి. వృక్షములతో, గదలతో, తోకలతో

యుద్ధము చేసి, గోళ్ళతో చీల్చుకొనుచు మల్ల యుద్ధమున మార్కొనిరి. చెట్టుచాటున నుండి రాముడు జరమర శరమేయ వాలి నేలబడి హా రామా, రామాయని నేనేమి చేసితినని నన్ను వధించితివి. ఇప్పుడు సర్వము తెలిసితిని. అంగదుని యువరాజుని చేసి నన్ను నీలో చేర్చుకొనుము. సీతారామా నేనేమి తప్పు చేసితిని? నిష్కారణము గా వధించితివి. "వాలీ, క్షత్రియులు మృగముల వేటాడుట ధర్మం. అందున దుర్మార్గుల వధించుట న్యాయం.

అంత వాలి ఇలా అనియె. చెట్టుచాటున ఏల నిలచితివి. ధర్మవిరుద్ధం కాదా! ఎదుట నిలచిన' నీవు శరణు వేడుదువని, సుగ్రీవున కిచ్చిన మాట తప్పు నేమోయని చెట్టుచాటున నిలచితిని. "బ్రహ్మాండ నాయకా, నన్ను క్షమింపుము. అంతలో తార పతిపై బడి ఘోరముగా ఏడ్చి నా పతిని బ్రతికింపుమన అట్లె బ్రతి కించెద. "శ్రీరామా. ఈ పాపిజగత్తుతో నేను బ్రతికుండజాల. నన్ను నీలో చేర్చుకో శ్రీరామ, శ్రీరామ. సీతారామాయని జ్యోతి వెలుగుతూ వచ్చి శ్రీరామునిలో లీన మాయె. తార పతితో సహగమనమాయె.

ఉ॥ సూర్య తనయ సుగ్రీవు పట్టాభిషేక విశేషములను జరిపె
సూక్ష్మబుద్ధి లక్ష్మణుండు, అంగద, జాంబవంత
మాల్య గంధ మాదన నలనీల వికట దుర్ధర నీలు
అంజనా తనయుడు దక్క డెబ్బది యెల్వాల నంపె దిశల

వచనం :- అంగదుని యువరాజ పట్టాభిషేకం చేసి రుమతో కిష్కింధకు సుగ్రీవు పట్టాభిషేకం జరిపె లక్ష్మణుడు. ఆ సంతోషం విని రామచంద్రుడు సంతోషపడి జానకీదేవిని తలచుకొని రాముడు కన్నీరు కార్చుచున్న లక్ష్మణుడు ఓదార్చుచుండె. ఈ విధమున రామసుగ్రీవ మైత్రి పార్వతీదేవికి ముప్పదిమూడు కోట్ల దేవతలకు రామసుగ్రీవ మైత్రి చెప్పి అనుష్టానమునకు లేచిరి.

కల్యాణి — ఆది

మంగళం శ్రితజన - ఆశ్రిత వత్సలునకు
మంగళం నిత్యమంగళం
రాజీవ లోచనునకు రమ్యకథా చరితునకు
మంగళం నిత్యమంగళం
రామసుగ్రీవ మైత్రికి
మంగళం నిత్యమంగళం

ఓం తత్సత్ — ఓం తత్సత్ — ఓం తత్సత్
శుభం



శ్రీ రామ జయం

# శ్రీ అమృత రామాయణము

## పంచమ అధ్యాయము

## హనుమ సందేశము



శ్లో॥ నలుగుపిండిరాయుడు ఈశ్వర కుమారుడు
నిజపూజలందు ఘనుడు విఘ్నరాజవరుడు

శ్లో॥ వాణి నుత గీర్వాణి నిరత సద్గుణవేణి
సమస్త విద్యలరాణి బ్రహ్మజిహ్వా నివాసినీ

సారంగ — రూపకం

పల్లవి : సిద్ధి బుద్ధి పతి శ్రీ వినాయక శ్రితజనపోషక
అనుపల్లవి: నమ్మితినయ్య నా నోము ఫలింప సేయగదయ్య

చరణం : మూషిక వాహన మునిజన సేవిత
సరసమైన విద్యల సరగగూర్చు దొరవీవని ॥సి॥

పహిడి — ఆది

పల్లవి : సారసాక్షి కావవే సరగ మమ్ము బ్రోవవె ॥సా॥
అనుపల్లవి: అనవరతము నీ నామ స్మరణమే
ఆది వేద సంచారిణి దేవీ ॥సా॥

చరణం : అమృత మొలికెడి వీణ మీటుచు
అఖిల లోకములు రంజిల్ల జేయుచు
అఖిల విద్యలకు తల్లివై సారమెరిగి కాపాడగదే ॥సా॥

కం॥ రాజిల్లు రామనామం రాజిల్లు సుగుణధామం
రాజిల్లు సకల లోకములు రాజిల్లు జానకి మానస మెపుడున్

వచనం :- అంత పరమేశ్వరుడు సుందరకాండ చెప్పెద శ్రద్ధా భక్తులతో ఆలకింపుడని కైలాసమున ముప్పది ముక్కోటి దేవతలకు గౌరీదేవితో సుందరకాండ చెప్పుచుండె.

శ్రీరామమూర్తి బాధపడుచున్న సుగ్రీవుడు హనుమను లంకకంపుమన

గీ॥ కపి వీరులందు కనులు మూసి
రామధ్యానంబు చేసెడి అనిలపుత్రు
రామచంద్రుడు జానకి సేమమరసి
రమ్మటంచు అంజనేయు బిలచె

మంజరి :- అన్నా హనుమ నీవు లంకకేగి
సీత జాడలరసి రమ్మ
నిఖిల పావని జానకిదేవి
సేమంబులు దెలుపుము

కం॥ సరసిజ గర్భ రవికుల సార్వభౌమ అనుపవే
మీ ఆశీర్వాదమున రిక్త హస్తుడనై రాను రామచంద్రా

వచనం :- అని సకల భూత సముదాయంబుల తన బొజ్జ నింపుకొన్న జగత్పావనుడగు శ్రీరామచంద్ర పాదారవింద, వందనాభిలాషియగు రామభక్తశిఖామణియైన అంజనాసుతుడగు ఆంజనేయుడు, అంగద, జాంబవంత, నల, నీల, వికట దుర్దర, గంధమాధనాది వీరుల నడుమ నిలచిన అంజనేయుని పిలచి, "హనుమా! నీవు సీతను కనుగొనునపుడు నీకు గుర్తుగా చెప్పెద.

చీకటిలోనయిన వెన్నెలవలె ప్రకాశించును. ముప్పది మూడు కోట్ల దేవతలలో సీతతో సమానమైన స్త్రీ యెందునా లేదు. ఆమెకు కొన్ని గుర్తులు చెప్పినా ఆనవాలుగా ఈ రామముద్రిక ఇచ్చితివేని సీత తప్పక నిన్ను గుర్తించును అని రాముని వ్రేలి వుంగరము అంజనేయున కొసంగిన కనుల కద్దుకొని సిరములో నుంచుకొని కన్నీరు రాల్చుచున్న శ్రీరామునితో నిట్లనియె.

గీ॥ అరి మర్దన దైత్యవిరామ - కోటి సూర్య
సమప్రకాశ కల్యాణరామ
దీర గంభీర హృదయ వినీల రామ ఘోర దుఃఖ
విదూరుడై చరించుమయ్య రామయ్య తండ్రీ

వచనం - అని చెప్పి కరివీరుల గూడి దక్షిణాభిముఖుడై దక్షిణ పదారణ్యము లో గుహలు, నదులు తొఱ్ఱలు, చెట్టు మొదళ్ళు, ఒక ఆకును రెండు వైపులా జూచుచూ, పొదలలో వెదుకుచూ, పాంధుల నడుగుచూ, పక్షుల గూళ్ళను వెదుకు చూ ఆశ్రమ వాసుల నడుగుచూ ఆకశమున యాభై ఆమడల వరకు ఎగిరి నలు దిశల కలయ జూచుచూ నేలకు పర్వత శిఖరముల నిలచి నేల నలుదిశల జూచి, కోయ గూడెముల, చెంచు గూడెముల. అడవి మనుష్యులచే క్రిక్కిరిసి చీమకయినా జొరబడని సందులేని భీకర మృగ గంభీర ఘర్జన ఘోర స్వానంబుల వాయు చలనంబునకు అసాధ్యంబయిన కీకారణ్యముల. రాయి, రవళి ధ్వనుల చేతకీ పట్ట ణంబుల పల్లెల వెతకి మహాటవీ ప్రవేశంబై, జానకీదేవి జాడ గానక మొగంబులు వెలవెల బార, దాహ పీడితులై అంజనేయుని గూడి వెదకి ఎచ్చట జలంబులు గానక రాముడు మమ్ముల జంప పంపెనా యని రామ భజన చేయుచు పర్వత శిఖరముల నెక్కి నలుదిశల చూచి అంజనేయుడు దిగివచ్చి అచటకు రెండు. ఆమడల దూరమున భూరంధ్రమ్ములో జల విహంగములు పోవుచున్న దిశ రండు పోదము రండని రాముని ధ్యానించుచు జనిరి,

సీ॥ దశరథుడు పుత్రకామేష్ఠి యాగంబు ఏల చేసె
వ్రతము ఫలించి పాయసము ఏల ఇచ్చె
ఇచ్చెపొ వారేల గర్భముల్ ధరించినారు
నలువురు సుతులు వీరులై జనించనేల
జన్మించెబో విశ్వామిత్రుడు యాగరక్షణార్థం
తన వెంట బంపి తాటకి గూల్పింపనేల
గూల్చెబో వీర ధనుర్భంగము గావించి
సీతను పెండ్లాడనేల
అడెబొ రామ పట్టాభిషేకము మాన్పగ
కైక వరంబు లడగనేల

గీ॥ అడిగెబో, రాముడు వనవాస మేగనేల
పోయెబో రాముడు ఋష్యమూకం చేరనేల
చేరెబో వానరుల ఆశ్రయింపనేల
సుగ్రీవ అనుజ్ఞను మేమిట్లు బావనేల

వచనం – అని వానరులు ఇట్లు ఆయాసపడుచూ ఆ భూరంధ్రములో ఎట్లు జొరబడవలెనాయని యోచించుచుండిరి,

మంజరి :- భూరంధ్రంబు జేరి నమనస్క యోగులవలె చనిరి
వెయ్యి ఆమడమీర చీకటేకాని వెలుగును
గానక పోయిరి తపించినారు వానర వీరవరులు

వచనం :- తుదకు భూరంధ్రంబు వెయ్యి యోజనంబులు జనుచున్న ఒక్కచోట అగ్నివలె మండుచు మరియొక చోట నరములు బిగబట్టుచు ఒకచోట వర్షములు కురియుచు ఒకచోట గొంతు వరకు లోతు నీళ్ళల్లో అగాథమైన జలపాతంబున పోవుచు కొంత దూరంబున నమనస్కుల యోగులవలె పూపిరాడక బిగబట్టుకొని పోవుచు మరి కొంత దూరమున అంధకార బంధురం, కన్ను లగుపడక, వానర శ్రేష్ఠులారా, ఇక మన ప్రాణముల మీద ఆశలేదు ఆ శ్రీరామచంద్రుడు మనల బావబంపించెనా అనుచు అంగద, జాంబవంతులు అనుకొనుచున్నారు.

నిరాశతో వెయ్యి ఆమడల భూరంధ్రము దాటిన వెలుగు అగుపడియె అందరూ పైకి వచ్చేశారు. అనేక ఫలవృక్షములతో నిండిన తోటలో కోనేర్లు, బంగారు మిద్దెలు, మేడలతో వున్న ఆ ప్రదేశమును గాంచి సంతసించి, ఫలము లారగించి, నీరములు గ్రోలి విశ్రమింప సువర్ణ మేడలో స్వయంప్రభ అను అమర కన్య, కిన్నెర చేతబూని

మోహన — ఆది

పల్లవి : తారక నామునిని - దరిశనము గోరి
అనుపల్లవి: తపమొనర్చెడి - దాసురాలనే ॥తా॥

చరణం : రఘురాముని - తండ్రిగా తలచి
జానకీదేవిని - మాతగా తలచి
విసిగి వేసారితి - కావరావేల శ్రీరఘురామ ॥తా॥

వచనం :- స్వయంప్రభను చూచి సీతాదేవియని భ్రమించిరి.

మంజరి :- రావణు చెరలో జానకీదేవి రాముని నెడబాసి
రాళ్ళు కరుగ ఏడ్చెదేల? జనకజరాజ సుకుమారి

వచనం :- నమస్కరించి కపి వీరుల గాంచి

గీ॥ సీతకు కూతురుగాని సీతగాను
రాముడు నా తండ్రిగాని నే రాణి గాను
కలుష విదూరుల కపిసేన గనినంత
రాముని దరిశింప నగునని నలువ బలికె

వచనం :- రామభక్తులారా, శ్రీరామమూర్తి ఋష్యమూక మందున్నాడు. కాని సీత జాడ తెలుపుమనిన తెలిపి ఉదయాద్రికి, హస్తాద్రికి త్రోవ గలదు. లంకకు సిద్ధపురికి తోవ గలదు. ఈ సముద్ర మధ్య స్థంభంబున మనముంటిమి. రామ భక్తులారా, నేను శ్రీరామ దరిశనమునకు పోయెద. అమ్మా, మా గతి యేమి? అన్నలారా, మీరందరూ కన్నులు మూసుకొనుడు. కనులు మూసుకొని రాముని భజించు వానరుల పర్వత శిఖరంబున నిలిపి స్వయంప్రభ రామ దరిశనమునకు జనిన సంపాతి రామభక్తుల గని నపక్షుడై సీతాదేవి జాడ తెలిపి ఋష్యమూకకు జనిన వానరులు భూమి దూరం బయినందులకు వగచి రామభజన చేసిరి. వానరులు సముద్రం ఒడ్డున చేరి రామభజన చేయు హనుమను మరచి

## కల్యాణి — ఆది

పల్లవి : ముప్పది యోజనము నే దాటెదన్

అనుపల్లవి: అపై కాదనె వికటుండు
నలుబది యామడ నే దాటెదను
అపై కాదనె దుర్ధరుండు
ఏబది యామడ నే దాటెదన్
అపై కాదనె గంధమాదనుడు
అరువది యామడ నే దాటెదను
అపై కాదనె నీలుండు
వెలగి డెబ్బది యామడ నే దాటెదను
అపై కాదనె నలుడు

యెనబది యామడ నే దాటెదను
అపై కాదనె ప్లవంగుడు
తొంబది యామడ నే దాటెదను
అపై కాదనె జాంబవంతుడు
శత యోజనములు నే దాటెదను
కానీ మరలి రాను నేనొక కారణమున నంగదుండు

వచనం .- అని కపి వీరులందరు వారి వారి శక్తులను చెప్పుకొని అయ్యయ్యో శ్రీరాముని కార్యము సాధించగలవాడు మనలో ఒక్కడయినా లేడే! తాతా జాంబవంతా నూరామడల సముద్రం దాటి జానకీదేవి జాడలను గొనివత్తును. నేను బ్రతికి వచ్చుట అబద్ధము. ఏ కారణమున నీవు తిరిగి రాజాలవో మాకు చెప్పుము. రావణుని కుమారుడు అక్షయుడు, నా తండ్రి వాలి రావణాసురు లిద్దరూ ప్రాణ స్నేహితులు. నేను అక్షయుడు శుక్రచార్యుని వద్దనే విద్య నేర్చుకుంటున్నాము. కోతియని నన్ను వెక్కిరించినందున అక్షయుని చావగొట్టితిని. ప్రతి నిత్యమూ ఇరువురము కొట్టుకొనుచుంటిమి. ఒకనాడు నేను కొట్టుచున్న సమయంలో శుక్ర చార్యులు చూచి, అంగదా, ఏమి దౌర్జన్యం అక్షయునిమీద చేయివేశావంటె నీ తల వేయి వ్రక్కలయి పోతాదని శపించాడు. ఆ కారణంబున నేను లంక చేరినను మరలిరాను అని చెప్పి తాతా జాంబవంతా, రాముని కుపకారం చేయని నా బ్రతు కేల? ఈ కొండరాయికి నా తల బాదుకొని ప్రాణములు విడిచెద అని పోబోవ జాంబవంతుడు నివారించె. మనమందరము దర్భాసనమును పరచుకొని ప్రాణాలు విడుస్తామని తక్కిన వానరులంతా అన్నారు. అప్పుడు జాంబవంతుడు ఓ వానర శ్రేష్ఠులారా! అంత దారుణమేల అని తిరిగి చూచేవరకు పలుకక నిలిచి రామ తారకము జపించే హనుమను జూచి జాంబవంతుడేగి

మంజరి :- వీర హనుమ ఇట్లు ఊరకున్న కారణము తెలుపవేమి?
మహా వీరుడవై పిరికివై ఇట్లూరకున్నా వదేమి?

గీ॥ భజన చేసెడి పవన తనయ అఖిల
విక్రమ ధురీణ వీరాంజనేయ, రాముడు
నిన్నేల మెచ్చె? వుంగరమేల ఇచ్చె
కడలి దాటిపోయి లంక జూచి కదలి రమ్ము

వచనం :- అంజనేయా ఈ నూరామడల సముద్రం దాటగల సమర్థుడవు నీ

ఒక్కండవె. కామరూపివి. తాతా జాంబవంతా నా కంతటి శక్తి కలదా! ఒహొ సూర్యుని ఫలమని మ్రింగబోయిన మహా వీరుడవు. నీ బలము నీకు తెలియచెప్పెద వినుము అనిన అంజనేయుడు రామ తారకము జపించుచు కూర్చొని వినుచుండె. అంత వానరులెల్లరు తాతా జాంబవంతా ఈ అంజనేయుని తల్లిదండ్రులెవరు? ఈ మహాత్ముడు అంతటి మహా వీరుడా అని అడిగిన వానర శ్రేష్ఠులతో ఓ వానరులారా ఆ మహా వీరుని చరిత్ర పొగడ వేయి శిరములు గల శేషుని కూడా తరము కాదు చెప్పెద వినుడు. పరమేశ్వరుడు పార్వతికి చెప్పుచుండె శుక మహాఋషి శౌనకాదులకు చెప్పుచుండె. ఆ జాంబవంతుడు వానరులకు ఇట్లు చెప్పుచుండెను. బ్రహ్మ కన్నుమూసి తెరచి హా! అని ఆవలించాడు. ఆ ఆవలింతలో ఒక కోతి జనించినది. బ్రహ్మకు నమస్కరించి స్వామీ నన్నేల గంటివి? చెప్పుమనియె. నాయనా మహా ఋషుల బాధించే రాక్షసుల చంపుచూ ఈ ఘోరారణ్యముల నివసించు అన్నాడు బ్రహ్మ. నాన్నగారూ నా పేరేమి? వృక్షవ్రజుడని నామకరణం చేసితిని. అంత తండ్రికి నమస్కరించి అడవికి పోయె.

**మంజరి :-** కైలాసంబున నుండి పార్వతి పరమేశ్వరులు వచ్చి
కొలనులో స్నానము సలుపగ వచ్చి గంధర్వుని చూచి
స్నానమాడ వచ్చిన మమ్ము సావకాశము లేక
చేసితివి గాన ఈ కొలను లోన స్నానమాడిన వారు
స్త్రీలగుదురని శపింప

**వచనం :-** పార్వతీపరమేశ్వరులు స్నానమాడ వచ్చిరి. ఆ సమయమున గంధర్వుడు జలక్రీడలాడుచుండె. మహా కోపంబున పార్వతీదేవి యీ కొలనులో ఎవరు స్నానమాడుదురో వారు స్త్రీలై పోవుదురని శపించి వెళ్ళిపోయిరి.

ఆ శాపం వృక్షవ్రజునికి తెలియక రాక్షసుల సంహరించి, అందులో స్నానమాడె.

**ఉ॥** మునిగి లేచిన మురిపించు సుందరియై నిలచె
వృక్షవ్రజుండు ఒడ్డున జేరి తన వింత రూపంబు
జూచి ఇది ఏమి వింత యనుచు యోచించుకొ
నుచు కొలను గట్టున నిలచె పుష్పలతల నడుమ

**వచనం .-** ఏమియు తోచక తండ్రి సన్నిధానమునకు వచ్చి, నాకీ రూపమేమి

యని అడిగెను. నాయనా! విచారించకుము. నీ కిరువురు కుమారులు జన్మించిన వెంటనే శాపవిమోచనమగును. ఇది బౌరాణి ఇచ్చిన శాపం. ఆ కొలను చెంతనే నివసించుచున్నది. జలగంధి యను నామముచే తిరుగుతున్న సమయములో ఆకసమున ఇంద్రుడు ఐరావతం మీద పోవుచు సౌందర్యవతి యైన ఆ కొలను గట్టున నున్న సుందరాంగిని చూచి, మనసు చలించినంత, కలితమై ఆ సుందరాంగి శిరస్సున బడియె. అదే సమయమున సూర్యుడు చూచి, ఆ కన్య సౌందర్యమునకు ముగ్ధుడై

ఉ॥ వనమోహినియై చరించు వనితను గని
తన కిరణముల నామెపై ప్రసరింపజేయ
గ్రీవమున బడియె నామెకు అంత నా సతి
తొమ్మిది ఘడియలలో గర్భము ధరియించి ఇరువురు
సుతుల గనియె జలగంధి శాపంబు దీరె

వచనం :- తన కుమారులను తెలుసు. స్త్రీ రూపములో తనకు కలిగిన కుమారులని అతి గారాబమున పెంచుతున్నాడు. తండ్రి బ్రహ్మదేవుని వద్దకు గొనివచ్చి శుక్రాచార్యునివద్ద విద్యాభ్యాసము నొనరించితిని. వీరి నామకరణము చేసి ఎచ్చోట నివసించిన మేలగునో చెప్పుడనిన అంత బ్రహ్మ ఇంద్రుని వలన తలమీద పడిన కారణమున బాలి అంటారు సంస్కృతములో. బాలి అని నామకరణం చేశారు, సూర్యుని వలన గ్రీవమున పడినది గనుక, కుడి భుజము గ్రీవ మందురు గాన సుగ్రీవుడు అని నామకరణం చేశారు. తార నొసగి వాలికి వివాహం చేసి, రుమ నొసగి సుగ్రీవునకు వివాహం చేసి ఋష్యమూక ప్రాంతమున నున్న కిష్కింధకు పెద్దవాడైన వాలికి పట్టాభిషేకం చేశారు. వాలి, రావణాసురుడు స్నేహితులు. ఒకనాడు వాలితో పోరాడ మహాకృతి గల రాక్షసుడు వచ్చి యుద్ధానికి రమ్మన్నాడు. ఇద్దరూ యుద్ధం చేసి ఒక గుహలో జొరబడి యుద్ధం చేయసాగిరి. అన్న వెంట జనిన సుగ్రీవుని నీ వేల పొమ్మనియె. సుగ్రీవుడు గుహ వెలుపల నిలచి యున్నాడు. ఈ విధమున అరు మాసములు సమరము జరిగినది. గుహ నుండి రక్తము ప్రవహించె. అది గని అన్న చచ్చెనని, రాక్షసుడు తన్ను జంపునేమో యని గొప్ప పర్వతము ఆ గుహ ద్వారమునకు అడ్డు పెట్టి కిష్కింధలో ఈ విషయము చెప్పిన సుగ్రీవునకు పట్టాభిషేకం చేశారు. వాలి నన్ను చంపదలచి ఇట్లు చేసెనని కోపమున తమ్ముని సింహాసనం నుండి నేల బడవైచి సంహరింప బోవ మంత్రి అంజనేయుడడ్డుకొని. ఋష్యమూక పర్వతమున సుగ్రీవుని కాపాడుచుండె

ఆ కారణమున వాలిని శ్రీరాముడు సంహరింప గలిగె, అంగదునకు యువరాజ పట్టాభిషేకం చేయుమని వాలి ప్రాణములు విడచె.

ఈ॥ కదలిన జగమెల్ల కదలి యాడు
తొక్కిన భువనములెల్ల అట్టగట్టు
ఊదిన జగమెల్ల తుంపరై నేలరాలు
నిక్కిన ఆకాశము ఫాలమున కంటుకొనును
గ్రుద్దిన జగమెల్ల పాతాళమందు జేరు

వచనం :- ఇంతటి బలశాలివే అని చెప్పగానే దేహము పులకించి శరీరము పెంచి విశ్వరూపము ధరించి తాతా జాంబవంతా నా బలము నేనెఱింగితిని. గోవు పాదమువలె సముద్రము దాటి సీతమ్మ జాడలు గొనివచ్చెద. మీరెల్లరు శ్రీ రాముని భజించుచుండుడు అని విశ్వరూపమున ప్రపంచ మంతయు చూచి సూక్ష్మరూపు ధరించి

గీ॥ రాముడె రక్షకుడు రాముడె మనల గాచు
రక్షామణియై, రాముడే తల్లియు, తండ్రియు
గురువు, దైవము ఆ రామభజన
మరువబోకు అనఘులె మీరున్

వచనం :- అని, జై, శ్రీరామచంద్రమూర్తికి జై అని ఆకాశానికి ఎగసి అని ఆంజనేయుడు వాయువేగ మనోవేగముల చేత సముద్రము దాటుచుండె అంజనా గర్భుడు.

కనకాచలంబు ఓలె మేనున్ బెంచి నూరామడల సముద్రంబు దాటుచూ శ్రీరామ, జయరామ సీతారామా యనుచూ నూరామడల సముద్రంబు దాటుచూ రమణి సీత దరిశనమును మది దలంచుచు.

గీ॥ సురసయన జలమొసలి హనుమ
రాక జూచి దేవతలు నను
పరీక్షింప బంపినారు
మారుతి బలచలంబులు పరీక్షింతుగాక

వచనం :- నిజ పరీక్షార్థమై దేవతలు పంపిన ఆదిశక్తి మొసలి రూపమున నిలచె

గీ॥ సీత జాడలు దెమ్మంచు శీఘ్రముగాను
రామచంద్రుడు నన్నంపె
రమణి మిన్న సరసమున కిది
సమయంబు గాదు మార్గమిడవె వేడుకొందు

మంజరి :– బలము కలదేని నను జయించి కదలి పొమ్మావూ
నను గెలువ లేకున్న రామకార్య మెట్లు నిర్వహింతవీవూ

వచనం :– ఓహో అంతటి పరాక్రమమా చూచెద కాచుకొమ్ము.

సీ॥ వనిత నోరు దరచె పదివేల
యామడల మేర
హనుమ దేహము పెంచె
ఇరువది వేల యామడలుగ
ముప్పది వేల యామడ ముదిత
నోరు దెరచె
పవన కుమారుడు నలుబది
వేల యామడలు

గీ॥ డెబ్బది వేల యామడ మేను పెంచె రామభక్తుడు హనుమ
తొంబది వేల యామడలు నాతి బె.చె
అదియు ఇదియు కాదని సూక్ష్మ రూపమున
నోటజొచ్చి గర్భము చీల్చి వెడలివచ్చె

వచనం :– హనుమ పరాక్రమమునకు అబ్బురపడి మారుతీ, నేను దాక్షాయణిని నీ బలము పరీక్షింప దేవతలు పంపగా వచ్చితి. నీకు శుభంబగుగాక అని చెప్పి వెడలిపోయె. అంత అంజనేయుడు పోవుచున్న సింహికయను ఛాయాగ్రహంబు హనుమఛాయ (నీడ) పడిన వెంటనే ఆపెన్ కడలి (సుడి) తనలో కీడ్చుకొనియె. ఆకసము నుండి పోయెడి ఏ ప్రాణమునైనా ఆ నీడ ఆ సుడి మీద పడగానె. ఆ నీడను బట్టి లాగేస్తుంది. హనుమను లాగేవరకు రామా రామాయని సుడిలో గిరగిర తిరిగిపోవుచు తన బలమున ఆగ్రహంబున సంహరించి దానివలన ఎవరికి ఏ ప్రమాదము లేకుండ చేసి పోయె మైనాయక పర్వతరాజు హనుమా! నా అతిథ్యమును గొనుమన కేల నంటి మరలి వచ్చునప్పుడు వత్తునని పలికి పోవుచున్న

అంజనాపుత్రుని వేగమునకు నదులు, పర్వతంబులు, పట్టణంబులు, చెట్లు, జలచరంబులు, నరమృగ పక్షితృణంబులు, సకలవస్తుజాలంబులు ఆ వేగంబునకు ఇవి అన్నియు ఆకాశంబునకు తనతోపాటు ఆకాశంబుపోయి మరల నేలకు రాలుచుండె.

ఈ విధంబున ఆయాసంబధికంబై నేత్రంబులు యఱ్ఱబడిన కారణంబున కనుదామరల నుండి వచ్చెడి వేడిమికి సముద్రము ఇంకి సముద్ర మధ్యమున కల జలజంతువులు సమస్త లోకములు మాడి మసి అయిపోవుట జూచి రెండవ రుద్రుడోయన నొప్పు ఆ వాయుకుమారుడు నా కతంబున లోకంబులు నశించునని తలంచి సముద్రము జూచుచున్న తెల్ల ముత్యములు యఱ్ఱగా - తన భృగు మధ్యభాగమున నిలిపిన శ్రీరామ మంగళ రూపము శ్యామల వర్ణము శోకి వజ్రములు ఇంద్రనీలమణుల వలె ప్రకాశించె.

హనుమ దేహము సువర్ణకాంతులు కలదగుటచే సముద్రము, అందు గల ప్రతి ఒక్క వస్తువులు జలచరములు బంగారు సముద్రము వలె అగుపడుచుండె. వజ్ర వైఢూర్య, గోమేదిక, మరకత మాణిక్య కాంతులు సూర్య రశ్మికి తనపై బడుటచే కోటి సూర్య ప్రకాశమై వెలుగుచుండె.

కర్ణకుండలము సూర్యచంద్రులవలె తోచె. ప్రపంచమంతా హనుమడె ఈ ప్రతిభ సర్వమూ శ్రీరామ తారకమంత్ర ప్రభావమున ఇంతటి సాహసుడయ్యెనని తెలుసుకొని దేవతలు పూలవాన కురిసి దేవ దుందుభులు మ్రోగె. తానే జగమంత నిండియుండుట గాంచి అప్పుడు మారుతి సూక్ష్మరూపము ధరించి జై శ్రీరామచంద్రమూర్తికి జై సీతామాతకు జై అని నూరు ఆమడల సముద్రముదాటి సువేలాద్రి పర్వతమున నిలచె.

లంక చూచి, ఆహా! కాంచన మణిమయ గోపురంబుల తానొప్పారు రావణ రాజధాని యని.

కాఫి — ఆది

పల్లవి : దాటితి నీ దయవలన కడలి
చేరెద నదెట్లు లంక ॥దా॥

అనుపల్లవి: చెలువ జానకీమాత చేరబోదునిట్లు
నేను దనుజుల దప్పించుకొను దారి తోచదె ॥దా॥

చరణం : అడ్డు వచ్చు రాక్షసులను హతమార్చి పోయెద
నే చెప్పెద వినకున్న వారి చమడాలూడ్చెద పూడ్చెద ॥దా॥

వచనం :- సూక్ష్మరూపము ధరించి సంధ్యాసమయ మగుటచే సింహద్వారము జొచ్చె. అంత కోట కావలి, లంఖిణి ఆ కోతి పిల్లను చూచి అగు మనగానె నొదిగి.

ఖండగతి — బిలహరి

పల్లవి : లంకలో బోవ నెంచితివా కోతి
అనుపల్లవి: పంక మూడ్చెద నిన్ను పోపో మరిలి
హొంకముగల రావణుని కోట కావలిని నేను
కొనవూపిరితో నున్న కోతి నీవు వేరుదువా నీవు

చరణం : రాముడనగ నెవ్వడని రమణీ
నీవు ప్రేలెదవు శ్రీరామ భక్తుడ హనుమంతుడను నీ అంతు చూచెద

గీ॥ కారులాడుచున్న కపటి
రావణుని సేవకా జనములు చేరి చేరి
చెప్పు మాటలు విని చేర విభుని దలచి
ఏడ్చుచున్న త్రిజట ఇంతి బలికి

వచనం :- అమ్మా! రాక్షసులెల్లా జనిరి. ఇదే సమయము కలలో ఒక కోతి వచ్చి లంకలో రాక్షసుల జంపి లంక కాల్చి, రామముద్రిక మీకిచ్చి. శ్రీరాముని క్షేమములు జెప్పి. మా పెద్దనాయన రావణునికి బుద్ధిజెప్పి, ఆనవాలు శిరోమణిని గొనిపోయి. రామలక్ష్మణులతో, కోతిమూకతో వచ్చి లంక నశింపజేసె.

నా తండ్రి విభీషణుడు లంకకు పట్టభద్రుడయ్యె నిన్ను గొనిపోయి రామచంద్రులవారు అయోధ్యకు పట్టభద్రుడయ్యె అని చెప్పె త్రిజట. అంత జానకీదేవి కన్నీరు రాల్చి నాకు అంత భాగ్యమా! నా యడమ కన్నదరె. యడమ భుజమదరె. శుభ శకునములు దోచె నని కన్నీరు రాల్చె. త్రిజట ఓదార్చుచున్న సమయమున. రజస్వల స్నానమయిన నాల్గవనాడు మండోదరి మధ్యాహ్న సమయమున నిదురపోవుచుండె. నిదుర నుండి దిగ్గున లేచి, రావణుని దరి జేరి నా కలలో శ్రీరామచంద్రుడు వచ్చి లంకంతా పుత్రమిత్ర కళత్రాదులతో కూల్చిపోయె అని తన కల చెప్పినంత. కోమలీ! కలయా! నిజమనుకొంటివే అని వెకిలిగా నవ్వె.

అదే సమయమున కుంభకర్ణుని భార్య వజ్రజ్వాల, గాడిద మీద, మొసలి మీద రక్తవస్త్రములతో దక్షిణదిశ మీరు మీ పరివారము పోవుచున్నట్లు కలవచ్చె అని కుంభకర్ణునికి చెప్పె. రఘురామునితో వైరము, ఎవరు? చెప్పగలరు అన్నాడు కుంభకర్ణుడు. సులోచన ఇంద్రజిత్తును చేరి, చెప్పలేను స్వామీ! అని ఘొల్లున ఏడ్చి మీ శిరస్సు తెగి పడినట్లు ఘొల్లుమన్నది. అంత మేఘనాధుడు నీ పిచ్చి కాని నన్నెదుర్కొనువారు ఈ జగాన ఎవ్వరూ లేరు అన్నాడు. అదే సమయమున విభీషణుని భార్య సరమ, దావగార్లు, మంత్రులు, పరివారము నూనె వస్త్రాలు కట్టుకొని, పందులు, దున్నపోతులమీద ఎక్కి దక్షిణదిశగా పోతున్నారు. మీరు తెల్ల ఏనుగు మీద ఎక్కి వూరేగి లంకా రాజ్యానికి పట్టాభిషేకం చేశారు. ఈ విధంగా కలగన్నాను అని సరమ చెప్పింది. సీతా రాములను ఎడబాటు చేసిన పాపము కట్టికుడుపకుండునా? రామా! సీతారామా! నిట్టూర్పులు విడచె.

మః సరసిజనాభు పదంబుల గొల్చెదు
నా యెడన్ కరుణించి దయామయుండైన
నా పతి నను గావకుండునా యనెదు
ధైర్య సంపద బ్రతికించె నేడు

వచనం :- అనుకొనునంత ఈ విధమున లంకలో మహారాణులు దుస్స్వప్న దోషములు చెప్పుకొనుచుండిరి.

ooo ooo ooo

అంతలో లంఖిణి చిన్న కోతి కదా! నన్నేమి చేయును.

మంజరి ; సూక్ష్మరూపమున నున్న మారుతిని
చేతబట్టి విసరె లంఖిణి
నెత్తిమీదకు ఎక్కి కూర్చొని
దేహమెల్ల తెగబ్రాకె
సరసమా నాతోడ శరీరమెల్ల గరచె పాడు కోతి
యని నేలబడవైవ ఫక్కున హనుమ నవ్వె.

వచనం :- శరీరం పెంచి తోకతో గొట్టిన బోరగిలబడియె. ఒక పిడిగ్రుద్దునకు నెత్తురు గ్రక్కి, ఓ నరాధమా! నేను కోట కావలి లంఖిణిని నన్ను గెలువ బ్రహ్మాదులకు తరము కాదు. నేను రామ దూతను హనుమంతుడను, ఒక తన్ను తన్నె

వరకు ఆయుధములతో లంఖిణి గొట్టె. గెలువలేక మూర్ఛబడి లేచి, మారుతీ! నీవా! నీవు వచ్చువరకే నేను ఈ లంకలో వుండుట. నేను గంధర్వ కన్యను. నీ వలన శాపము దీరె నేనిక పోయెద. లంకలోనే వున్నది సీత నీవు లంకలో ప్రవేశించునపుడు ఎడమ పాదము పెట్టుము. నీకు శుభము కలుగుతుందని నిజ రూపముతో గంధర్వకన్య తన లోకమునకు వెళ్ళిపోయినది.

ద్విపద : లంఖిణిని జంపె లంకలోన జొచ్చి
వలుదిశలు పరికించునంతలోన
రాజిల్లు హనుమ రాముని తలచుచు
నాలుగు లక్షల వీధుల - వీధుల - వీధుల
నంత వెతకి వెతకి వెతకి
ఎనిమిది పూరవాకిళ్ళ జేరి
ఏడు కోటలు వెతకి వెతకి
లక్షల యజ్ఞ వాటములు
లక్ష నాయక గృహములు
ఎన్నియో లక్షలాయుధాలయములు
వెతకి ధర్మకూటముల
కల్లు మాంసములు తరుగని వంట ఇండ్ల
నవకోటి శివాలయములు
దుర్గాలయములు
కోనేర్లు కలిగి జంగమస్థావర
ప్రాణికోట్ల బలినొసంగు యజ్ఞవాటములు
తాదలకెక్కుడయిన తనరు రాక్షసవీరులు
మణిమయ రత్న గోపుర మాణిక్య తోరణములు
పగడపు స్తంభాలు, ముత్తియపుమ్రుగ్గులు
బంగారు మేడలు, మిద్దెలు నమరి
స్ఫటిక మండపంబులు గలిగి
మంగళ భేరీ వాయిద్యములు మాటికి మ్రోయ
సూర్యమండలము కంటె రావణుని కిరీట
నవరత్న సింహాసనము నందు
లెక్కలేనన్ని భోగస్త్రీల
సతుల నంటుకొనుచు నిలచె

దశకంఠు సరస సల్లాపములతో
ఎన్నియో వేల వీణ మృదంగ శృంగార
వాయిద్య గోష్టుల నోలలాడు సమయమ్మున
నింగికెగసి
రావణుని చూచి

## కమాచి — త్రిపుట

పల్లవి : కలుగు లంక సమస్తమున్ వెతకి చూచి

చరణం ; లేదు సీత లోకైక మాత ॥క॥
సీత జగతిలో లేకయున్న
విశ్వరూపుడనై నాలో చూపెదను
నన్నెదిరించు రాక్షస మల్లుల
యమ లోకంబుల కంపుదును

చరణం : సీత ఇచ్చట లేకపోయెన
చిచ్చు పెట్టెద లంక నంతను
పోతరించిన దుష్ట దనుజుల
పోదోలెద యముని పాలికి ॥క॥

వచనం ;- అంత మారుతి గగనమున కెగసి కోట బురుజు మీద చేరి ఇంతులతో పెనుగులాడుచున్న రావణుని చూచి మాండోదరిని సీతగా భ్రమించి కనుల భాష్పముల రాల్చి సీతయే అవునా అని అనుమాన పడుచున్న శ్రీరాముడు హనుమ పంశయము తీర్చి పతివ్రత వానికి లొంగునా యని ముక్కు చెంపలేసుకొని రామా రామా అను సమయమున విభీషణుడు హనుమను చూచి, విషయంబు లెరిగి రాముల దూతా, హనుమా త్రికూట పర్వతమున గూఢపురంబున సీతకలదని విభీషణుడు వచింప రామదూత హనుమ అందు జొరబడియె.

## భైరవి — అది

పల్లవి : శ్రీరాముడన నెవ్వడు - శ్రితజన రమణుడు

అనుపల్లవి: పాలకడలిలో శయనించిన - పరమాత్మ యతడు

చరణం : సరగున రాక్షసుల దునిమి - సరగున భక్తుల దరి జేర్చి
అవనీపతులకు మిన్న - అవతారమూర్తి యన్న ॥శ్రీ॥

వచనం :- శ్రీరామ తారకం జపించి అశోక వనంబు జొచ్చి జానకీదేవిని జూచి

సీ॥ ప్రకృతివై ప్రపంచంబు పాలించు
ఆదిశక్తి అశోకమున నొదిగినావు
నీ యాజ్ఞ లేక త్రిమూర్తులు కదలరు
త్రిమూర్తు లోద్భవ అశోకమున నొదిగె
శ్రీరామ వామాంకమందున వశియించు
జగదేక పావని అశోకమున నొదిగె
సిరుల నొసంగె మమ్ము సతతంబు రక్షించు
శ్రీదేవి అశోకమందు నొదిగె

గీ॥ సకల జనసన్నుతమ్మ జానకమ్మ
ఏ విధి నమ్మింతునమ్మ జానకమ్మ
ఏ రూపమున రాముని వేరుడువమ్మ జానకమ్మ
యెటుల మద్దుటుంగరము నొసంగుదునమ్మ జానకమ్మ

వచనం :- అనునంతలో రావణాసురుడు వచ్చుచుండెనని వార్త విని అంజనా తనయుడు అశోక వృక్షమున తుమ్మెద రూపమున నిలచె.

మంజరి .- నిన్ను మరచి జీవింప జాల
నన్ను నమ్మ్రతింపవేని
నీ నాథుడిక నిను కాచుననుచు
కలనయిన దలపబోకు

వచనం - అని పరుషంబులాడు దశకంధరుని యెదుట నొక గడ్డిపరక వైచి జానకీదేవి ఆ గడ్డి పరకతో ఓరీ నీచ రావణా

మాల్‌కోస్ — రూపకం

పల్లవి : రాముని దూరిన నాలుక చీలికలు కాకపోదు ॥శ్రీ॥

చరణం ; పాతకుడా శపియించి పడగూల్తు గాని
ఆగవలసె రామాజ్ఞ లేక వగచుచున్న దాన ॥శ్రీ॥

వచనం - కైలాసంబు పుట్టచెండువలె నాడించితి. వేద శాస్త్రములు చదివితి అనేక కన్యల గొనివచ్చి సుఖించు నన్నేల ఏడిపింతువు? నీ రాముడు దేవుడయిన

నిన్నేల రక్షింపడయ్యే అనగ జానకీదేవి

గీ॥ దుర్మదాంధుడ నిన్ను బట్టి శ్రీరామచంద్రు
నిశిత బాణంబుల దరిమిగొట్టు నాడు
దొరలు నాదగు కన్నీరు దరగు కాని ఊరకే
పోదు అడదాని ఉసురు నశింపజేయు గానీ

వచనం ;- అంతటి రావణాసురుని గడ్డి పోచగా పోల్చి దశకంఠా నిన్ను శపింతుగాని, శ్రీరామమూర్తి ప్రతిజ్ఞ రిత్తయగునని వూరకుంటినన

మంజరి ;- నను దండింపగ సాహసించితివి
వనితా వినుము ఈ వేళ
కరకంఠుండడ్డుపడిన చావు తప్పదు నీకీ వేళ

వచనం ;- అనిన దశకంఠుడు కోపమున సంహరింప బోవ మండోదరి అడ్డుపడియె.

జగన్మోహిని — రూపకం

పల్లవి : రామ రామ విననగునె శ్రీరామచంద్రు దూషణముల ॥రా॥
అనుపల్లవి: మనజాలను రాము బాసి క్షణమైన గాని జగతి ॥రా॥

చరణం : సూర్యాన్వయమున అవతరించిన
దామోదరుడు అకటా నానుండి కష్ట
మనుభవింప వలసె నేడు ॥రా॥

వచనం :- అని వగచి జానకీదేవి పొడుచుకొనబోవ హనుమంతుడు జానకీదేవి చేతనున్న కరవాలమును నేల పడగొట్టి

కన్నడ — రూపకం

పల్లవి : కంటిని జానకీదేవిన్ కనుల పండువగాగ
అనుపల్లవి: సంతసించు మాయమ్మ రామముద్రిక నిడ ॥కం॥

చరణం ; పంతగించు రావణు పలుకు దుర్భాషలెల్ల
కర్ణంబులు బగులునట్లు కనుగొంటిని వింటిని పాపఖర్మ ॥కం॥

సీ॥ రామదూతనంచు రమణి సీతకు తెలుప
నమ్మునా నా తల్లి నాదు మాట
రావణు చెరలోన రాకాసులందు
ఇడుముల బడుతల్లి ఏమనునో ఏమొ
శ్రీరాము నెడబాసి చెలువంబు బాసిన
భామ నన్ను గుర్తింపగలదొ
రామ ముద్రిక నిడ రావణుని మాయ
యంచ్చు యెంచు నేమొ

గీ॥ ఏమి చెప్పగ తోచదు వివరమెల్ల
తెలుప వేడెదనయ్య శ్రీరామచంద్ర
వెలుగు లోపల మార్గంబు
తెలుప వేడుకొందు కోసలేంద్రా

మంజరి ;- అని జానకిదేవిని వీక్షించి అమ్మాయని భాషించి
ముదము తోడ శ్రీరామ ముద్రికను ఆ జనని చేత వైచి

ఉ॥ రాముని గన్నయట్లు మురిపెంబుల ముద్దులు
మూటగట్టుచున్న రాజలలామ రూపజితమారు
దివ్యరూపునిన్ గానక జాలనట్టి అభాగ్య దేవత
జనించితిని ఏమని చెప్పుకొందు కొరమాలిన జీవితమున్ భరియించుచున్

వచనం - అంత జానకి కోటి మన్మథాకారుని రాముని జూచినట్లు ఆనందపడి

కన్నడ — రూపకం

పల్లవి : వున్నారా సుఖులై వుర్విరామచంద్ర
అనుపల్లవి కన్నారగ జూచి ఎంతకాలమయ్యె రామచంద్రుని ॥వు॥

చరణం : ఆకు లలములు దిని వనాంతరముల దిరుగు
అభాగ్యురాల నగుట వలన గదా!
అఖిల లోక కల్యాణుని ఆర్త జన రక్షకుని
పదముల పూజించు భాగ్యము
నేనోచనైతి బ్రతుకదేల "వు"

వచనం ;- అని పగచి హనుమను జూచి నీవు సముద్రము ఎట్లు దాటితివి. లంక ఎట్లు చేరితివి. మాయా రూపుడవైన రాక్షసుడవా లేక రామదూతవా అని అడిగిన అంజనేయుడు

శా॥ రాముల దూతనమ్మ పరికించక నీ పతి
అజ్ఞనంది నీ జాడలను గొనగ
జెచ్చర వచ్చితి రామ తారకమంత్ర ప్రభావమునను
దాటితిని జలనిధి. అందు గల్గిన నన్నడ్డగించునరి
పరిభూతముల గర్వమణంచి
వచ్చితి నా మాట నమ్ముమమ్మా

వచనం ;- నీ పేరేమి? అని అడిగినది సీత. అంజనేయుడ తల్లీ. అంజనేయా నీవు చిన్న వాడివే నూరామడల సముద్రము ఎట్లు దాటితివి బ్రహ్మాదుల కలవి గాని లంఖిణిని జంపి లంకను ఎట్లు జేరితివి.

అమ్మా జానకీదేవీ. హనుమంతుని సాహసం నీకు తెలియదు తల్లీ. హనుమాన్ నేను నమ్మలేను. మీకు నమ్మకము లేనిచో నా విశ్వరూపము చూడుము. అంత అంజనేయుడు విశ్వరూపము ధరించె. పంచశిరములు దశహస్తములు మింటికి మంటకి ఏకరూపుగ నిలచిన అంజనేయుని చూచి జానకీదేవి నమస్కరించె నీ రూపము చూడజాల శాంతింపుము అన అంజనేయుడు వెంటనే సామ్యరూపము ధరించె.

భైరవి — ఏకతాళం

వల్లవి : వున్నారా సుఖులై వుర్విరామలక్ష్మణులు
అనుపల్లవి: కన్న తల్లివలె కాచు లక్ష్మణుండు సుఖియై ॥వు॥

చరణం ; మొగిలిరేకుల జడ అల్లి మునిగోళ్ళతోడ తలదువ్వి
నాపై ప్రేమ మరచెనా పలుమరు నను తలచునా ॥వు॥

కం॥ మారుతీ నా రాముడు ఎట్టి రూపుగలాడు
నా మరది లక్ష్మణుని శుభలక్షణములతో నున్నాడో తెలుపు కుమారా

వచనం ;- అనిన అంజనేయుడు చెప్పదొడగె.

సీ॥ అవనిలో ధర్మము నిల్ప అవతరించె
కౌసల్యా తనయు శ్రీరామచంద్రు
శివధనువు విరచి సీతను గైకొన్న
సాధుజన ప్రియుడు శ్రీరామచంద్రు
పరశురాము గర్వ భంగంబు చేసిన
విశ్వకర్త శ్రీవీరమూర్తి
గాధిసూనుని వెంట గావగా యాగంబు
రాతినాతిగా చేసిన రామమూర్తి

గీ॥ పితృ వచనము పాలింప రామచంద్రు
పాదములు కొలుచు లక్ష్మణుండు
ఋష్యమూకమున జేరి వానరుల గూడి
తాపము నొందగనయ్యె రఘురామమూర్తి

వచనం :- అని వచించిన జానకీదేవి

గీ॥ ఎన్ని జన్మములు చేసిన పుణ్యమేమొ
శ్రీరాముని కిల్లాలనైతిగాని నోచనైతి
శ్రీరాము సేవ చేయ మరియొకతి నాతియైన
రాముడు సుఖించునేమో హనుమా

వచనం - మారుతి సీతమ్మను జూచి ధర్మ స్వరూపిణియగు నీకన్న నాతి ఎవరు తల్లి.

చం॥ తెమ్మని శిరోమణి యానవాలు గాగ
తెలుపు మనియె రాకాసి గూల్చి రమణి నేలుకొందుననుచు
పలుకుమనియె జనకు పూదోటలోన ఏ విధముత
సీత నా ప్రాణ మనియె శ్రీరామమూర్తి

వచనం :- అనిన జానకీ దేవి చూడామణి నొసగి శ్రీరామచంద్రునితో ఇట్లు చెప్పుము.

సీ॥ పెండ్లియాడినదాది శ్రీరామ పదసేవ
సేయజాలని అభాగ్య ననుము
చిత్రకూటమున ప్రియమార కొనగోళ్ళ
దువ్వి నల్లిన జడ గురుతు తెలుపుమనియె
బొటనవ్రేలు దొండపండని భ్రమసి
కాకాసురు ప్రాణము దీయనెంచుట నా భాగ్యమనుము
సుందరంబగు రామ సన్నిధి నుంటయే
సీతకు స్వర్గధామమనుము

గీ॥ వీర రాముని అర్ధాంగ లక్ష్మి ననుము
రాము నెడబాసి ఇక సీత నిలువదనుము
ఎక్కడున్న శ్రీరాము పాదమే ఆధారమనుము
మదన సుకుమారు రామునకు శిరోమణిని జూపి
తడయక రాముని తోడి తెమ్ము

వచనం ;- మారుతీ! తెల్లవారుచున్నది, రాక్షసులు గుర్తించిన ప్రమాదమగును గాన రాముని వేరబొమ్ము.

మంజరి ; ధరణిజాత ఆకలిబాధతొ కాగుచుంటినోయమ్మ
కనికరించి ఫలములారగింప అనుజ్ఞ నొసంగుమాయమ్మ

వచనం ;- శ్రీరామభక్తి స్థిరముగా నిలచుగాక! అని దీవించి యాజ్ఞనిడ, ఆహా! చిరకాలము నా మనస్సులోని వాంఛితము నెరవేర్చితివి తల్లీ!

## కల్యాణి — రూపకం

పల్లవి : సకల యోషధీ సన్నుతంబు
అఖిల పుష్ప ఫల విలసితంబు

అనుపల్లవి: రాము ఆజ్ఞ రావణునకు
తెలుప అశోకవనము నశింపజేతు

చరణం ; తరువున కొక కొమ్మకు కోటివేల దనుజవరుల
నెల్లర పెకలించి తరువునేలకప్పళింప రాక్షసవీరవరులు ॥స॥

గీ॥ దశకంఠ రాక్షసబలము నెల్లర విరిగిన వృక్షములు జూచి
వేగమె ప్రభుతో వినుతి చేయ
అక్షయుడను సుతునంపె
కుసుమఫల అశోక వనము చెరచిన కోతిని గనీ

వచనం :– కోతీ! అక్షయుడు శిక్షింప వచ్చెనన

గీ॥ రానిమ్ము దనుజసూనుని బోకార్చి తక్షణము
రావణ కుమారున్ శిక్షించెద అసుర మల్లుల వంచించిన
జానకి శోక కారణమున లంక నాశము నొందన్

వచనం :– మితిమీరి దూషించు అక్షయుని, అంజనేయుడు తాటిమట్ట వలె చీల్చి పారవైచెె. ఆ వార్త విని తక్షణము తండ్రి ఆజ్ఞగొని ఇంద్రజిత్తు వచ్చి ఓయీ మర్కటాధమా! కాచుకొనుము.

సీ॥ ఆజ్ఞేయ శరమిది అవనిపై నిలుతువే
ఆదిశేషుని గెలచినట్టి జోదు
పర్వతాస్త్రంబిది పడగూల్చు వేగమె
శేషు నోడించి మణిని కాంతామణిని గొన్నజోదు
వారుణాస్త్రమిది వసుధ నిల్వరాదు
సురల ఇంద్రు నోడించినట్టి జోదు
పరశు అస్త్రంబిది పడగూల్చు క్షణములో
శస్త్ర మారణమొనరించునట్టి జోదు

గీ॥ ప్రాణముల యాస వున్న ప్రణుతి సేసి
కదలి పొమ్ము వేవేగ ఎవరి దూత విందేల వచ్చినావు
ఎవరి ఆజ్ఞ అశోక వనము చెరచినావు
కోతి గుణముల నిట్లు చేసితివి గానీ

శా॥ రారా రమ్ము నిశాచరా సకల దోర్వీర్య ప్రభావమున
నుజ్వలిత బాహు గర్వ దర్పంబునన్
జీరాడున్ కఠిన కంఠ కుంఠలుల సుజనాపకారుల రాకాసుల
బోకార్చన్ దలకొన రాముని దూతన్ పేరు హనుమంతుడన్

వచనం :- అష్ట దిక్పతుల వరంబున మారుతి చలింపదయ్యె కాని చతురాననుడు నొసంగిన ఏడు ఘడియల బ్రహ్మాస్త్రము బంధించునని దాని వలన అంజనేయుని బంధించి మేఘనాథుడు రావణుని సభ చేర్చె రావణుని కన్న మిన్నయగు తోకతో గద్దె నిర్మించి దానిపై నధిష్టించి. శ్రీరాముని తలచి అంజనేయుడు రావణునితో నిట్లనియె.

శ్రీరాగం — రూపకం

పల్లవి : రావణా శ్రీరామదూతా సుమ్మేను
సీత జాడల నిన్ను చెరచు యమదూత ॥రా॥

అనుపల్లవి: రాతి నాతిగ చేసిన రాము నిల్లాలిని
గొని వచ్చినందులకు దహించు నీ లంక ॥రా॥

చరణం ; నిను హింసింపగ రాముని నాజ్ఞలేక
ఇందు జేరి తపి ఇంచు చుంటి గాని
తలచిన తృటిలో వశింప జేతు నిన్ను
నా మాట నమ్మి నీవు రాముదేవి నిమ్ము ॥రా॥

గీ॥ నను వంచింప దలంచి వచించు నీ వాక్యంబులున్
వినినంతన్ భయమంది సీతను ఈ మాయా మృగ
సంహారునిన్ జని సీతన్ గొనుమంచు వేడుకొను
భీరుండే యీ రావణుండు

ఉ॥ అనిన రావణుని జూచి పులస్త్య పౌత్రమా చీకటి
వెలుగులు ఒకచోటే నిలువంగలేవు దినమణి
వంశమున రాముని కనుగొన రావణా నీవును
నీ లంక నింక నిలువదు జుమ్ము రావణా నా మాట నమ్ము

హంసధ్వని — ఏకతాళం

పల్లవి : నీకపాయమ్ము దప్పింపనున్న నన్నా కారులాడెదవు

అనుపల్లవి; నీలోగల మాయ రామాగ్నితో తొలగింపుము ॥నీ॥

చరణం : సీతకాదు నీ పాలిటి మృత్యుదేవత యని తలపోయుము నీవు
నీ జనని కంట నీరు నాశము జేయు నీ లంక నింక ॥నీ॥

## శ్రీరాగం — ఖండగతి

పల్లవి : వీరుడై త్రైలోక్య మేలుచుంటిని గాని

అనుపల్లవి: నను గెలచు వీరుడు కాన రాడిందాక ।వీ।

చరణం : వీరుడా రాముడు బల్‌వీరుడంచు బలికెదో
ఆలి కావగా లేని అధముడు రాముడు దేవుడె। వీ।

ఉ। రావణుడవంగ ఏమని తలంచెను
రామచంద్రుడానాడె నశించెను వైభవము
ఏ వైభవము అదృష్టము కన్నను వేరు వున్నదే
రాజ్యము భార్యయు తొలగె రామునకౌ ఇంకేల
నిర్భాగ్యుడు నన్ జయించునకో విన్న నవ్వరె యెల్లలోకముల్

వచనం :– అన విని మారుతి ఓయీ రావణా!

శా। సలలితగాత్రి ఈ ధరణిజాతను రామున కప్పగించి
నీ చరణములు అన చేసితిని తప్పు ననున్ క్షమియింపు
మంచు శరణంబు వేడుమా కరుణను కాచు
రాఘవుడు వృధా ప్రసంగమది ఏల, లేదా
కూలెదొ పుత్ర మిత్ర పరివారము తోడుత రావణా ఇకన్

వచనం :– పరుషంబు లాడుచున్న వానరుడా! ఇదే నా కరవాలంబు. నిన్ను గూల్తునని కరవాలంబుతీసి అంజనాపుత్రుని చంపబోవ విభీషణుడు అన్నా! అన్నా కోతిని జంపుట రాజధర్మము కాదు. తమ్ముని మాట విని అట్లయిన మంత్రులారా వీని అంగమునకు ఏదయినా గుర్తు నిడి పంపుడు అని చెప్పిన హనుమంతుడు, రావణా! నా మాటలు నీ మేలు కోరి చెప్పితిని సకల రాక్షస వినాశనమగును. శ్రీరామ బాణాగ్నితో జానకి వుసురు నిన్ను నీ లంకను నాశము చేయక మానదు. అంత రావణుడు మీ రాముని ప్రతాపము సీతను నను జయించి గొనుమనుము. దశకంఠుడు బ్రతికినంతకాలం సీత నీకు దక్కదనుము. నాలుగు లక్షల తొంబై తొమ్మిది ఆరువేల సంవత్సరముల ఈ త్రైలోక్య మేలుచుంటిని. నన్ను గెలచువాడు ఎవడూ లేడు అనిచెప్పి రావణుడు జనియె. అంత మంత్రులు ఆంజనేయుని తోకకు తైలవస్త్రములు చుట్టి అగ్ని తగిల్చిన లంకంతా దహనంబు జేసె.

మిద్దెలు, మేడలు, కోటలు, తోటలు, కోట బురుజులు, శృంగార భవనములు, ఆయుధాలయాలు, యజ్ఞవాటికలు, జంగమ స్థావర ప్రాణికోట్ల బలి నిచ్చు యజ్ఞవాటికలు, పిల్లలు, పెద్దలు, అనేక రాక్షసమూకలు అగ్నిహోత్రునికి ఆహుతులై మిడతల్లాగ మాడిపోతున్నారు విరిగిపడే శిఖరములు ఫెళఫెళ మని రవములతో దాని క్రిందబడి ప్రాణములు పోయినవారు, కాళ్ళూ చేతులు విరిగిన వారు లబలబమని నెత్తి నోరు బాదుకొనుచు పరువు లెత్తుచున్న, కుంభకర్ణుని సతి వజ్రజ్వాల ఇక మూడు మాసములు గడచు వరకు నా పతికి మెలకువ రాదు. నా పతిని కాపాడుమని విభీషణుని మందిరము విడచి సీత వసించు అశోకవృక్షము తక్క దేవాలయములు తక్క అన్ని ప్రదేశములు గల లంక యంతయు దహనము చేసి శ్రీరామ తారకము జపించుచున్న అది తెలసిన రావణుడు వరుణ దేవుని ప్రార్థించి వర్షం కురిపించాడు. అది గని హనుమ నేను రామ భక్తుడ నగుదునేని ఆ వర్షధార అద్యధారగా మారిపోవుగాక అనగానె ఇంకా భగ్గున మండుమండె. అమ్మా జానకిదేవీ నేను రాముని వెంత కేగెదనని అంజనాగర్భుడు రాముని వెంతకు చేరబోయె.

మంజరి ; కుండల కాంతులు దిశలు నిండ
శ్రీరామ పాదములు కొలచి
నూరామడల అంబుధి దాటి
ప్లవంగ వీరులను జేరె

వచనం :- సముద్రము దాటుచూ మైనాకుని ఆతిథ్యము గొని. వానరులతొ గూడి భార్యా వియోగ సంతప్తుడైన శ్రీరామ చరణముల వాలి, రఘురామ మూర్తి! విచార సంభ్రమములతో బాటు పావని కుశలముగా నుండె, శిరోమణి నొసంగె.

మాల్కోస్ — ఆది

పల్లవి : పావని భూజాత కుశలమా-పావని కుశలమా
పావని కుశలమా ॥పా॥

అనుపల్లవి: అణుకువతో పతి సేమంబు లడిగెనా
శ్రీసతి సీత జాడలేమయిన దెప్పితివా ॥పా॥

చరణం : క్షేమమైన గొని వచ్చితివా
నక్ష్మి శ్రీలక్ష్మి పావనమయిన
ముద్దుటుంగరము ఇచ్చితివా
అనవాలు తెచ్చితివా సతి శ్రీసతి ॥పా॥

మ॥ లంక జేరి రాక్షసుల గూల్చి సీత జాడలను గొని
చితి పెట్టితి లంకకు రామ యాగమనంబు చెప్పి
వుంగరము నొసంగ జనని జానకీదేవి
దుఃఖ సందేశమాలకించి తెచ్చినాడను శిరోమణిని చెలువమునను

వచనం :- అంజనేయ చెప్ప వాక్యమలకు శిరోరత్నము గొని, జానకీ,

మ॥ పడతి నను పెండ్లాడు సమయమందు నీదు జనకుడొ
సంగె శిరోమణిని, వాకు తల్లి కౌసల్య ఒసగె ముద్దు
టుంగరము అనవాలుగా నీకిచ్చి తెచ్చె శిరో
మణిని సాహసించి హనుమ

వచనం :- హనుమా. నీ ఋణం తీర్చలేను. సీత ఏమనియె నిర్భాగ్యుడు రాము డనియెనా, శ్రీరామా జానకీదేవి దురవస్థ ఏమని వచించెదను.

మంజరి ;- మిము జూచుటకై బ్రతికియుండె
లంకలో జానకమ్మ
సహజంబుగ ఆ పతీవ్రత గనుక
బ్రతికియుండె జుమ్మా

మ॥ జానకీదేవి క్షేమము గొని అక్షయాది
రాక్షసుల గూల్చి అశోక వనంబు నాశనము చేసి
రావణునకు నీతులు గరపి లంక కాల్చి
వచ్చితిని పిచ్చి కోతిని మన్నించు రామా

వచనం ;- రావణుని పరుషంబులు వింటి నే చెవులారా. ఏమి వచింతు వయన మగుటయే మిగిలె మనకు. శ్రీరామా! మీ అజ్ఞ లేక బ్రతికె దశకంఠుడు లేక యుండిన సీత లోకైకమాత గొనితెచ్చి మీ పాదములు చెంత నుంచువాడనే గాని మీ అజ్ఞలేదయ్యె. కాకాసుర శరణాగతం, మొగిలిరేకులజడ, పెండ్లి సమయమున

వసంతపు బిందెలో ముందుగా వుంగరం తీయుట ఆనవాలుగా జెప్పె. శివ ధను ర్భంగము, సీతను పెండ్లాడెదనని చేసిన ప్రతిజ్ఞ, హృద్య వనములో పాటలాటలు చూచి సంతసమొందితి. అట్టి ప్రేమ మరువకుము. దనుజ సంహారము చేసి నా చెర విమోచనం చేయుమనియె. ఎనిమిది మాసముల నుండి రామ తారకమే అన్న పానంబని శత నమస్కృతుల వినుతిజేసె అని హనుమ చెప్పిన కౌసల్యాతనయుడు ఏకధారగా దుఃఖించుచుండె లక్ష్మణ, సుగ్రీవాది ప్రముఖులు రాము నోదార్చి, డెబ్బదిరెండువేల కపివీరులతో రావణుని లంక నాశము జేసి జానకీదేవి చెర విమో చనము చేయగల వారమని, రావణునిపై దండయాత్రకు సిద్ధమైరి. జై శ్రీరామ మూర్తికి జై! జై సీతారాములకు జై! అనుచు కపివీరులు పయనమైరి. రాముడు దర్భశయ్యపై శయనించె.

మంజరి ; శ్రీరాముని గనినంతనె సముద్రుడు పొంగి
పొరలె కోమల శ్యామల రూపుడగు
రఘురాముని కీర్తించిన మది కలగె

వచనం :- అంత దశరథ నందనుడు తన్ను గాంచి, సముద్రుడు గర్వించెనని కోదండముతో నొక సముద్ర భాగమును ఇంకింప జేసె. అంత సముద్రుడు నిజ రూపమున వచ్చి నమస్కరించి, ఇది నా సంతోషంబని సత్కరించె. సముద్రుని ఓదార్చినంత, జానకీరామా! ఈ రత్నాకరము బంధింప మార్గము కావలెనన్న మీ ఇష్టానుసారము మీకు లోబడెదనని నమస్కరించె, రాముడు సంతసించి ధనుష్కోటి యని నామకరణము చేసె.

ఈ విధమున పరమేశ్వరుడు హనుమ సందేశమును కైలాసములో పార్వతీదేవికి, ముప్పదిమూడుకోట్ల దేవతలకు చెప్పిరి.

అంత పరమేశ్వరుని దేవతలు ఇట్లడిగిరి. ఆంజనేయుడు ఎవరి కుమారుడు చెప్పుడన, శివుడు ఓ దేవతలారా! కేసరి, అంజనాదేవిల కుమారుడు ఆంజనేయుడు. ఉత్తరదిశ రాక్షసుల గూల్చ, బ్రహ్మ తన కంటి నీటిబిందువులో నొక కుమారుడు జనించి, కేసరి యని నామకరణము చేసినంత తండ్రీ! నన్నేమి చేయమందువు? అనినంత బ్రహ్మ ఓ కేసరీ! మునుల బాధించుచున్న రాక్షసుల జంపుము. అట్లేయని రాకాసుల గూల్చె. కొన్నాళ్ళకు అహల్య కుమార్తె అంజనా దేవిని వివాహమాడిన కేసరికి ఋషులు మెచ్చి నీకు బలవంతుడు, వీరుడు, చిరంజీవి యగు కుమారుడు ఉదయించు గాక యని దీవించిరి. సంతానము లేక చింతించిన

అంజనాదేవి ఒక పర్వతమున ఆశ్రమములో ఉన్నారు. దాని శిఖరము చేరి ఈశ్వరుని గూర్చి తపమాచరించుచున్న అంజనకు అంధురాలని వాయుదేవుడు దినము ఒక ఫలము దోసిట వేయుచుండ ఆ ఫల మారగించి తపము చేసె. ఒకనాడు ఈశ్వర బీజము ఆమె చేత బడవైచె. అది ఫలమని మ్రింగిన అంజనాదేవికి తొమ్మిది ఘడియలలో గర్భవతియై ఆశ్రమము చేరి నొక సుతుని గనియె. అది విన్న దేవతలు పరమేశా ఆ బీజము ఎట్లు వచ్చెనని అడిగిన చెప్పెద వినుడు. అంజనాదేవి పూర్వ జన్మమున మహారాజు కూతురు. సకల విద్యలలో తనకు సాటి లేదని గర్వమున నుండె ఒకపుడు నేను వంటరిగా పోవుచు నందీ ఆ పొదలలో ఆ చెంచు దంపతులు చూచితివా యంత ఆనందమున నున్నారో నని చూచి స్ఖలత మైనంత ఆ బిందువు భూమి మీద పడినంత భూదేవి కింత వరకు మూసీమూయ జాలక ఒకనాడు జలాధి దేవతా ఈశ్వర తేజము నేను భరింపజాల నీవు గొనుమ నియే. జలాధి దేవత తాను భరించలేక అగ్నిని ప్రార్థించి వాని కొసగె అగ్ని మోయలేక ఆ రాజ్యము సామీప్యమున పోవుతరి రాజ కన్య అగ్ని దేవా ఏల ఆయాసము ఈశ్వర తేజము మోయజాలక పోవుచుంటినని విన్న గుళికను మోయ లేవా యని పరిహాసమాడి వెలులతో అవమానపరచ అగ్ని కోపించి ఓ మదవతీ విద్యాగర్వమున పరిహసించిన ఈ జన్మలో వివాహం లేక వచ్చె జన్మలో ఈ వీర్యమువలన సంతానంకలుగునని అంధురాలగుదువని శపించిపోయి తాను మోయ లేక వాయుదేవుడు అంజనకొసంగె ఆ రాచకన్యయే అంజనాదేవి. ఆ అంజనాదేవి పూర్వజన్మ వృత్తాంతము చెప్పి అంజనకు పుట్టిన ఆ బాలుడు. గర్భవేదన బడు చున్న తల్లి గర్భము నుండి నేను భూమికి రాజాలనని జనించకపోవ మహావిష్ణు ఓ బాలుడా నీ వేల జన్మించవన స్వామీ, నాకు కౌపీనము కవచకుండలములు నొ సంగుదురేని చనెదనునిన అట్లొసంగె హనుమడు జన్మించె. మూడు దినముల బాలుడై సూర్యుని ఫలమని మ్రింగబోవ గజగజ వణకుచు భాస్కరుడు అరచిన ఇంద్రుడు ఐరావతము బంపె దానితో పోరాడిన హనుమ జయించలేక మూర్ఛ బడియె. అది గని ఇంద్రుడు వజ్రాయుధముతో కొట్టినంత ఆంజనేయుడు తునకలై సముద్రంబున బడియె. అంత వాయుదేవుడు నా కుమారుని వధించిరని చింతతో లోదాగిపోయె. దేవత లందరూ ప్రార్థింప నా కుమారుని బ్రతికింపుడనిన అందరు వెతకి వాని అవయవంబులు వెతకిన సముద్రంలో దవుడ ఎముక దొరకలేదు. దాని వలన హనుమ యని బిరుదు గలిగె. వాని బ్రతికించి చిరాయువుగా జీవించి దేవ తలు వారి వారి బలంబులు ఆంజనేయునకు నొసంగ ఓ హనుమా ఏ అస్త్రము నిన్ను ఏమీ చేయజాలదు గానీ బ్రహ్మాస్త్రము మాత్రము ఏడుఘడియలు బంధించు

నని చనిరి వరముల వలన గర్వంబున మహారుషుల బాధించు హనుమను గని ఓయి నీవు వరగర్వమున నున్నాడవని నీ బలము నశించుగాక యని శపించిరి. అది గని బ్రహ్మ మహారుషులారా ఈతని బలము నశింపరాదు. బలవంతునిగా చేయుడనిన దేవా మాకది సాధ్యమా యనిన, తప్పక చేయుడనిన యుపసంహారము చేయుదమని ఎవరైనా గుర్తు చేతురేని అతని బలము అతనికి వచ్చు ననియె, అంజనేయుడు శివసంభూతుడని పరమేశ్వరుడు చెప్పినంత సంతోషపడి వారి వారి అనుష్టానములకు చనిరి.

గీ॥ శివధనుర్భంగ శ్రీరామచంద్ర
అవనిజా లక్ష్మణ శ్రీరామచంద్ర
అలరు సద్గుణధామ శ్రీరామచంద్ర
యెల్లప్పుడు మము గావుమో శ్రీరామచంద్ర

పహాడి — ఆది

మంగళం శ్రీరామ దూతకు మంగళం
నిజపరంధామునకు మంగళం
నీరజా నేత్రునకు మంగళం
అంజనాగర్భునకు మంగళం
అరయ సుగ్రీవులకు మంగళం

— మంగళం —

ఓం తత్సత్ - ఓం తత్సత్ - ఓం తత్సత్

శుభం శుభం శుభం

—॥ హనుమత్సందేశము సంపూర్ణం ॥—





శ్రీ రామ జయం

# శ్రీ అమృత రామాయణము

## షష్ఠము అధ్యాయము

## శ్రీరామ పట్టాభిషేకం



శ్లో॥ వేల్పులకు తొలి వేల్పు విఘ్నరాజ
సిద్ధి బుద్ధి పతి విఘ్నరాజ
అఖిల విద్య లందజేయు విఘ్నరాజ
షణ్ముఖ అగ్రజా విఘ్నరాజ

శ్లో॥ శ్వేతాంబర ధారిం శ్వేత
కమల నివాసినీం
నిన్ను నమ్మి కొలచు వారికి
కలదమ్మ వాణీ

కేదారగౌళ — ఆది

కావగరారా కైలాస వాసా
ముద్దు లొలికించు మోహన రూపా ॥కా॥

చరణం : గంగ, గౌరి లాలించి ముద్దులిడుచు
నిను మురిపించుచు కాలి గజ్జెలు
ఘల్లు ఘల్లుమన చిందులు వేయుచు
చిందులు వేయుచు వచ్చె గజముఖుడు

## దర్బారు — ఆది

పల్లవి : సకల జగములకు తల్లివే

అనుపల్లవి: గాయత్రి సావిత్రి సరస్వతి యను రూపముల ॥స॥

చరణం ; నీలో జనించె బ్రహ్మాండ జాలములు
నీలో వెలసె సర్వ వేదములు
నీలో నిలచె అఖిల విద్యలు
నీలో నిలచె సకల జగంబులు ॥స॥

గీ॥ నిత్య సత్య వ్రతానూనులు
అయోధ్యా నివాసులు ఆది దంపతులు
లోక కల్యాణార్థమై అవతరించి
కామగాక మమ్మేల్లర కలకాలము యెపుడు

వచనం :- కైలాసంలో పరమేశ్వరుడు ఓ శాంకరీ

## పహిడి — ఆది

పల్లవి : వినవే ఈశ్వరీ వినుతించెద
శ్రీరామ పట్టాభిషేక కథ ॥వి॥

అనుపల్లవి: సారసాక్షిరో సీతారాముల కథ
సారమైనది మరి యొకటి లేదు జగతి విను ॥వి॥

చరణం ; కలవు యెన్నియో పురాణంబులు
కలవు యెన్నియో వేద వేద సారములు
ఎన్ని కలిగినా రామతారకము కన్న
మిన్న యైనది ఇక రాదు తలంపగ ॥వి॥

నాగభూషణుడు ఈ విధమున శ్రీరామ పట్టాభిషేక కథా విధానము ఇట్లు చెప్ప దొడగె అందరూ శ్రద్ధగా వినుచుండిరి.

వచనం :- లంకలో రావణుని సభలో

మంజరి : రాక్షసుని వీరులనెల్ల చూచిన దశకంఠుడు పలికెనిట్లు
వైరి రాముడు కపివీరులతో వారాసి చేరె
నరుడు రాముడని యెంచబోకుడీ
మహా రణశూరు వాని జంప గల
వుపాయంబుచెప్పుడీ యోచించి

మ॥ అనవిని సభవారు వూరకున్న రావణుని
చిన్న తమ్ముడు విభీషణుడు పలికె
అన్నకు నమస్కరించి చిన్నవాడని యోచించకు
అన్న నీవు కొన్ని హితవులు చెప్పెద క్షమించుమన్నా

వచనం :- అనవిని దశముఖుడు ఫక్కున నవ్వి అది ఏమొ చెప్పుమనియె

ఉ॥ రాముడు మానవుడని తలంచి కయ్యము ఖాయ
మొనర్చువేని ముమ్మాటికి లంక నశించు నా మాటలు
సమ్మతించి సీతను రామున కప్పగించి శరణు వేడిన
నిల్చు గదన్న మన వంశము అగ్రజా ఇకన్

వచనం :- అని వచించిన విభీషణుని వాక్కులకు దశకంఠుడు మహా కోపియై కరవాలము దూసి

చం॥ కులనాశకుడవు శత్రు శ్రేయోభిలాషివి భ్రాత్రు
ద్రోహివి అహితుడవు హీన బలుడవు భీరుడ
వు క్షాత్రమెరుగని పిరికిపందవు వంశ నాశకుడవు
నీవో నాకు హితంబుల బోధింతువే నన్ను వంచింతువే

వచనం :- అని నరుకబోవ మంత్రులు తోడ్పడిన వక్షంబునతన్ని నేలబడవైచె విభీషణుడు లేచి అన్నా మృత్యు ముఖంబు నుండి తప్పింప దలచినందుకా నన్ను తన్ని పొమ్మనెదవు?

సీ॥ మౌని తపోనిధి వెంట జని తాటకి జంపి
యాగంబు గాచిన దేవుడతడు
కఠిన పాషాణంబు పడతి జేసి ధనువు
విఱచి సీతను గొన్న దేవుడతడు

వాలిని ఖరాదుల వధించి సుగ్రీవునకు
రాజ్యమొసంగిన దేవుడతడు
లంక గాలించి సీత జాడలంది రాక్షసుల
జంపి లంక దహించిన హనుమడే శివుడు సుమ్ము

గీ॥ అట్టి శ్రీరామచంద్రుడు అర్ధాంగలక్ష్మి
పరమ పతీవ్రత సీతను రామున కప్పగించి
శరణు వేడిన గాచు నిన్ను నీవారి నెల్ల
లేకయుండిన వంశనాశంబు నిజము

వచనం :- అని పలికిన దశకంఠుడు రోషంబున

గీ॥ పాలుబోసి పామును పెంచినట్లు వజ్రమని
అగ్నికణమూ చేతబట్టినట్లు
నీతికోవిదుడు నా తమ్ముడనుచు
జాలిపడినంత శత్రుపక్షమూనినావు

వచనం ;- అనిన అన్నకు నమస్కరించి మూర్ఖుడు హితవచనంబు లినునాయని ఆ రాముని శరణాగత రక్షకుని శరణు వేడెద. నీచే చచ్చిన పాపము వచ్చును. ఆ రామునిచే చచ్చిన మోక్షము కలుగును. అని పైకెగసి సముద్రం దాట దొడగె.

గీ॥ అఖిల లోకైకమందిరా శరణు శరణు
దుష్ట సంహార శ్రీరామ శరణు శరణు
సత్య సంకల్ప శ్రీరామ శరణు శరణు
ధర్మ సంస్థాపనా శ్రీరామ శరణు శరణు

వచనం ;- వచ్చెడి విభీషణుని గని. రాక్షస శత్రువని అంగదుడు, వానరులు పర్వతముల వానిపై విసరబోవ, హనుమంతుడు అతడు మనకు మిత్రుడు కాని, శత్రువు కాడు అనిన రామ పాదంబుల శరణు రామ యని భీతుడై బడియె.

శా॥ అరయగ రఘు వంశమువన్ జనియించి పటుత్తర
విక్రమాతిశయ దోర్బల రాక్షస మల్లులన్
ఇల బడగూల్చి ఘోర కఠోర శాప విమోచన
మొనర్చి యాగమున్ గావి శంకరుని చాపము ద్రుంచి
సీతను గైకొనిన రఘువీరుడు గావు శరణార్థులనని మిమ్ము నమ్మితిన్

వచనం ;- అని ప్రతిన చేసి అభయ మిచ్చిన, భయకంపితుడైన విభీషణుడు వణకుచు చెప్పదొడగె.

కం॥ అవనిజాతను శ్రీరాముని కొసంగి శరణు
వేడుమటన్న నన్ను వక్షమున దన్ని పొమ్మనెన్
ఏది దోచక మీ పాదపద్మములకు
శరణు వేడితి రక్షించు శ్రీరామభద్రా

వచనం :- అని వేడిన శ్రీరామమూర్తి విభీషణునకు అభయమిచ్చెను. విభీషణా నీవు రాముని యందు భక్తి గలవాడవవుదువేని లంకలో జానకి బ్రతికియుండెనా? లంకలో గల రహస్యము లేమి? సందేహించుచున్న విభీషణుని రాముడు చూచి మీ అన్న రావణుని దునిమి నీకు లంకకు పట్టము గట్టెదనని లక్ష్మణా! సైకత లంక నిర్మించి సముద్ర జలములతో విభీషణునకు పట్టము గట్టుమనియె. సైకత లంక నిర్మించి విభీషణునికి పట్టము గట్టె. విభీషణుడు లంకలో గల రహస్యము లెల్ల రామునికి వినుతించె.

## కన్నడ — రూపకం

పల్లవి : రామా వివరించెద లంకలో రహస్యముల

అనుపల్లవి: నా యన్న రావణుడు మీచే మడియును ॥రా॥

లక్ష్మణునితో మేఘనాధుడు నశించును.
కుంభకర్ణుడు మీతో కుంభనికుంభలు
సుగ్రీవ, హనుమంతో
అతికాయ మహాకాయులు రామలక్ష్మణులతో ॥రా॥

వచనం :- అని విభీషణుడు తారలనైన లెక్కింపవచ్చునేగాని రావణుని రాజధాని లెక్కింప నలవిగాదు తొమ్మిదికోట్ల దేవాలయములతో, దుర్గాలయములతో కూటగృహములతో, లెక్కలేని ఆయుధాలయములతో, నాలుగు లక్షల వీధులతో ఏడు కోటలతో, లక్షలాది యజ్ఞవాటములతో, మణిమయ, రత్న, గోపుర, ఛత్ర చామీకర విచిత్ర భవన, వజ్ర వైఢూర్య, మరకత మాణిక్య నీల ప్రవాళములతో, నేనేడు కొమ్మపై మా తుత్రాత విశ్వకర్మ చేత నిర్మింపబడిన సువర్ణలంక నాలుగు తొంభైతొమ్మిది ఆరు వేల సంవత్సరాలు మా యన్న రాజ్యమేలె. లంకలో గల విచిత్రములు చెప్పటకు అలవి కాదు స్వామీ!

మంజరి ; అని పలికిన విభీషణుడు ఏకాగ్రమున నుండె
రామచంద్రుడు కపులతోడ వారాసి బంధింపుమనియె

వచనం :- కపివీరులెల్లరు కలిసి రాళ్ళురప్పలు గొనివచ్చిరి. తాతా జాంబవంతా ఈ వారధి కట్టు మహనీయుడెవరు? నల నీలులు కట్టగలరు ఒకప్పుడు నలనీలుల తాత ప్రతినిత్యము ఒక శివలింగమును పూజించి పూజానంతరములో ఆ లింగము సముద్రపు ఒడ్డున విడిచి పోవుచుండె. మరల ఆ శివలింగమును గొని సముద్రము ఒడ్డున పూజించి పోవుచుండెడివాడు ఈ నలనీలులు ప్రతినిత్యమూ ఆ లింగమును సముద్రంలో బడవైచి వినోదమును చూచుచుండెడివారు తెల్లవారి చూడగానే సముద్రములో వుండెడిది యవరా ఈ పని చేసెడివారని చూచి అప్పుడు తాత శపించారు. ఇక నుండి మీరు ఏ వస్తువు సముద్రంలో వేసినా తేలిపోవాలి అని శాపము గాక వరమిచ్చె ఆ కారణమున వారు అనకట్ట సముద్రమున కట్టగలరు. సుగ్రీవా! వారధి కట్టింపుము. మహాభాగ్యం. డెబ్బది రెండువేల కపి వీరులారా! ఎక్కడ ఏ వస్తువున్నా తెచ్చి నలనీలులకు అందజేయండి ఎన్నో ఆమడలదూరం పోయి రాళ్ళు, చెట్లు తెస్తున్నారు. ఎన్నో వేల ఆమడలమేర అంతా వానరులే. నల నీలులు రామాజ్ఞ తీసుకొని రామతారకం జపిస్తూ ఇరవై ఆమడల వారధి కట్టారు సముద్రంలో తిమింగలం తోకతో కొట్టేవరకు అంతా చెదరిపోయింది. పదిఆమడ ముప్పది ఆమడ, యాభై ఆమడ కట్టినా వారధి చెల్లాచెదురయిపోతుంది. విసుగు పుట్టి పరివిడి వచ్చి నమస్కరించి రామచంద్రా! మావల్ల కాదు. 50 ఆమడకట్టిన వారధి చెల్లాచెదురయి పోయింది. మమ్మల్ని అనుగ్రహించండి. ఓ వానర శ్రేష్టులారా! భయపడకుడు. ప్రతి ఒక్క రాయి గాని. ఆకు గాని. గడ్డిపోచయినా సరే శ్రీరామ అని దానిపై వ్రాసి వారధి కట్టండి. ఆహా! ఎంత పొరపాటు చేసాము. స్వామీ వ్రాయగలవారెవరు? అందరి నొసట రాతలు వ్రాసే బ్రహ్మ కుమారుడు జాంబవంతుడు వ్రాస్తాడు. ఆహా! మహాభాగ్యమని వారధి కట్టేవారు పొదలో వున్న ఒక ఉడుత చూచి తానూ రామునికి సహాయం చేయాలని సముద్రంలో స్నానం చేసి ఇసుకలో పొర్లాడి వారధి మీద నిలచి ఒళ్ళు దులిపే వరకు అంత ఆ ఇసుక పడి రంధ్రాలు పూడిపోయేవి చాలాసేపటి నుండి పర్ణశయ్యమీద ఉన్న దశరథ నందనుడు అది చూచి దాన్ని పట్టుకొని ముద్దుపెట్టుకొని యడమచేతిలో పట్టి కుడి చేతితో దాని శిరమునుండి తోకవరకు దీవించారు. దాని వీపున చారలవే. రామాయణ కథకు ఇది ఒక గుర్తు. నల నీలులు అనకట్ట కట్టిన మహా వీరులమని గర్వపడుతున్నారు. హనుమంతుడు ఇది చూచి రోమమునకొక పర్వతం కట్టుకొని వచ్చి అన్నీ ఒక్కసారిగా దులిపేసాడు అప్పుడు నలనీలులు అంజనానందనా ఇది నీకు

న్యాయమా అని అడిగారు. రెండు చేతులతో పట్టక ఉత్తర కరముతో పట్టుకొనె వాడు. నీ గర్వమున కిది ప్రతీకారము గర్వం కాదు స్వామి! ఒక చేత్తో కట్ట కడుతూ ఒక చేత్తో పట్టుకున్నాను క్షమింపుము.

భీంప్లాస్ — ఏకతాళం

పల్లవి : లాలలూ లాలలూ లాలలూ లాలలూ

అనుపల్లవి: లల లల లల లల లాలలూ
హే హే హే హే ఓహెూ హెూ ఆ హా హా
ఆహాహ ॥లా॥

రంగైన శ్రీరాముడూ, రాణి మహరాణీ
మన సీతమ్మ మహారాణీ ॥రం॥

అందమైన వాడూ మన లచ్చన్న
పందెమైన వాడూ మన హనుమన్న
కుందనమున వ్రాసెను తాతయ్య జాంబవంతయ్య
దట్టముగ సేతువు గట్టేరు నలనీలులూ "లా"

నడవండి దించండి రారండి రామయ్య కరుణకు
శరణని మ్రొక్కండి చూడండి ఉడుతను "లా"

హే ఓహెూహెూ ఓహెూ ఓహెూహెూ హెూ
ఓహెూ ఓహెూహెూ హెూ రాం రాం సీతా
రాం రాంరాం సీతారాం రాంరాం సీతారాం

వచనం ;- వాయు కుమారుడు గొప్ప పర్వతం గొని వచ్చుచుండె. వానరులు పరివిడి మారుతీ పుత్రా. వారధి పూర్తయి పోయింది పర్వతములతో పని లేదు అన ఆ పర్వతం పడవైచె. ఓ ఆంజనేయా శ్రీరామ దర్శన భాగ్యం కలుగునని వాపై నుండి రాముడు నడచునని సంతసించితిని. సీతారాముని దర్శన భాగ్యం కలిగింపుము ఎవరు మీరు? నేను పర్వత రాజును రామాజ్ఞ గొని వచ్చెద. శ్రీరామ ఆ పర్వత రాజు మీ దర్శనము అపేక్షించుచున్నాడు. వాయుతనయా ఈ అవతారములో నన్ను చూచే భాగ్యం లేదు. ద్వాపర యుగంలో కృష్ణావతారం లో ఏడు దినములు నాకేల నిలిపెద. ఆ మాట పర్వత రాజునకు చెప్పివచ్చి రామరామ సీతారామ అంటు లంకకు ప్రయాణమయ్యారు అందరూ.

కం॥ అణువు మొదల్ బ్రహ్మాండములను ఆదరించు
రఘు కులాన్వయుడు నడిపించె ప్రేమ సైన్యములను

వచనం :- సముద్రము దాటి సువేలాద్రి పర్వతము చేరి సేన విడిచిరి. విభీషణా సేతు బంధించునపుడు వచ్చిన రాక్షసు లెవరు? స్వామి మాయన్న దశకంఠుడు మనలో గల రహస్యములు తెలుసుకొని రమ్మని గూఢచారులను పంపించారు. వారు మన సేనలను చూచి భయమంది వానర రూపములు ధరించి మన వారితో కలసి రామ భజన చేయుచుండిరి. రామతారకములో మాయామర్మములు దాగవు కనుక భజన చేస్తు చేస్తూనె రాక్షసులై పోయారు అపుడు మనవారంతా కలసి కొట్టబోయారు. అప్పుడు వారు శరణాగతులని మీ పాదము లాశ్రయించారు. ప్రభూ మేము రావణ ఆజ్ఞానుసారం వచ్చితిమి. మమ్ముల రక్షింపుమని ప్రార్థించిన వారిని అంపివైచితిరి. మరల యవరైన వత్తురా! అనిన రఘుపుంగవుని గాంచి హేధీర శిఖామణీ అట్టి ప్రయత్నము లెన్నో జరుగునను మనము జాగరూకతలో మెలగవలయును తెల్లవారినంత

మంజరి .- రామచంద్రుడు దశకంఠు ఛత్ర చామరములు జూచి
భాస్కరుండు ఉదయింపడయ్యె
ననుచు విభీషణుని తొడపై నుంచి లేచి

వచనం :- విభీషనుని తొడపై పడుకొని సేద దీర్చుకొనుచున్న ఏల దిగ్గున లేచితిరి రాఘవా! సూర్యుడు ఉదయింపడయ్యె. ఇదియు రావణుని మాయేయగునా కాదు కాదు.

ఉ॥ తన వైభవమును పరికించి రాముడు
అయోధ్య జేరుననుచు మణిమయ రత్న కిరీట
కేయూర ముద్దు టుంగరములు శాతహార
పీతాంబరములు ధరించి రత్న సింహాసన మలంకరించె

వచనం :- అకసమంటు కోట బురుజుపై రత్న సింహాసనముపై కూర్చొని యువతీజన సకల వైభవముతొ ఛత్రములు వింజామరములు వీచుచున్న ఆ ఛత్రపు నీడ అడ్డుకొని సూర్య రశ్మి కడ్డు తగిలె ఆ ఛాయ మనపై మన సేనపై సోకెనేని మన కపజయము మాయన్నకు జయము కలుగును. ఆ ఛాయ మనపై రాకముందే ఛత్ర చామరము నేలబడేలా కొట్టండి వాయువాస్త్రముతో రాముడు కొట్టేవరకు

అన్నీ నేలబడ్డాయి. అప్పుడు రావణుడు సిగ్గుతో తలవంచుకొని దిగిపోయాడు. రఘురామా లంక ముట్టడింతుమా సుగ్రీవా! రాచధర్మము ముందు రాయబారిని పంపి. అపైన ముట్టడింతుము తాతా జాంబవంతా, యవరిని రాయబారిగా పంపిన మేలగును. ప్రభూ అంగదుని రాయబారిగా పంపిన మనకు శుభము కలుగును. వాయు తనయుని పంపిన మేలగునేమొ అన్నాడు లక్ష్మణుడు. హనుమ వలదు లక్ష్మణా వలదు. శ్రీరామ దూతలు యంత గొప్పవారని ఆ రావణునకు తెలిసి వస్తుంది. అందులో అంగదుడు మహా సాహసి వీరుడు చదువరి సరె అట్లె కానిమ్ము అన్నాడు లక్ష్మణుడు. రావణుడు సకల వీరవరులతొ సభ తీరి ఉన్నాడు. రఘు ధీరుని దీవెన అంది జై శ్రీరామచంద్రమూర్తికీ జై అని రావణుని సభ చేరి గద్దె పై కూర్చొని

## శ్రీరాగం — రూపకం

పల్లవి : శ్రీరాముని దూత నేను సార మెఱుగంగ లేవు

అనుపల్లవి: రావణా చెడెదవు శ్రీ రామ దేవి నమ్ము

మిశ్రం : వాలినొక కోలన్ గూల వేసిన రాము
బలము అమానుషమని తెలియలేవెమూర్ఖుడవై ॥శ్రీ॥

ఉ॥ అని పలికిన రావణాసురుడు రాముడు దేవుడు
అయిన రమణిని గొనివచ్చిన నన్ను పట్టక
కోతుల సాయము కోరుకొన్నవాడు చెల్లని
రాయబారమున కంపెనె రాముడు నిన్నూ

వచనం ;- అని వచించిన లంకాధీశుని గని అంగదుడు

ఉ॥ రాయబారము నడుపగ నరుగుదెంచి
రామదూషణ విననయ్యె రావణ నిన్ను
లంక నిర్ధూమధామమై నిలచునింక రావణా
నీ తలలు నేల జరలాడు వరకు తెలియలేవు

వచనం ; - పలికిన ప్రయోజనము కలదా? ఇకపైన సమరమే నిశ్చయము అని చెప్పుము రాముని తోడ. నేమఱక శౌర్యమున్న చూడుదు సంగరమందున నా ప్రతాపముల్.

సీ॥ యవ్వరి వాడవు ఏ వూరు నియ్యది
చెప్పు నా తోడ విశదంబుగాను
వాలి కుమారుడ శ్రీరామ దూతను
నీతి గరప వచ్చిన నేర్పరిని నేను
మాండోదరికి నీవు సుతుడవవుట
నాకు కుమారుడగుదువీవు
నీ చావు దప్పించి నిను గావ వచ్చిన
నా మాట విని రాము శరణు వేడు

గీ॥ దొంగ చాటుగ నీ తండ్రి దెబ్బగొట్టి
తండ్రి రుణము దీర్ప నా సైన్యమున జేరు మీావు
నిను చంక నిరికించి నీ నాతి చెరబట్టి
నను గన్న తండ్రి వీరుడగు వాలిరా రావణుఁడా

వచనం :- బ్రతుక దలచిన నా మాట నమ్ముము. నీత్రైలోక్యములో వీరులున్న నా పాదము కదలింపుమనుము నా పాదము కదిపి రేని రాముని జయించు వారే అన అంగదుడు తన కుడి పాదము నిట్ట నిలువున నిలిపె. మంత్రులు కుంభ నికుంభ ధూమ్రాక్ష విరూపాక్ష మకరధ్వజ. కంపన. అనుకంపన. ఝుంగుడు యనమండ్రుగురు మంత్రులు అంగదుని పాదము కదల్పనేరరైరి.

శా॥ దనుజానీకము బంధుగుల్ గురువులు
కోటి బోధించి మారణరంగ విహార
వీరభట శ్రేయోధి సంసేవ్య నేడు
యొక వానర పాదంబు కదల్ప నేర
కకటా భటావళి విక్రమ స్ఫూర్తి భగ్నాంగులై

వచనం ;- రావణా నీ సభలో వీరుల ప్రతాపంబింతేనా! కోతి కాలు కదుప లేని మీారా రాముని జయించుట అన్నా! దశకంఠు నే కదిలింపెద నని అంగదుని పాదం పట్టుకొనబోవ

ఉ॥ లంకాధీశుండు పాదంబు కదుప బోవ
పై కెగసి అంగదుడు పలికెనిట్లు కోతి
పాదములకు శరణని వేడెనేల రాము
పాదంబు లాశ్రయించి జానకిని అప్పగించి బ్రతుకుమీావు

మ॥ చెప్పు మిపుడు నీ ప్రభువు నిర్భాగ్యు తోడ
తగిన వీరుడ నగుట దక్కె నాకు సీత
నతిని కాపాడ నీ ప్రాణమేల పోగొట్టుకొనెదు
కోతుల నాడించుకొనుచు బ్రతుకు వనుము

వచనం ;- అని రావణుడు నేను వీరుడనై నీ కాలు కదుప వచ్చిన నీ ప్రతిజ్ఞ భంగమగునని తప్పించుకున్నావు. కాదు రావణా కాదు నీవు నా కాలు కదుపలేవు. నీ వారెల్లరు మూర్ఛబడిపోయిరి నీవు నా పాదము కదల్పక ముందే నేనే కదలి పోయితిని ఏలనన శ్రీరాముడు నిను చంపుట నిజము. ఒక్క కోతి కాలు కదుప లేని రావణుని రాముడు చంపెనే యని లోకము పరిహసించునని నేనట్లు వేసితిని. రావణా ఏమి నీ అభిప్రాయం. రామలక్ష్మణుల చంపుటయె అది నీకు సాధ్యము కాదు. అధిక ప్రసంగము చేసితివేని నా కరవాలమున కెరవయ్యెదవు ఏమంటివి నన్నా చంపువాడవు అని రివ్వన పైకెగసి రావణుని కిరీటము దన్నె నాలుగు రత్న కిరీటములు నేలబడియె. అవి అందుకొని సువేలాద్రి పర్వతం మీదికి విసరి తాను పాదమున వజ్రరేఖ గల వాడగుటచే మేడలు మిద్దెలు, కోటలు, బురుజులు కూల దన్నుచు పోవుచుండె రివ్వన వచ్చెడి కిరీటమును చూచి ఏమి జరిగిందో రాఘవా ఏదో మాయయని తోచుచున్నది. విభీషణా చూడుము. ఓహో ఇది మా అన్న కిరీటములు. హనుమంతుడు గొనివచ్చి రామపాదముల నుంచి దీని భావమేమి? సంధి కొప్పుకోని దశకంఠుని అంగదుడు కిరీట పూజచేసె నాలుగు కిరీటములు సామ, దాన, భేద దండోపాయంబులు చతుర్విధముల బోధించిన వినడయ్యె. యుద్ధమే కర్తవ్యమని దీని భావము ఆరు కిరీటములు రాలలేదు దాని భావమేమన కామ, క్రోధ, లోభ, మోహ మద, మత్సరములు ఆరు శత్రువులు రామ బాణము తోగాని అవి నేల బడవని దాని భావము. అని చెప్పునంతలో అంగదుడు చేరి, రఘురామా యుద్ధమే సిద్ధము అని అన్నాడు సుగ్రీవా, జాంబవంతా, హనుమా, విభీషణా, అంగదా, ఇప్పుడు లంక ముట్టడించుటయె కర్తవ్యము. మహాభాగ్యం. సుగ్రీవుడు. హనుమ తూర్పు దిశగల తొలిద్వారంబున యాభై కోట్ల వానర సేన తో నుండి సైన్యాధిపతిగ నడిపింపుము. నలా, నీవు తొమ్మిది కోట్ల వీరులతో పశ్చిమ ద్వారంబున సైన్యాధిపతిగ నుండుము. నేను దక్షిణ ద్వారంబున నలభై కోట్ల సేనతో ఉండెద నీలా ఇరువది కోట్ల సైన్యముతో సైన్యముల కలంచుము. అంగదా ముప్పది కోట్ల సైన్యములతో ఉత్తర ద్వారమున నిలువుము. తాతా జాంబవంతా ఈశాన్య భాగంబున ఇరువదియైదు కోట్ల సైన్యముతో నిలువుము. గంధమాదనా ఇరువది కోట్ల సైన్యముతో నైఋతి ద్వారమున నిలువుము. ప్లవంగ

నీవు పదిహేను కోట్ల సేనతో వాయువ్య ద్వారమున నిలువుము. దుర్ధరా నీవు పది కోట్ల సేనతో అజ్ఞేయ ద్వారమున నిలువుము. తక్కిన వానర శ్రేష్ఠులారా మీరు అలతి రాక్షసులతో పోరాడుడు అని శ్రీరామ సమక్షమున సుగ్రీవుడు నిర్ణయించె. అంగదుడు అను కోతి ప్రభు కిరీట పూజ చేసె ఇంతటి అకార్యము చేసెనని పట్టుడు కొట్టుడు అని సేన వెంటపడ్డారు. ప్రభూ ఒక యట్టి కోతి వచ్చి లంకంతా కాల్చిపోయె. ఒక తెల్ల కోతి వచ్చి మేడలు మిద్దెలు కూల్చిపోయె అని రాక్షసవీరులు మొరపెట్టుకొనిరి

అప్పుడు దశకంఠుడు కుంభా మూడు వేల కోట్ల సేనగొని తూర్పు ద్వారమున నిలువుము. నికుంభా నీవు దక్షిణ ద్వారమున రెండు వేల కోట్ల సేనతో నిలువుము. ధూమ్రాక్ష నీవు వెయ్యి కోట్ల సేనతో ఉత్తర ద్వారమున నిలువుము. జంఘునా నాలుగు కోట్ల సేనతో పశ్చిమ ద్వారమున నిలువుడు. మకరధ్వజా నీవు మూడు కోట్ల సేనతో ఈశాన్య ద్వారమున నిలువుము విరూపాక్షా రెండు కోట్ల సేనతో నీవు నైఋతి ద్వారమున నిలువుము. కంపనా నీవు పది కోట్ల సేనతో వాయువ్య ద్వారమున నిలువుము. అనుకంపనా నీవు ఎనిమిది కోట్ల సేనతో అగ్నేయ ద్వారాన నిలువుము. జంఘూ! నీవు ఏడుకోట్ల సేనతో వీరులనెదిరింపుము ఇంద్రజిత్తా పదివేలకోట్ల సైన్యంతో వీరాధి వీరులయిన రామలక్ష్మణుల నెదిరింపుము. అతికాయా! నీవు రామునితో పోరాడుము. మహాకాయా! నీవు లక్ష్మణునితో పోరాడుము. వెల్వలాది రాక్షసులారా! మీరందరు కలసి అలతి వానరులతో పోరాడుడు అని నియమించిరి ఏడు కోట ద్వారములు బంధించి నిలచిరి. లోపలిద్వారములో, బయటి ద్వారమున హనుమాది మహావీరులు నిలచిరి. హనుమ కుంభునితో పోరాడి, సైన్యాలతో లంకలో ప్రవేశించె ఈ విధమున సుగ్రీవుడు నికుంభునితో పోరాడి లంకలో ప్రవేశించె అంగదుడు ధూమ్రాక్షునితో పోరాడి, లంకలో ప్రవేశించె. నలుడు జంఘునతో, జాంబవంతుడు మకరధ్వజునితో పోరాడి లంక ముట్టడించిరి. గంధమాదనుడు విరూపాక్షునితోను, ప్లవంగుడు కంపనతోను పోరాడి లంకలో ప్రవేశమైరి. దుర్ధరుడు అనుకంపనతో పోరాడసాగె రాక్షస, వానరుల పోరాటములో ఎనమండుగురు మంత్రులు, మహా రాక్షస సైన్యమంతా చచ్చారు.

మోహన — ఏకతాళం

పల్లవి : రాక్షస వానర సంగ్రామము వధ మహా భయంకరము

అనుపల్లవి: హనుమతోడ కుంభ ధూమ్రాక్షులు సుగ్రీవులు
వల నికుంభ జంఘనులు అంగదునితో నీలమకరులు
నలనీలులతో కాలసికంపనులు ||రా||

వచనం ;- దశకంఠు యనమంద్రుగురు మంత్రులు మూలబలంబులతో కోట్లాది రాక్షసులు జచ్చిరి. వానరులు కొంరే చచ్చిరి. హనుమ లెక్కకు మిక్కుటమైన రాక్షసులను చంపె. ఇప్పుడు మూల బలంబులతో సకల రాక్షసులు నశించిరని అది విని రావణుడు విచారించుచుండగ, రాక్షస వీరులు ఇట్లు బోధించిరి కుంభ కర్ణుని మేల్కొల్పిన సువేలాద్రి పర్వతంతో సహా ఆ వానరులనంతా మ్రింగేస్తాడు సమయానికి మంచి విషయం గుర్తుకు తెచ్చారు రాక్షస మల్లులారా! కుంభకర్ణుని మేలుకొలుపుడు. గుఱ్ఱాలు, రథాలు, కంచరగాడిదల రథాలు ఇవన్నీ కుంభకర్ణుని మీద నడిపించారు. గుదియలతో కొట్టారు సలసలకాగే తైలం గొంతులో పోసినా, చెవులు పగిలిపోయేలా భేరీలు మ్రోగించినా లేవలేదు.

మంజరి ; కంచు రథంబులు నడిపింప కదలడు కుంభకర్ణుండు
కాచిన తైలం కంఠమున బోయ కదలడయ్యె కుంభకర్ణుండు
మేమియు తోచక గొఱ్ఱెమందలన్ వదల దరిమిరి కోట్లకొలది
కర్ణ నాసిక రంధ్రముల నుండి మందలెల్ల లోజనియెన్

వచనం :- ఆ గొఱ్ఱెల మందలు ముక్కుచెవులలో నుండి లోన జొరబడేవరకు ఇటునుంచి అటు పొర్లాడ అది జూచి సంతోషపడ్డారు. వాడు హా హ హా హ అని నిద్రపోతుంటె, ఉచ్ఛ్వాస నిశ్వాసలు బైటకు లోనికి లాగుతుంటె, ఎదుట వున్న సైన్యం లోనికి వెళ్ళి బైటకు వస్తున్నారు. వాని గురక పిడుగుల ఉఋుములలా గున్నది. వాడు తినడానికి ఎన్నోకోట్ల షడ్రసాన్నములు, ఎన్నో కోట్ల రక్తభాండ ములు, ఎన్నోకోట్ల సురాపానీయాలు, కోట్లాది గొఱ్ఱెలు, మేకలు, ఆవుల మందలు దున్నలు, లేళ్ళు, అడవి పక్షులు, అడవి దుప్పులు, ఏనుగులు ఈ విధంగా రక రకాల పానీయములతో ఆహారం సిద్ధపరిచారు. ముక్కులో గొఱ్ఱెలు కదులుతుంటే తుమ్మాడు. ఆ తుమ్ముతో వేలాది రాక్షసులు చచ్చారు యిలాగయితే ఏం లేచా డని మంగళ భేరీలు మ్రోగేవరకు లేచాడు. అప్పుడు ఆ ఆహారాలన్నీ తిన్నాడు. తమ్ముడూ అనే వరకు అన్నా! నమస్కారం.

ఉ॥ జనకజాతను సీతను చెరబెట్టిన కారణంబునన్
మనకెందును కానరాక భయంబున దాగిన శ్రీహరి
శాఖామృగంబులతో లంక ముట్టడించెన్ వడిన్
లేలెమ్మా తమ్ముడా! రామలక్ష్మణుల మ్రింగన్ బొమ్మ వేవేగమె

వచనం ;- అని కుంభకర్ణునకు తెలుప అన్నా! ఇంకా సీతను రామునకప్పగించి శరణు వేడలేదా? మన తాత పులస్త్యుడు విభీషణుడే లంక ఏలునని అన్న మాట నిజము. సీతను అప్పగించి శరణువేడుట ఉత్తమము. అట్లు గావింపకున్న అగ్నిలో మిడుతలవలె అందరం నశింతుమనియె కుంభకర్ణుడు. ఛీ! పిరికిపంద, చేతనైన యుద్ధము చేయుము. గాకున్న గాజులు తొడుగుకొని ఒక మూల పడియుండుము అన్నాడు. ధర్మపద్ధతి చెప్పితి గాని శత్రువులకు వెలచిగాదు. అయిన నేను ఇంక మూడు నెలలు నిద్రపోతే గాని లేవను. ఇప్పుడు మూడు నెలల నిద్ర అయినది. ఈ నిద్రకళ్ళతో నేనేమి యుద్ధం చేస్తాను. ఆరు నెలల నిద్ర పూర్తి అయినట్లైతే రామలక్ష్మణులను సైన్యంతో సహా మ్రింగేవాణ్ణి సగం నిద్రతో జయించలేను. ఓడిపోతాను. నా మాట విను అన్నా విభీషణుడు శత్రుపక్షం చేరాడు. నీవు పిరికి పందవు ఇది నా ప్రారబ్దము. సరే అన్నా నీ అజ్ఞానుసారం ఆ రాముని అయోధ్యా మార్గం పట్టించికానివెనుకకు మరలను నీ పాదముల ఆన. కోటగోడ దాటి పర్వతముల పిండిజేయు శూలం చేతబట్టుకొని రామలక్ష్మణుల సైన్యంతో మ్రింగేస్తాను రామలక్ష్మణులు యక్కడ? వానరులు కుంభకర్ణునిపై బడ్డారు చీమల్లాగా పర్వతం మీద పాకినట్లు పాకుతున్నారు. పర్వతాలు వాడి నెత్తినేస్తే బంతుల్లాగ ఎగిరి పోతున్నాయి. సుగ్రీవుడు వాని ముక్కు చెవులు గిల్లేశాడు వానరులందరిని గుప్పెటలో తీసుకొని నోట్లో వేసుకొని శనగల్లాగ నమిలి మ్రింగుతున్నాడు. నల్లుల్లాగా కాళ్ళక్రింద వేసి నలిపేస్తున్నాడు. ఈ విధంగా వానరులంతా అరుస్తుంటే అంజనేయుని భుజములపై కూర్చున్న రామ లక్ష్మణులు వివిధాస్త్రములతో కుంభకర్ణుని కొడుతున్నారు, శూలం త్రిప్పి విసిరాడు. అది అంజనేయుని గుండెలకు తగిలింది వజ్రకాయుడు గనుక పిండై పోయింది.

చ॥ వానరులార పొండు అలతివారలతో పోరండీ
కుంభకర్ణుడు వీరవరుడని అయోధ్యావాసుడంచు
పేరు గాంచిన విక్రమానూనుడైన పోరిన రామునితో
పోరి చంపవలయు లేకయుండిన రామునితో చావవలయు

వచనం :- దివ్యాస్త్రములతో శరీర మంతా రంధ్రాలు బడి, గొట్టాలలో నుంచి నెత్తురు వచ్చినట్లు వస్తున్నది. అగ్నేయశరముతో వాని రెండు చేతులూ కొట్టాడు. కాళ్ళు కొట్టేశాడు క్రిందబడి ఆ అని నోరు దెరచి హనుమతో రామలక్ష్మణులను మింగేస్తానని నేలబడిపోయాడు. వాని నెత్తురు వరదలుగా పోయి సముద్రములో కలిసింది. అందులో వానరులు రాక్షసులు కొట్టుకపోయారు. కోదండంతో వాని శిరచ్ఛేదము చేశారు. తల తెగినా కళ్ళు తెఱచి వాళ్ళను మింగుతా అని వస్తుంటే రాముడు ఎన్నో శరములు అహెూరాత్రములు సంధించినా వాడు చావలేదు. విభీషణా ఏమి రహస్యము? రాఘవా!

గీ॥ అంపెద రాముని కయోధ్యకనుచు
ప్రతిన జేసి అన్న పదములంటి అట్టి
కుంభకర్ణుడు సత్యసంధుండు నగుట
ప్రాణము త్యజించడు మీరు అయోధ్యామార్గము పట్టువరకు

వచనం :- మేము క్షత్రియులం. వెనకంజ వేయము. మీరు అహెూరాత్రములు పోరినా లాభం లేదు. విభీషణా నన్ను వంచింపదలచితివా? ఇదో ఈ చక్రముతో నీ శిరస్సు ఛేదింపుగాక అని విసరె. గడగడ వణకుచు ఓ చక్రరాజమా! దుష్టుల శిక్షింపుము. శిష్టుల రక్షింపుము.

దండకం ; శ్రీమత్ సమస్త ప్రపంచాది సేవ్య దయాసాగర దీనమందార
నీవగ్ని హెూత్రుండ నీవబ్జనేత్రుండ నీవబ్జ గాత్రుండ
నేవె సమస్త భువిన్ ఆకసమున్ సమీరుండవీవె
సమస్తేంద్రియాలోకముల్ నీవె నీ కంటె వేరేదియున్ లేదు
భళీ నిన్ను విష్ణుండు మన్నించి హస్తంబునన్ బూను శస్త్రప్రశస్త్రంబవై
దుష్టులన్ ద్రుంతువౌ శిష్టులన్ గాతువౌ
రాక్షసాదుల్ కలనంబున నినున్ గాంచి నిర్జీవులై పోరె
భళీ నీదు మహత్యమెన్నంగ శక్తుండనె నీ కటాక్షంబువే
నిట్టులున్నవాడ రక్షింపుమా దేవ దేవాధిదేవ
శౌరి పాణిహస్తమా చక్రమా నీకు జోహారు జోహారు జోహారిలన్

వచనం ;- నే రామభక్తుడైన ఈ చక్రము మరలిపోవుగాక! రాముని చేతిలో చేరింది. దక్షిణముఖమున రాముడు నిలచె. రామా! నీ వెనుక ఎన్ని శిరములో చూడుడు అనే వరకు రాముడు ఒక్క అడుగు వెనక్కు వేసి తిరిగి చూచాడు

కుంభకర్ణుడు వచ్చాడు. ఏవి శిరములు? అరె కుంభకర్ణుడు వచ్చాడె! స్వామి దక్షిణ ముఖమున నిలచిన వెనక శిరస్సులు అనే వరకు వెనకంజ వేశారు. వెనక్కు తిరిగి నట్లైనది. కుంభకర్ణుడు వచ్చాడు. విభీషణా! నీ ఋణము యలా తీర్చుకోగలను? విభీషణుని చూచి సమయోచితమునకు శ్రీరాముడు సంతసించె. దక్షిణముఖమున నున్న రాముడు ఉత్తర దిశ వెనుకంజ వేయడం వలన అయోధ్య ఉత్తర దిశన ఉన్నందున వెనుక తిరిగినట్లైనది

మంజరి ; మాయా శిరముల సీతను రావణుడు
భ్రమింపజేయుచున్నంతలోన
భటులతో కుంభకర్ణుడు మరణించె
నన్న వార్త విన్నంతలోన

మాల్కోస్ — రూపకం

ఎంత మోసపోతిరా - సుంతయైన ఎరుగరా
వంతగించి మానిసి - మన వంశ నాశము జేయునంచు

చరణం ; గురు బంధు మిత్రులు మహాత్ములు
కోటి బోధించిన విననైతివి
నా దుర్బుద్ధి కతమున కాదె
లంక నాశమొందగలిగె

చరణం ; ఎన్ని జన్మల తపఃఫలమున గాని
ఇట్టి తమ్ముని బడయగలనె
సన్నుత గుణశాలి నా తమ్ముని నేనెటు గందు

వచనం :- అని వగచు దశకంఠు దరిజేరి మేఘనాధుడు నమస్కరించి ఇట్లనియె

మంజరి ; సీత వలన ఈ చిచ్చు వచ్చెనని
రావణబ్రహ్మ దరిజేరి
పాతకులగు రామలక్ష్మణుల
కూల్తు నాకు శలవిమ్మని వేడి

వచనం :- అని ఇంద్రజిత్తు ప్రార్థించుచున్న, కొడుకును కౌగలించుకొని నీకు శుభంబగుగాక! పోయిరమ్ము అనిన దివ్యరథారూఢుడై మొదటి యుద్ధములో రామ

లక్ష్మణులతో ఘోర రణము చేసి అతికాయుల వధించె. రాముడు మహాకాయుని లక్ష్మణుడు అతికాయుని వధించి, ఇంద్రజిత్తుతో లక్ష్మణుడు పోరాడి విరథుడై రెండవ నాటి యుద్ధమున మేఘనాధుని విరథుని చేసె. మూడవనాటి సమరమున మాయాశక్తి చే లక్ష్మణుని మూర్ఛింపచేసి మేఘనాధుడు గర్వమున చనియె.

గీ॥ హరి భయంకరుడు సూర్యాన్వయుండు
సుమిత్రసుతుడు నా కూర్మి తమ్ముడు
లక్ష్మణుడు లేని రాముండు లేడు
కదలి రావయ్య ఈశ్వరా! కావుమయ్యా

వచనం :- పరమేశ్వరా! నా తమ్ముడు లేని నాకీ బ్రతుకేల నీలో నన్ను చేర్చుకొనుము. లేకున్న నా తమ్ముని బ్రతికించి నన్నుద్ధరింపుము అని నిమీలితలోచనుడయి ఇట్లు ప్రార్థించె.

ఓం నమః శివాయ ఓం నమః శివాయ
ఓం నమః శివాయ ఓం నమః శివాయ
ఓం నమః శివాయ

అంతలో లక్ష్మణుండు లేచి సమరమునకు యియ్యకొనె. రాముడు సంతసించె.

సీ॥ మరల సమరమున నిలచిన మేఘనాధు
డు విరథు జేసి
సైన్యముల గూల్చి రథశ్వముల
గీటడంచి
సకల దివ్యాస్త్ర శస్త్ర సంపన్నుడు
పూచిన తంగేడు పోల్కి నొప్పి
రఘువంశ వీర లక్ష్మణుండు చేయు
సమరమునకు పేరుబడిన వీరుల బారజూచి

గీ॥ కనురెప్పపాటున కదనోర్వి సర్వంబు
రక్త ప్రవాహంబు పాఱజూచి
నలుదిశలు తనవారు సంతసింప
కోపమున మేఘమధ్యమున నిలచి

శా॥ రాళ్ళ పిడుగుల పర్వతముల నగ్నికణముల రాల్చి
ఘనమృగంబుల పాముల తేళ్ళ జెఱ్ఱుల కురిపించు
చుండె జాంబవంతుడు హనుమ సుగ్రీవు లం
దు విడవి నాగపాశలజేసె రామలక్ష్మణుల తోడ

వచనం :- రామచంద్రమూర్తి నాగపాశ బద్ధులుగా చేసిన విచారపడుచున్న దాశరథి దరికి నారదమహాఋషి వచ్చి గరుడమంత్రముపదేశించి చనియె. గరుడ మంత్రము పఠించినంత నాగపాశబంధములు సడలిపోయె. రామలక్ష్మణుల నాగ పాశ బద్ధులుగ చేసితినని తండ్రితో చెప్పి సంతసించుచున్న సమయమున, రామ లక్ష్మణులు నాగపాశబద్ధ విమోచనమైనదని తెలిసి మేఘనాధుడు విచారించె.

గీ॥ నికుంబలా హోమము తొమ్మిది దినంబులలోన
అరు దినంబులు గడచినంతట
భగ్నము నొంది సతీమణి చెప్పిన మాట వినక
మణి లేక వచ్చి లక్ష్మణుని వలన జచ్చె

వచనం :- ఇంద్రజిత్తు చచ్చిన మగని కొరకు సులోచన ఎన్ని విధముల బోధిం చిన వినక మణి లేక సమరమున వీరుడవై చచ్చితివా! ఇక నా బ్రతుకేల? చిచ్చు చొచ్చెదనని విలపించుచుండ మేఘనాధుని హస్తమువచ్చి నేలనిట్లు వ్రాసె. రాముని సన్నిధికి పోయి రఘురామా! నా పతి శిరము నాకిడిన నేను సహగమనమొందెద. పతీవ్రతాశిరోమణీ! పతికి తగినరీతి చరించితివి అట్లే ఇచ్చెద అనిన సుగ్రీవాదులు నీ పాతివ్రత్యం చూపుమనిరి అయిన నన్నేమి చేయమందురు నీ పతి శిరముతో మాట్లాడించిన చాలును. నేను పతీవ్రత నగుదునేని ఈ శిరము పలుకుగాక అనిన వెంటనే కనులు తెరచి, సులోచనా! నీ తండ్రి ఆదిశేషుడే నాకు మణిని, కాంతా మణిని ఇచ్చి వివాహము చేసిన నీ తండ్రే నన్ను వధించెనని కనులు మూతబడియె శభాష్! మహాపతీవ్రత యని మెచ్చిరి. వెంటనే అగ్ని ప్రవేశమగుచు లక్ష్మణుని సులోచన ఇలా అని శపించె తండ్రిగా నాకు వైధవ్యం గూర్చినందులకు సమర తలమున ప్రాణాపాయ సమయంబున నీ అస్త్రంబులు నిష్ప్రయోజనంబులై ప్రాణావ శిష్టుడవగుమని శపించె అగ్ని నిలచిన మేఘనాధుడు నాగరాజయ్యె. సులోచన పతితో శ్రీరామునకు నమస్కరించె పూలవర్షం కురిసె. సులోచన తన పతితో నాగలోకము చేరుకొనియె.

మంజరి ; అతికాయుల మహాకాయులగు రాక్షసుల జంపె
సరసిజనాభుడు శ్రీరామచంద్రుని మాండోదరి
శరణు వేడుమని తెలిపె కొడుకును గూర్చిన
కారణంబున దశకంఠుడు పయనించె
సమరమందు లక్ష్మణునిపై గంటల శక్తిని వైచె

వచనం :- గంటల శక్తి వలన మూర్ఛిల్లిన లక్ష్మణుని హనుమ గొనిపోయె. శ్రీరామచంద్రుడు అంకమున జేర్చి ఇట్లు దుఃఖించె.

శివరంజని — ఖండగతి

పల్లవి : సతి గావ జనుదెంచి నిను జంపుకొన్నాడ
నాకన్న నిర్భాగ్యులు లేరయ్య సౌమిత్రి ॥స॥

అనుపల్లవి: తండ్రి మాట నిల్ప వనములందు జేరి
పడరాని ఇడుములన్ బడితిని కఠినజన్మ నిలిపితిని ॥స॥

ప్రాణసముడగు నా లక్ష్మణు లేక బ్రతుకనేర్చునే రాముడు
జీవంబులు దొరగు గాని ॥స॥

సీ॥ మరలి వచ్చిన రాముగని సుమిత్ర
ఏడి నా లక్ష్మణుండన్న ఏమనందు
గురు బంధు మిత్రులు తమ్ములు
ఏడి లక్ష్మణుండన్న ఏమనందు
కఠిన శిక్ష విధించి కానకేగిన
నా సతి ఏడి యన ఊర్మిళకు ఏమనందు
దాయాది వైరంబు జూపి లక్ష్మణు జంపి
వచ్చితిరాయన్న నేమనందు

గీ॥ జగము నందున గల కష్టమెల్ల
నన్నె కోరి వచ్చెనేమొ నా చెలికాడా
విభీషణా వేగబోయి అగ్ని
గల్పింపుమా నేనందు బడుదు

వచనం ;- ఆ శ్రీరామచంద్రుని మాటలకు అందరు ఘొల్లుమని ఏడ్చ స్వామి

రాఘవా! మీరేనా ఈ విధముగా దుఃఖించుట అని విభీషణుడు సుషేణుని గొని వచ్చి లక్ష్మణుని బ్రతికింపుమనె. అంత సుషేణుడు వానరశ్రేష్ఠులారా! విభీషణా! రామచంద్రా! ఔషధము లు లేవు. నేనేమి చేయగలను స్వామీ? అంజనానందనా కర్తవ్యంబేమన హనుమ సుషేణుని ఆ ఔషధములు ఎచ్చోట కలవో వచింపుడన హనుమా!

గీ॥ కలదు మనకు ఉత్తరదిశ యందు పాలకడలి
అందుగల ద్రోణగిరిపైన కలవు ఔషధములు
నాల్గు లక్షల తొంబది యారుకోట్ల
ఆమడల దూరము కలదు పాలకడలి

వచనం ;- సుషేణా! ఆ ఔషధముల పేరేమి? హనుమా! సువర్ణకరణి, శాకల్య కరణి, సంధానకరణి, సంజీవకరణి గొని రావలయు కానీ నీకిది సాధ్యమా! ఇది మూర్ఛగాని మరణంకాదు సూర్యుడు ఉదయించెనేని మన లక్ష్మణుడు బ్రతుకడు రాముడు విని మొదటి యామము గడచెనె. మూడు యామములలోగ రాగలవా హనుమా?

మంజరి ; భాను బింబము మరుగు పడియున్న భయమేమియు లేదు కాని
ప్రభాతకిరణము ప్రపంచమునకురాగ లక్ష్మణుడు మరణించుననని చెప్పె

వచనం :- అని శ్రీరాముడు మూర్ఛిల్లె. రాముని సేద తీర్చి. రఘురామా! నీ కటాక్షమున్న అది నాకెంతపని. ఆశీర్వదించి పంపుడన రామాజ్ఞగొని జై శ్రీరామ చంద్రమూర్తికి జై అనుచు ఉత్తరదిశ కరిగె గూఢచారుల వలన ఈ వార్త తెలిసి రావణుడు హనుమ ప్రయత్నములు భంగము చేసి రమ్మని కాలనేమిని పంపె ఆ మారీచుని కుమారుడైన కాలనేమి మహా ఇంద్రజాలం కలవాడు. మారుతిని వెన్నంటె ముందుపోయి ఆశ్రమము నిర్మించి తపసి వేషమున యోగ దండ కమం డలమున కూర్చొని ఉన్నాడు. దాహపీడితుడైన హనుమ కొలను చూచి ఆకసము నుండి నేలకు వచ్చి తపసిని దరిశించి స్వామీ! మా లక్ష్మణుడు బ్రతుకునా? భాస్కరుడు ఉదయించక ముందే ఔషధములు గొనివత్తునా. ఓ వానరా! ముందు దాహము తీర్చుకొని విశ్రమించి తదుపరి ఆలోచింతము. నా స్వామి దుర్భర శోక దావాగ్నిలో మునిగి తేలుతుండగా నేను విశ్రమింతునా? నీవెన్ని ప్రయత్నములు చేసినా ఆ లక్ష్మణుడు బ్రతుకడు. కొలను జేరి దాహము తీర్చుకొనబోవ మొసలి హనుమ పాదములను పడిసిపట్టె.

శా॥ శ్రీ రఘునాథు పాద రజ నీరజ పాద యుగంబు
నా మదిన్ మానక గొల్చుచున్న పలు బాముల నెన్నిటి
నైన ఓర్చి నే సేవక సేవ్య దివ్య జప హోమ తపః ఫల
సోముల గావిన సత్యవ్రతున్ శ్రీరాముని భక్తుడనైతి
నేన్ మకరి గ్రహంబు బాధ ఒడిన్ నశించెడిన్

వచనం :- అని వేడి పాదము ఝులిపించిన, మకరి ఒడ్డున బడి ధాన్యమాలియై నిలచె అమ్మా! నీవెవరు? రామభక్త శిఖామణీ నేను రావణుని పత్నిని. ఈ రూప మేమి? నేను గంధర్వకన్యను. ముప్వురు వెల్లెండ్రు వెంటనిడుకొని భూలోకవింతలు చూచుచున్న నే రజస్వలనై ఇందే నిలచితి. శాండిల్య మహాఋషి నా సౌందర్యము చూచి నా కామవాంఛ తీర్చుమన స్వామీ నే రజస్వల. నాల్గవనాటి స్నానాంతరం మీ వాంఛ నెరవేర్చెద. ఋషి చనియె. ఇంతలో రావణుడు వచ్చి చెప్పిన వినక బలత్కరించె. తొమ్మిది ఘడియలలో అతికాయ మహాకాయులను ఇరువురు కొడుకులు జనించిరి. కొడుకుల గొని దశకంఠుడు లంక కేగె. శాండిల్య ఋషి వచ్చి అడిగిన సిద్ధముగా ఉన్నాను. అనిన గత మెరింగి పాపాత్మురాలా! రావణునిచే భంగపడితివి. నిన్నొల్ల. నన్ను మోసగించితివి కావున నీవు మొసలివి కమ్మని శపించె. స్వామీ యని వేడిన రామభక్తుడగు ఆంజనేయుని వలన శాపంబు దీరు నని చనియె. అప్పటి నుండి మీ రాకకు ఎదురు చూచుచుంటిని నీ వలన నా శాపంబు దీరె. అతడు ఋషి కాడు. కాలనేమి యను రాక్షసుడు నీ కార్యహానికి నీ వెన్నంటి వచ్చుచున్నాడు. లక్ష్మణుడు జీవించును. నీకు శుభం కలుగును, పోయి రమ్ము. హనుమ ఓ స్వామీ! మీ ఉపకారం మరువలేను. అయినా నాకు గురుదక్షిణ ఇచ్చెదవా? అంతకన్ననా అని ఒక్క పిడిగ్రుద్దు గ్రుద్దాడు. కాలనేమి నెత్తురు గ్రక్కుతు మాయమయ్యాడు రెండవ యామములో పాలసముద్రము చేరి సూర్య కిరణముల వలె మెరుస్తున్న ఆ ఔషధములు చూచి అయ్యో అన్ని ఔషధ వృక్షములు ఒకే రీతిగా వున్నవే నేనెట్లు గుర్తింపగలను

సీ॥ నీలిరంగులోన నిలచిన వృక్షంబు
యట్టుని అకుల అమరియుండె
పసుపు వన్నెలతోడ వున్న యా వృక్షంబు
నల్లని అకులు నమరి యుండె
తెల్ల తీవెతోడ బ్రాకిన వృక్షంబు
ఆకుపచ్చలతోడ నమరి యుండె

పంచరంగుల తోడ ప్రబలిన వృక్షంబు
అనేక జాతి పుష్పముల నమరియుండె

గీ॥ ముప్పది వేల యక్ష రాక్షసులతో
నిండియున్న అఖిల మునిజన సంఘంబులమరి యున్న
సకల జంతుజాలములతో మణిమయ రత్నరాసుల
తోడ పది యామడల విస్తీర్ణమై నిలచె ద్రోణ పర్వతంబు

వచనం ; - ఓ యక్ష రాక్షసులారా! మహా పురుషులారా! వనదేవతల్లారా! మా రామచంద్రుడు చాలా ఆపదలో ఉన్నారు ఆ సంజీవ కరణి ఆ నాలుగు ఔషధములు గుర్తించలేక బాధపడుతున్నాను. ఆ ఔషధము చూపి పుణ్యం కట్టుకొనుడు ఒక్కరైనా పలుకరే? నా రాముడు మీకేమి అపచారం చేశారు. ఓ దయామయులారా! రండి రక్షించండి. నా ప్రయాస వృథా అయిపోయింది. అంత మారుతి ఏమీ తోచక నూరు యోజనముల పొడవుగల ద్రోణాద్రిని గొనిపోయెదనని విశ్వరూపం ధరించి వాలము పెంచి పర్వతమునకు చుట్టి ఎత్తి వామహస్తమున పెట్టుకొని వాయువేగ మనో వేగములతో వస్తున్నారు. కాలనేమి సుగ్రీవు రూపములో వచ్చి మారుతీ! లక్ష్మణుడు బ్రతికాడు. సంజీవి అక్కరలేదు అన్నాడు. రాక్షసుడని ఒక్క తన్ను తన్నాడు నెత్తురు కక్కి చచ్చాడు. మేఘ మధ్యములో నుండి వచ్చుచున్న పర్వతమున ప్రాణికోట్లు గోలగా అరుస్తున్నారు. అయోధ్యలో భరతుని చూచి రాముడనుకొని మారుతి భ్రమించిన ఆకాశవాణి అతడు రాముడు కాడు భరతుడనిన హనుమ సముద్రమును దాటి వస్తుంటే, ఔషధములు సూర్యుని వలె ప్రకాశించుచుండ, శ్రీరాముడు సూర్యుడు ఉదయించెనని రఘువంశకర్తా సూర్యనారాయణా! మా వంశము నాశము చేయ దలంచితివా? నా కోదండముతో నీ మండలమును కూల్చెద అని కోదండము ఎక్కుపెట్టబోవ రఘురామా! మీ దాసుడను. ఔషధము కాచి, సూర్యుడు కాదు వానరులంతా గంతులు వేస్తున్నారు. అంత సుశేనుడు సువర్ణకరణి పసరు పిండేవరకు బంగారుఛాయకలిగింది. సాకల్యకరణి పసరుతో సమస్త వాయువులు చేరుకున్నాయి. సంధానకరణితో నరములు ఎముకలు కలుసుకున్నవి. సంజీవకరణితో లక్ష్మణుడు లేచి రావణా! నిలు నిలు నిన్ను చంపేస్తాను అని వెళ్ళబోతున్నాడు లక్ష్మణా! ఆగు తమ్ముడూ ఆంజనేయుని కరుణ వలన నీవు బ్రతుక గలిగావు నాకు యుద్ధము వద్దు, సీత వద్దు, అయోధ్యకు వెళదాము పద. అన్నయ్యా! నా ప్రాణమైనా విడుస్తాను గాని ఆ జగన్మాతను విడచి రాలేను. హనుమా! నీవు యుద్ధములో చచ్చినా సంజీవితో

బ్రతికించి ఈ పర్వతమును యథాస్థానములో చేర్చు. మహా భాగ్యం. కుంభకర్ణు కుక్షిలో జీర్ణమైనవారు తప్ప తక్కిన వానరులంతా బ్రతికారు. రావణుడు యుద్ధ మునకు రణభేరి మ్రోగిస్తున్నాడు, సమస్త రాక్షసుల సంహరించి

గీ॥ రామరావణ సంగ్రామసీమలోన
నిలచి సమరమొనర్చెడు శ్రీరామమూర్తి
జనకజాతను నాకిడి శరణు వేడు
నిన్ను నీ లంక గాచెద నిక్కువముగ

వచనం :- రావణా!

గీ॥ ఎట్టి అపరాధినైన కాపాడుదును శరణటన్న
సకల విద్యాప్రావీణ్య సంపన్న గుణవీర తపోనిధి
లంకాధినేత మనదలంతువేని
నా మాట నమ్ము

వచనం :- అని పలికిన రాముని మాట వినక సమరమున పరాజితుడై మరు నాడు యుద్ధము చేసి పరాజితుడై, నాల్గవ నాడు పాతాళ హోమము జరిపె. ఆ హోమము సంపూర్ణమయ్యేనేని సీతాపతికి అపజయము కల్గునని, విభీషణు రావ ణుని పాతాళ హోమం చెరపి రమ్మన అట్లు చేసిరి. విఘ్నమయిన హోమమును విడచి ఐదవనాటి యుద్ధమున రావణుడు నిలచె.

మంజరి : ఎత్తిన బాహులు దించక పదునెనిమిది దినములు సమరము జరిగె
తెగి పడుచుండిన రావణుని శిరములు
మరల మరల మొలవ దొడగె.

వచనం ;- వివిధాస్త్రములు ప్రయోగించి విభీషణుని చేరబిలచి

చ॥ రాక్షసమాయలేమొ యెఱుగంగా జాలని వారము కాన
విన్నర్థించితి మున్నె ఎన్ని విధంబులన్ గలన వంచనతో
వధియింప బూనినన్ మాయయొ మర్మమొ నా కెరిగింప
గదయ్య దయతో విభీషణా ఒడిన్

వచనం :- వలదు విభీషణా! నీ అన్నను కాపాడుమని వేడుచున్న రావణుడు అడుగుచున్న రాముని మాటలకు దుఃఖించి చేయునది లేక మా యన్న నాభియందు

అమృత కలశమున్నది. దానిని భేదింపుమనిన, అమృత కలశమును భేదింపబోవ ఇంద్రుడు మాతలిచే రఘురామునకు రథము పంపించె. ఆయుధములతో ఆ రథమును అధిష్టించి, కోదండపాణి బ్రహ్మాండ మదర నాభికలశం భేదించి రావణుని కోదండమున కొట్టిన దశ శిరములు నేల బడియె. మండోదరి విభీషణుడు ఏడ్వసాగిరి శ్రీరామునిపై పూలవర్షము గురిసె రావణుని వైభవం తలంచుచు ఏడ్చుచున్న మండోదరిని చూచి మహాపతివ్రత యని దలంచి శ్రీరామమూర్తి మైమరచి దీర్ఘ సుమంగళీ భవ అని దీవించె. కన్నీట పాదముల కడుగుచున్న రావణ సతి మండోదరిని చూచి భ్రమించి మైమరచి దీవించితినే అని చేయునది లేక దశకంఠు కళేబరమున పసుపు కుంకుమ చందన పుష్ప మంగళాభరణ భూషితయగు మండోదరి భర్త శవముతో అగ్నిలో అట్లే నిలచిపోయె ఈనాటి వరకు రావణుని కాడి కాలుతూనే ఉన్నది. మండోదరి ఈనాటి వరకూ సుమంగళిగానే ఉన్నది. రామ వాక్యం ఈనాటి వరకు చిరస్థాయిగానే నిలచిపోయె. వానర శ్రేష్టులతో విభీషణు పట్టాభిషేక మొనర్చి లక్ష్మణుడు వచ్చి, నమస్కరించి నిలచె. సీతను తెమ్మని శ్రీరాముడు ఆజ్ఞ ఇచ్చె విభీషణుడు అద్దాల పల్లకిలో జానకీదేవి నుంచి సరమ, త్రిజటాది రాక్షస కన్యలు అందలం మోయుచు, అంజనేయుని ఆజ్ఞానుసారముగా విభీషణాదులు, వానరులు వింజామరలు వీచుచు వెంటరాగా సువేలాద్రి పర్వతము చేర్చి హనుమ రామా! అని జానకి నప్పగింప, ఆ జగన్మాత బారులు తీరి నిలచిన సైన్యము మధ్యనుండి రాముని చూచి పులకాంకితురాలై ఆనందభాష్పాలు రాల్చి నమస్కరింపబోవ, సీతా! పది మాసములు లంకలో ఉన్నదాన వగుటచే నీవు పతీవ్రతవైనను ప్రపంచము శంకించును. గాన నీవు అగ్నిలో బడి, నీ పావనత చూపి నన్ను చేరవచ్చు. అనిన ఘొల్లుమని జానకి వెక్కి వెక్కి ఏడ్చి లక్ష్మణా! అగ్ని కల్పించుమనిన అందరు ఒక్కపెట్టున ఘొల్లుమని ఏడ్వసాగిరి. రఘురామా ఇది మహా ఘోరం, అన్యాయం అని అగ్ని కల్పించె శ్రీరామునకు నమస్కరించి సీతామతల్లి ముమ్మారు అగ్నిహోత్రునకు ప్రదక్షిణము చేసి, అగ్నిదేవా! నేను దోషినయిన నను హరించుము పతివ్రత నగుదునేని రాముని నన్ను గూర్చుమని సీత అగ్నిబడియె. అగ్ని ఇద్దరు సీతలతో వెడలివచ్చి ఇదిగో మీ జానకి ఎవరో గొనుమన, రఘురాముడు ఆశ్చర్యమున చూచుచుండె. అందరూ ఆశ్చర్యపడిరి. దాశరధి ఇట్లనియె.

గీ॥ ఈమె ఎవ్వరు? ఇటకేల వచ్చె అన సీత రాఘవా
నాకు మారుగా లంకలో నున్న సీత వేదవతి
ఆమెను పెండ్లియాడు
మన రాముడనియె నిట్లు

వచనం :- ద్వాపర యుగమున కృష్ణావతారం అయిన వెనక, కలియుగంలో ఆకాశరాజు తనయ పద్మావతిగా జనించినపుడు, శ్రీనివాసుడనై నిన్ను వివాహ మాడెద, అనిన వేదవతి తపమునకు జనియె రామచంద్రుల వారు సమస్త పరివారముతో పుష్పక విమానంలో సముద్రము దాటి విమానము నిలిపి సముద్రపు ఒడ్డున సేన విడచె,

ద్విపద ; అంత అగస్త్యుండు ఆ రామునితో నని
బ్రాహ్మణుండు దశకంఠుడు
బ్రహ్మహత్యాదోషం కలుగు నీకు
కాశీలింగం గొనివచ్చి ఇచ్చోట
ప్రతిష్ఠింపుమని పలికెనిట్లు
అంత రాముడు హనుమను బిలచి
లింగమ్ము గొని దెమ్మటంచు ఆజ్ఞ ఇచ్చె
ముహూర్తము పోవునని కపులతో
సైకత లింగంబు రాముడు ప్రతిష్ఠ జేసె
బ్రాహ్మణ దక్షిణ తాంబూలంబుల
ఎదురు వచ్చు ఋషుల బ్రాహ్మణుల నడుగ
లింగంబు ప్రతిష్ఠించి దక్షిణ తాంబూలంబులిచ్చి
అని బలుక హనుమ మదిని
కనని రాముని కడజేరి ముహూర్తమునకు
కాశీలింగంబు దెచ్చితి ఇంతలోన నను
అవమానపరుపదలచి సైకత లింగంబు
నీవు ప్రతిష్ఠ చేసినావు
వేలు తాకిన రాలిపోవు సైకతము
లింగంబనిన దీసి దాని అవల పారవైచి
ఈ కాశీ లింగంబు ప్రతిష్ఠింపుమన సంతసించి

మంజరి ; కదలింపబోవ కదలదయ్యె
లింగము ముచ్చెమటలు బోసె
హనుమ నిరాశ జెంది
లింగమునకు తోక త్రిప్పి లాగదొడగె
తోక తెగి నేల బడిపోయె
మారుతి స్పృహ తప్పి నేల బడియె.

వచనం :- అది గని జానకీదేవి కుమారా! యన రామభద్రుడు కుమారా యని దీవింప ఎప్పటివలె హనుమ వాలముతో లేచె. వెక్కి వెక్కి ఏడ్చి కన్నీళ్ళ రామ పాదం కడిగి

గీ॥ రాఘవా నీ మహిమ ఎఱుగలేక
తప్పు చేసితి నన్ను క్షమింపుమయ్య
సాధుజన ప్రియా భక్త వత్సలా
కాశీలింగము ఇపుడేమి సేయవలయు

వచనం ;- ఆంజనేయా! కాశీలింగము సైకతలింగము ప్రక్కన ప్రతిష్టింపుమన ప్రతిష్టించె. అలతి వానరులు దక్క తక్కినవారందరూ ఒక్కొక్క లింగము వారి పేరున ప్రతిష్టించిరి. రామాయణము యథార్థముగా జరిగినదని నిరూపించిరి. వారధి విరిచివేసిరి. అభిషేక పూజలతో సంతసించి పార్వతీ పరమేశ్వరులు సీతా రాములకు ప్రత్యక్షమై ఒకరినొకరు పూజించుకొనిరి. రామా! బ్రహ్మహత్యాదోషం తొలగెనని చెప్పిరి కాశీలింగాభిషేకపూజలతో ఇది మహాక్షేత్రం రామలింగేశ్వర మనునామంబు విలసిల్లునని తిరోహితులైరి. శ్రీరామమూర్తి ఎల్లరుగూడి అయోధ్య చేరుకొనిరి. వశిష్ట, ఋష్యశృంగాది ఋషులతో చైత్ర శుద్ధ నవమి పునర్వసు నక్షత్రం కర్కాటక లగ్నం బుధవారము భాస్కర దర్శనముతో రామ పట్టాభిషేకం జరిగె. శుభలేఖల వలన వచ్చిన దేశాధిపతులు, పురజనులు, వానరులు, 33 కోట్ల దేవతలు, విభీషణాదులతో, మంగళ భేరీ వాయిద్యములతో, శ్రీరామ పట్టాభిషేకం జరిగె.

మోహన — రూపకం

పల్లవి : శ్రీరామ సామ్రాజ్య పట్టాభిషేకం
కన్నులున్న మనకెంతో సార్థకం కలుగును

అనుపల్లవి: స్వర్గమున్ మరపించి తోరణ స్తంభములు
ముత్యాల ముగ్గులతో అలరిన అయోధ్య

చరణం ; అతి దీనుల గామచుండె
సకల ప్రజల బ్రోచుచుండె
అఖిల బంధుకోటితో మంగళవాయిద్యంబులు
మ్రోగదొడగె వేడుకలతో ॥శ్రీ॥

గా॥ కృతస్నానంబున పవిత్రమగు శ్రీ సీతారాములన్
అఖిల వస్త్రాభరణములతో అలంకారంబు గావించి
మున్ దశరథుండు కట్టదగు పట్టాభిషేక కార్యంబులున్
నడిపించిరి సకల దేవతలతో వశిష్ఠ ఋష్యశృంగులున్ వేడుకన్

వచనం :- పట్టాభిషేక రాముని, సీతారాములను దశరథుడు అందరూ చూచు చుండగ అక్షింతలు వేసి దీవించిపోయె వశిష్ఠ, ఋష్యశృంగులు, గౌతమమహర్షి శతానంద జనకాదులు, ఇంద్రాది అష్ట దిక్పాలకులు, గంగ, గౌరితో ఈశ్వరుడు, సావిత్రి, గాయత్రి, సరస్వతితో బ్రహ్మ. ముప్పది ముక్కోటి దేవతలతో కూడి కౌసల్యా, కైకేయి, సుమిత్రాదులతో సునాయాన, అరుంధతి, శాంతాది మునిపత్ను లతో, లక్ష్మణ, భరత, శత్రుఘ్నాది తమ్ములతో కూడి హనుమదాది భక్త సనక సనందసనత్కుమారాది నారద తుంబురాది మునిమండలముతో శ్రీ సీతారాములకు నవరత్నఖచిత సింహాసనమున అధిష్టింప దలచి, ఋషులు, పురోహితులు స్వస్తి వచనములు పలుక గజారోహణమున సీతారాముల మహోత్సవము మహావైభవ ముగా జరిగె దశరథుడు రత్నకిరీటము నలంకరించె. దేవతలు పూలవర్షం గురి పించిరి. దేవదుందుభులు మ్రోగె.

శ్లో॥ కౌసల్యాసుతం సర్వ కుంకుమ కుండల
మంజీరం తారహార కేయూర భద్రికా ధిక్కారం
నిత్యకల్యాణం నిఖిల జన సేవితం మారుతీ పూజితం
శ్రీరామం భజే శ్యామలం

గీ॥ రామచంద్రుడనియె ఓ పౌరులార
వినుడు మీరెల్ల వీనులబడ
పదునాలుగేడులు ప్రభు భరతునకు
పన్నుగట్టక రాజ్యపాపంబు అబ్బె మీకు ఇప్పుడు

వచనం :- కాన పాపనివారణార్థంబు పన్ను కట్టవలెనన్న ప్రజలు రాముడెంత గడుసువాడు అనుకొనిరి. వానర శ్రేష్ఠులకు కావలసినంత బహుమానము ఇచ్చె. అంజనేయునకు నా నాల్గవ తమ్ముడని కౌగలించె, అదిగని సీత సహింపలేక రత్న హారమిడియె. రామతారకము లేదని హారము నమిలి పారవైచె, అది గని రాముడు కోపమున ఇట్లనియె.

ఉ॥ గర్వంబున కన్ను గానక బలశాలిననుచు
పదుగురు గల సభలోన జంకు లేక
రాజీవనేత్రుని తల్లి సీత నవమానమొనరించినావు
నిజముగ భక్తుడవైన నిరూపించు హనుమ

వచనం ;- శ్రీ రామా యని మకరకుండల కేయూర కోదండపాణి నిత్య సత్య వ్రతుండు శ్రీరామ పాదంబు గతియని ధ్యానింతునేని, సీతా లక్ష్మణ సహితుడై నా హృదయమున నిలచు గాక వక్షము చీల్చినంతనే సీతా రామ లక్ష్మణులు హృదయమున సాక్షాత్కరించిరి అందరూ చూచి, శ్రీ హనుమాన్‌కు జై అని అందరూ సంతసించిరి. మారుతి యథారూపం దాల్చెను.

మ॥ పన్ను అడిగిన లేదని ప్రార్థించినారు
సరియె మా ఇంట గల ధనము లెత్తుమనగ
వలదు దానికి బదులుగ మీరు ఇంటికి ఒక్కరు
ఒక్కొక్క గుమ్మడికాయ ఇచ్చిన చాలు నాకు

వచనం :- రాముడు వెర్రివాడని చనిరి. ఇంటికి బండెడు గుమ్మడి కాయలు ఇత్తుమనిరి. అందరూ గుమ్మడిపాదులు వేశారు. సుగ్రీవుడు వేరుపురుగై రామాజ్ఞ తో తొలిచివేశాడు పౌరులంతా వచ్చి రామా! గుమ్మడి చెట్టు ఒక్కటీ బ్రతుకలేదు ఇంటికి ఒక్క బంగారు గుమ్మడికాయ తెచ్చి ఇస్తాము గాని గుమ్మడికాయ తేలేము అని అన్నారు. సరే అన్నాడు. మంచి గుమ్మడికాయ త్రాసులో వేసి హనుమా నీవు సూక్ష్మరూపంలో గుమ్మడికాయలో కూర్చోమన్నాడు. ఇండ్లలో ఉండే బంగారం మొత్తం తెచ్చి వేశారు. తూగలేదు అప్పుడు రాముడు మీ ఇంట్లో ఇంకేమీలేదా? భార్యమాంగల్యాలు తప్ప ఇంకేమీ లేదు. సర్వం శ్రీరామార్పణం అని అవికూడా తెచ్చి వేయండి. వెయ్యగానే సరిగ్గా తూగింది.

మ॥ సకల జనుల కాపాడు ప్రభుడ నేను
పదునాల్గు వర్షములు పన్ను కట్టని
పాపమునకు రామరాజ్యంబు అధర్మ రాజ్యంబు
మీ కారణమున గాకుండ మిమ్ముల పవిత్రుల వేసితి

వచనం ;- అని చెప్పి మీమీ ధనముల గొనిపొండన రాముడు ధర్మాత్ముడని వారి వారి ధనములు గొని పోయిరి వానరులు వారి వారి నివాసములకు జనిరి.

విభీషణుడు లంకకు పోయెను. సీతారాములు ధర్మము తప్పక నాలుగుపాదముల రాజ్య పాలన చేస్తున్నారు శ్రీరామచంద్రుని, సీతమ్మను వేనోళ్ళ వినుతి చేయుచుండిరి అయోధ్య సాక్షాత్ వైకుంఠంగా విరాజిల్లుచున్నది. శ్రీ సీతా రాములకు ముత్తయిదువలంతా ముత్యాల మంగళహారతులిస్తున్నారు.

కాంభోజి — ఆది తాళం

మంగళం సీతారాములకు మంగళం
శ్రీ సీతారాములకు మంగళం
పట్టాభిరామునకు మంగళం
దశరథ కుమారునికి మంగళం
కౌసల్యా తనయునకు మంగళం
శ్రీ అంజనాగర్భునకు మంగళం
కల్యాణ దంపతులు ఉమాశంకరులకు మంగళం

—; శ్రీరామపట్టాభిషేకం పరిసమాప్తం ;—

శ్రీ జాగర్లపూడి సుబ్రమణ్యం శాస్త్రి గారి శిష్యురాలు మరియు
శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు గారి శిష్యురాలు
శ్రీమతి కోటా ధనలక్ష్మమ్మ భాగవతారిణి రచించిన
శ్రీ అమృత రామాయణం సంపూర్ణం.

గీ॥ శ్రీ అమృతరామాయణము స్థిరమ్ముగ చేసితిని
నాదగు తప్పులు మన్నించి మహ
నీయులెల్లన్ అంకితము చే
సితిని శ్రీ శ్రీనివాసునకునూ

మోహన — ఆది

నిత్యకల్యాణులకు నిరుపమా సుందరులకు
మంగళం నిత్య మంగళం
జానకీరాములకు పట్టభద్రునకు

మంగళం ॥ మంగళం ॥ మంగళం

# అనుబంధము

## రావణ, కుంభకర్ణ జనన వృత్తాంతం

మంజరి : పూర్వకాలమున బ్రహ్మపుత్రు పులస్త్యుండు
మేరు పర్వతము నందు తపము చేసె దానెపుడు

వచనం :- పులస్త్యుడు మేరుగిరి పర్వతమున తపమాచరింప తృణబిందు అనే కన్య వచ్చి చెలులతో కూడి ఆటలాడి, పాటలుపాడి తపోభంగము చేయుచుండిరి. పులస్త్యబ్రహ్మ ఎంత చెప్పినా వినక వచ్చుట చూచి ఈ పర్వతము మీదికి వచ్చిన వారు గర్భవతులగుదురని శపించె. తృణబిందుకన్య శాపం మరచి వచ్చి గర్భవతి అయినది.

గీ॥ నీవలన గర్భమొదవె నీవె
పెండ్లి యాడిన నింద నశించుననుచు
పెండ్లి చేసె పులస్త్యునికి
విశ్వవసుడను బాలుడు జననంబయ్యె

వచనం :- ఆ బాలునకు విశ్వవసుబ్రహ్మ అని నామకరణం చేసిరి. ఆ కుమారుడు విద్యలలో ఆరితేరిన విశ్వవసునకు భారద్వాజ మహర్షి కుమార్తె భారతి నిడి వివాహము చేసిరి భారతి యందు వైశ్రవణుడను కుమారుడు జన్మించె. సకల విద్యలలో ఆరితేరిన కుమారునికి తండ్రి విశ్వవసుబ్రహ్మ వుపదేశమిచ్చి, తల్లి, తండ్రి దీవించారు. అడవికి పోయి ఘోరతపస్సు చేశాడు వైశ్రవణుడు. బ్రహ్మ ప్రత్యక్షమై నీకేమి వరం కావాలన్నాడు? తాతగారికి నమస్కరించి నన్నొక దేశాధిపతిగ చేయమని కోరాడు, సువర్ణపట్టణమను లంకారాజ్యమును పాలించుకొనుము అని తాతగారు మనుమడికి పుష్పకవిమానం ఇచ్చాడు. అది పది లక్షలు, కోట్లు, ఎంతమంది కూర్చున్నా అంతమంది సరిపోతారు దాని మహిమ అది వైశ్రవణుడు ఈ శుభవార్త తల్లి, తండ్రికి చెప్పినంత లంకారాజ్యమునకు పట్టాభిషేకం చేశారు లంకారాజ్యం పాలిస్తున్నాడు వైశ్రవణుడు.

సుమాలి అనే రాక్షసుడు పాతాళ లోకములో వుంటాడు. అయనకు కేకసి అనే కుమార్తె వుంది ఈ లంకారాజ్యం పరిపాలన చేసే మనుమడు కావా

లని ఇష్టం. కేకసి కుమార్తెను తీసుక వచ్చి విశ్వవసు బ్రహ్మ సేవలు చేయుమని అప్పగించి వెళ్ళాడు ఆరు మాసముల నుండి సేవించినను విశ్వవసుబ్రహ్మ కన్ను తెరువ లేదు. ఒకనాడు కేకసీ! నీ యందు అనురాగము కలదని చెప్పె.

గీ॥ గాంధర్వవిధిని కేకసిని పెండ్లియాడె
యెన్ని వత్సరములు గడచినా కనులెత్తి చూడడాయె
విసిగి కేకసి సంధ్యాసమయము నొక్కనాడు
కూటమి కోరినంత సుఖభోగముల నొసగి అనియె మౌని

వచనం ;- కేకసీ! సంధ్యాసమయమున కూటమి కోరితివిగాన నీకు లోకకంటకుడైన కుమారుడు జన్మించును. కేకసి గర్భము ధరించింది. పది సంవత్సరము లయినది. ఒక్కనాడు విశ్వవసుబ్రహ్మతో నిట్లనియె స్వామీ! ఇప్పటికే పదిమంది కొడుకులు పుట్టేవాళ్ళు అనిఏడ్చింది. అంత విశ్వవసుబ్రహ్మ పదుగురుతో సమాన మయిన వాడు ఒక్కడే కొడుకు పుడతాడని చెప్పాడు పది వత్సరములకు ఒక కుమారుడు పుట్టాడు.

మోహనరాగం — రూపకం

పల్లవి : జనియించెన్ రావణుండు
అనుపల్లవి: రాసభము వలె అరచుచు ॥జ॥

చరణం ; కాక ఘూక జంబూకంబులు
రాబందులు భూతంబులు
నవగ్రహంబులు నృత్యము
లాడగ దశకంఠుడు ॥జ॥

వచనం :- పది తలలు, ఇరువది చేతులతో బుట్టిన తల్లి, దాదులు భయపడి పరువిడిరి. అంత విశ్వవసుబ్రహ్మ గని యక్షరాక్షసులు తిరుగువేళ సంధ్యాసమ యమున కూడిన కారణమున ఇతడు లోకకంటకుడైన కుమారుడుగ పుట్టినందున విచారించి రాసభము(గాడిద)వలె అరచిన కారణమున రావణుడని పేరు పెట్టారు పది తలలు ఉన్నందున దశకంఠుడని నామకరణం చేశారు మరల సంధ్యాసమ యమున కూటమి కోరినందు వలన కుంభకర్ణుడు పుట్టె. కుండల వంటి చెవులు వుండుట చేత కుంభకర్ణుడని నామకరణం చేశారు. పతియాజ్ఞ వలన కూడిన కార

ణమున విభీషణుడు పుట్టాడు. ఆ తరువాత శూర్పణఖ చేటల వంటి గోళ్ళున్న కారణము చేత సంస్కృతంలో సూపంటే చేటగనుక శూర్పణఖఅని పేరు పెట్టారు శుక్రాచార్యుల వద్ద వేద శాస్త్రాలు, ఉపనయనము, అస్త్ర విద్య నేర్చుకొని యుక్త వయస్సుకు వచ్చారు.

ఒకనాడు వైశ్రవణుడు వచ్చి తండ్రి విశ్వవసు తొడమీద కూర్చున్నాడు. రావణాసురుడు చూచి నా తండ్రి తొడ మీద కూర్చున్నావా అని తోసేశాడు అప్పుడు కేకసి చూచి దుర్మార్గుడా! మీ పెద్ద తల్లి కుమారుడు మీ అన్నగారు, లంకాధిపతి. బ్రహ్మను గూర్చి తపస్సు జేసి వరములు పొంది గొప్ప వరములు పొంది గొప్ప విద్యలు నేర్చుకొన్న మీ అన్నను తోశావు గనుక క్షమాభిక్ష కోరుకో అన్నది. వైశ్రవణుని పాదముల బడిన లేవనెత్తి పోనీలె నాయనా తెలియక జేశావు గనుక నేను క్షమించానన్నాడు.

తల్లిదండ్రుల ఆజ్ఞ తీసుకొని రావణ, కుంభకర్ణాదులు ఘోరాటవికి తపస్సుకు వెళ్ళిపోయారు. ఏకపాదాంగుష్టమున ఎన్నియో సంవత్సరాలు తపస్సు జేశారు. అగ్నిని కల్పించి తొమ్మిది తలలు నరికి అగ్నిలో బడవేశాడు.

ఉ॥ మెచ్చితి నీ తపమునకు ఇచ్చెద కోరిన వరములు
ఇదిగొనుమన్న కన్నులు దెరచి చూచి దశకంఠుడు
దేవా అమరత్వము అజేయత్వ మొసగుమన
కాదనిన నరవానరులచే తక్క చావు లేక వరములు పొందెన్

వచనం; - అంత వరములు గొని దేవా! ధన్యుడనైతిని. అనిన రావణా! నీ తొమ్మిది శిరములు అగ్నిలో వేసిన కారణమున నీవెప్పుడు తలచుకుంటే అప్పుడు నీ శిరస్సులు నీకు వస్తాయి అని చెప్పి కుంభకర్ణుని దరికేగె దేవతలంతా సరస్వతీ దేవిని ప్రార్థించి అమ్మా! వాడు గొప్ప వరాలు కోరబోతున్నాడు. నీవు వాని జిహ్వలో చేరి వరములు తారుమారు జేయుమని కోరుకున్నారు. కుంభకర్ణుని జిహ్వలో చేరింది భారతి.

వత్సా! నీకేమి వరములు కావాలో కోరుకొనుము. స్వామీ! ఆరు నెలలు నిద్ర, ఒకరోజు భోజనం కోరాడు. సరస్వతి వెళ్ళిపోయింది. దేవా నే కోరవలసిన వరములు ఇవి కావు. కుంభకర్ణా! ఇక లాభం లేదు అని విభీషణుని దగ్గరకు వెళ్ళాడు. భక్తా విభీషణా! నీకేమి వరములు కావాలో కోరుకొనుము. అప్పుడు

స్వామీ! ఎల్లప్పుడు విష్ణుభక్తి ఉండునట్లు నాకు ప్రసాదింపుము. అట్లేయగుగాక యని బ్రహ్మ వెళ్ళిపోయాడు. ముగ్గురు కలసి రాజ్యం చేరుకొని తల్లి, తండ్రికి జరిగినది చెప్పారు. రావణాసురుడు తన అన్నపై యుద్ధం జేసి లంకారాజ్యం గెలుచు కొందునని పోబోవ, అంత వైశ్రవణుడు నీకే పట్టం కడతానని రావణుని లంకా రాజ్యానికి పట్టం కట్టాడు.

రావణుడు లంకా రాజ్యం పరిపాలన చేస్తున్నాడు. నాలుగు లక్షల తొంభై ఆరువేల సంవత్సరాలు రాజ్యపాలన చేశాడు వెయ్యిన్నూట ఇరవై యేళ్ళ తాళ్ళ ప్రమాణం ఎత్తు గలవాడు. కుంభకర్ణుడు ఇలా అని ఒళ్ళు విరిస్తే ఆకాశం తగులుతుంది. అలాంటి వాళ్ళు

ఒక నాడు వాళ్ళ తాతలు సనక సనందనాదులు వచ్చారు. తాతా! చావు లేక వరం తీసుకున్నాను. నాకు చావు వుందా? చెప్పండి అని అడిగాడు. వాని చెయ్యి చూచి, నీకు మరణం తప్పదని చెప్పారు. లంక విభీషణుడు పరిపాలిస్తాడు అని చెప్పి వెళ్ళిపోయారు.

ఒకనాడు కైలాసానికి వెళ్ళాడు రావణుడు. నేను మహా వీరుడనని, గర్వంతో కైలాసపర్వతం ఎత్తేశాడు. పరమశివునకు మెలకువ వచ్చి కాలి బొటన వ్రేలితో ఒత్తేశాడు. రావణుని ఇరవై చేతులు కైలాస పర్వతం క్రింద నలిగి పోతుంటే అర్చటింపి, అరిస్తే లోకాలు దద్దరిల్లినవి. ఎవరా ఒత్తిన వాళ్ళని పైకి వచ్చాడు అప్పుడు నందీశ్వరుడు రావద్దని అడ్డుకున్నాడు. కోపంతో రావణాసురుడు నీ రూపం కోతి రూపంగా మారిపోవు గాక అని శపించాడు. ఆ కోతి రూపం గల వానితోనే నీవు, నీ లంక నాశనమై పోవు గాక అని శాపం ఇచ్చాడు. అప్పుడు రావణాసురుడు కైలాసం దిగిపోయి తన పేగులు తీసి వీణగా చేసి వాయిస్తున్నాడు అప్పుడు పరమశివుడు మెచ్చి రావణా! నీ కేమి వరం కావాలో కోరుకోమన్నాడు. అప్పుడు కైలాసం ఎత్తానన్న అహంకారముతో ఏమి కావాలీ అనుకుంటూ ప్రక్కనున్న పార్వతీదేవిని చూచి మోహపరవశుడై, ఓ పరమేశ్వరా! నేనడిగిన వర మిచ్చెదరా? తప్పక ఇచ్చెదను అట్లయిన ఆమెను, నీ ప్రక్కన నిలచిన ఆమెను నాకిచ్చిన నే సంతోషించెదను, అంటే పార్వతినా? రావణా! నీ కేమి చేటుకాలం దాపురించెను, ఆమె ఎవరనుకున్నావు? ప్రపంచానికి ఆదిశక్తి, నా భార్య, వెకిలి నవ్వు నవ్వి ఎవరయితే నాకేమి? నేనడిగిన వరమివ్వు, సరే పార్వతీ! వాని వెంట వెళ్ళమన్నాడు శివుడు.

మ॥ వాలుకనుల పతిని వయ్యారమున జూచుచు
పోవుచుండె సతీదేవి పొరలు దుఃఖమున
నందీశ్వర భృంగీశ్వర ప్రమదగణములు
ఆహారవములు చెలగ రావణుని వెంటబోయె

వచనం ;- ఆ సమయంలో నారదుడు చూచి, ఎంత ఘటికుడవురా రావణా? అనుకొనుచూ దశకంఠా! నాకు చెప్పకుండానే వివాహమాడితివా? లేదు స్వామీ! ఈశ్వరుడు మెచ్చి ఇచ్చిన పార్వతి, ఈ సౌందర్యరాశిని పెండ్లియాడ బోవుచుంటిని.

ఉ॥ వెఱ్ఱి కుదిరె రోకలి తల జుట్టుమన్నట్లు
హరుడు ఆదిశక్తి నీ కొసంగునే ఇది విన్న నవ్వరే
మోసగించెను నిన్ను దాసిని పార్వతి యని పంపినాడు
మూడు నేత్రములవాని మాట నమ్మినావు

వచనం :- నారదా! ఈమె పార్వతి కాదా? కాదు రావణా. నేను నీ తాతను కదా మోసగింతునా అని. అమ్మా! వికృతాకారం దాల్చుమని సైగ చేశాడు. రావణుడు చూచేవరకు భూతంలాగ కనబడ్డది ఎంత వెఱ్ఱివాడవురా రావణా? అవును తాతా మోసపోయాను అయితే ఇప్పుడు పార్వతి ఎక్కడ వుందని అంటావు? అం చూచాను, చూచాను, గృహాంతరాలలో దాచాడు పార్వతిని. అయితే వెళదామా? నీవు పోతూవుండు. నాలుగు చీవాట్లు పెట్టి ఈమెను ఆ శివునికి అప్పగించి వస్తాను ఇద్దరూ పుష్పక విమానంలో వెళ్ళారు

మయబ్రహ్మ ఒక గృహాలో మండోదరిని దివ్యసౌధం కట్టి బంగరు తూగుటుయ్యాలలో ఆమెను పెంచుతున్నాడు అని అక్కడకు తీసుకొని వెళుతున్నాడు నారదుడు తప్పించుకున్నాడు. అంత మండోదరిని చూచి

కల్యాణి — ఆది తాళం

పల్లవి : కనులు మిరుమిట్లు గొలుపు కలికి హొయలు చూడ
అనుపల్లవి: ఇది కదా పార్వతి ఎంత మోసగించె నన్ను "క॥

చరణం ; ఇంతి కాదిది పూబంతి చామంతి అందముల దొంతి
కుందనపు బొమ్మ కురంగవేణి తప్పక పెండ్లియాడెద ॥క"

వచనం ;- అంత రావణాసురుని చూచి మాండోదరి వానినే వివాహమాడదలచి తలవంచి. అంత రావణాసురుడు కన్నియా! నీ సౌందర్యం జగద్విదితం. నిన్ను వివాహమాడెద అనిన అంతకన్న మహాభాగ్యమేమున్నది. అంత రావణాసురుడు గాంధర్వ వివాహం చేసుకొని రాబోతుంటే అంత మయబ్రహ్మ వారిరువురికి వివాహము చేసి పంపించాడు. అంత కేకసి మహా సంతోషముతో కొడుకు, కోడలును దీవించి, ఎవరి కుమార్తె అని అడిగింది కేకసి. అమ్మా! శివుని భార్య పార్వతి. రావణా! మతిపోయిందా? ఎందుకలా మాట్లాడుతున్నావు. లేదమ్మా పరమశివుడే మెచ్చి నాకిచ్చాడని అన్నాడు. ఈ విధంగా వాదోపవాదాలతో సతమతమై పోతున్నారు. అంత నారదుడు వచ్చి మాండోదరి మయబ్రహ్మ కుమార్తె యని, ఆమె జన్మవృత్తాంతం ఈవిధంగా చెప్పదొడగె.

## మాండోదరి జన్మ వృత్తాంతం

చీమలు దూరని చిట్టడవి, కాకులు దూరని కారడవిలో సరసాత్ముడనే మహాఋషి అడవిగోవు పాలు ఒక ఆకు దొప్పలో తెచ్చుకొని పొదలో దాచి తన అనుష్టానం కాగానె ఆ పాలు, ఫలములు భగవంతునికి అరగింపచేసి, ఫలములారగించి ఆ పాలు త్రాగేవాడు.

ఒకనాడు తపస్సులో కూర్చొని వుండగా, ఆ దొప్పలో పాలు ఒక పాము వచ్చి సగము త్రాగి విడిచిపెట్టి వెళ్ళిపోయింది. బొరియలో నుండి కప్ప చూచి అయ్యో మహర్షి ఆ పాలు త్రాగితే చచ్చిపోతాడని ఆ కప్ప ఆ పాలు త్రాగి చచ్చి అందులోనే పడివుంది అది చూచి మహాఋషి దివ్యజ్ఞానం వలన సర్వం తెలుసుకొని నోరులేని జంతువు ఇంత వుపకారం చేసిందని, ఆ కప్పను తన తపోశక్తి ధారపోసి కన్యగా చేశాడు లక్ష్మీనారాయణులను కొలిచేవాడు గనుక సాక్షాత్ లక్ష్మిలాగున్నది సంస్కృతంలో కప్పను మండూకం అంటారు గనుక మాండోదరి అని నామకరణం చేశారు.

ఒకనాడు రావణుడు సూర్యునికి అర్ఘ్యమిస్తుంటే రావణాసురుణ్ణి తోకకు చుట్టి సప్తసాగరాల్లో ముంచాడు వాలి. వాలి. దశకంఠుడు ప్రాణస్నేహంగా వుండే వాళ్ళు ఆ మాండోదరిని చూచి వాలి రావణాసురుణ్ణి ప్రేమించే సమయంలో ఎత్తుకొని పారిపోయాడు. రావణుడు వెంటబడ్డాడు వాలి ఆమెను పొందేవరకు తొమ్మిది ఘడియల్లో అంగదుడు పుట్టాడు. కొడుకు నెత్తుకొని కిష్కింధకు వెళ్ళిపోయాడు

వాలి. మాండోదరిని తీసుకోమని అప్పగించాడు రావణునకు. రావణ బ్రహ్మకు కోపం వచ్చి, ఆమెను రెండు భాగాలుగా తాటిమట్టల్లాగ చీల్చి ఒక భాగం ఉత్తర దిశలో ఒక భాగం దక్షిణ దిశలో విసరివేసి వెళ్ళిపోయాడు.

ఈ సంగతి ఆ మహాఋషికి తెలిసి దక్షిణదిశలో వున్న భాగమును మాండోదరిగా జేసి, ఉత్తర దిశలో వుండే భాగం తారగా చేశాడు. తారను వాలి వివాహం చేసుకున్నాడు. మండోదరిని సంతానంలేని మయబ్రహ్మకు అప్పగించాడు మయబ్రహ్మ కొండగృహ తొలిచి పెద్ద మేడ కట్టి మండోదరిని అందులో పెంచు తున్నాడు. ఆ మాండోదరియే ఈమె. పార్వతి కాదు. రావణుని వంచించి, ఆది శక్తి పార్వతిని శివునికప్పగించి ఈ మాండోదరిని నీ కుమారుడు రావణునికి ఇచ్చి వివాహం చేయించాను.

అప్పుడు పార్వతి స్వామీ! ఈ లంక ఎలావచ్చింది అని అడిగింది. శివుడు ఇలా చెప్పుచున్నాడు.

తన తల్లి వినుతను దాస్యవిమోచనం చేయాలంటే మాకు అమృతం తెచ్చి ఇవ్వావంటే నీ తల్లి దాస్య విమోచనం అవుతుంది అని గరుత్మంతుణ్ణి పాము లడిగినవి గరుత్మంతుడు నరేసని తండ్రి కశ్యపప్రజాపతి దగ్గరకు వెళ్ళి నాన్నా! నా తల్లి దాస్య విమోచవానికి స్వర్గానికి వెళుతున్నాను, దేవతలతో యుద్ధం చేయ డానికి నాకు మంచి ఆహారము ఎక్కడ వుందో చెప్పుచున్నాడు. అప్పుడు కశ్యప ప్రజాపతి మేరుగిరిపర్వతము దగ్గర ఇద్దరు అన్నదమ్ములు ఒకడు కూర్మం, ఒకడు ఏనుగుగా మారిపోయారు వాళ్ళను తీసుకొనిపోయి నీవు తినమని చెప్పాడు. పర్వ తం లాగ వుండే ఏనుగును కూర్మాన్ని కాళ్ళలో ఇరికించుకొని ఒక నేరేడు చెట్టు కొమ్మపై వ్రాలాడు. ఆ చెట్టు ఫెళఫెళ విరిగే వరకు దాన్ని కూడా కాళ్ళలో ఇరి కించుకొని తండ్రి వద్దకు వెళ్ళి నాకు తినడానికి జాగా చూపించమన్నాడు. సము ద్రాల మధ్యలో వెళ్ళి తినమన్నాడు అలానె తిని ఆ కొమ్మ అక్కడనె పడేసి వెళ్ళి పోయాడు. దాన్ని విశ్వకర్మ ఆ నేరేడుకొమ్మ మీద బంగారముతో లంకారాజ్యం నిర్మించాడు ఆ నేరేడు కొమ్మ నూరు ఆమడల పొడవు అరవై ఆమడల వెడల్పు సువర్ణ లంక అంటారని పరమశివుడు చెప్పెను.

—0—0—